2 3194
136

# భారతీయ
# చారిత్రక స్థలములు

రచన:
విద్వాన్ M. V. R. కృష్ణశర్మ, B. O. L.




వాహినీ పబ్లిషింగ్ హౌస్
విజయవాడ-2.

వాహినీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
అక్టోబరు 65.

వెల : రు. 5-00 సాదాప్రతి
రు. 6-00 మేలుప్రతి

ముద్రణ :
పరమేశ్వరీ ప్రెస్,
విజయవాడ-2.

3

# విజ్ఞప్తి

మన దేశములో అనేక యాత్రాస్థళములు, చారిత్రక ప్రదేశములు గలవు. క్రీస్తుకు పూర్వం పాశ్చాత్య నాగరికత ప్రబలకముందునుంచి కూడ మనదేశము ప్రత్యేక సంస్కృతిని గలిగియుండి చారిత్రకముగా మిక్కిలి ప్రసిద్ధిగాంచియున్నది. వివిధదేశములనుండి వచ్చిన అనేక మంది చరిత్రకారులుగూడ మన జాతి యొక్కయు, దేశము యొక్కయు ఔన్నత్యమును గురించి కీర్తించియున్నారు. అట్టి కీర్తిని సంపాదించిన మన దేశములో చారిత్రకప్రసిద్ధినందిన ప్రదేశములు పెక్కు గలవు. మేము ఆయా స్థళములయొక్క ప్రాముఖ్యతను గురించి ఈ పుస్తకములో సాధ్యమైనన్ని వివరములతో ప్రచురించుచున్నాము. గాన గ్రంథాలయాధి కారులు.పాఠకులు ఈ మా కృషికి తగిన ప్రోత్సాహమివ్వగలరని ఆశించు చున్నాము.

ఇట్లు,
ప్రకాశకులు.

# అజంత

అనంతమైన సృష్టిలో సౌందర్యవంతమైన కళాఖండములెన్నొ మిన్నఁగానున్నవి. వానిలోఁ గొప్పగాఁ జెప్పఁదగినది అజంతగుహాలశిల్పము. ఆశిల్పకళాఖండములనల్పమైన కీర్తినిఁ బ్రపంచమునందు పొందినవి. ఈ అంజతాగుహాలు హైదరాబాదు సంస్థానములోని ఔరంగాబాదు జిల్లాలో బుకర్దన్ తాలూకాలో నున్నవి. ఆ ప్రాంతంబునందు అజంత యనెడి చిన్న గ్రామంబుకూడఁ గలదు. ఆ చిన్న గ్రామంబునకు వాయువ్య దిక్కున అజంత యనునొక పర్వతపంక్తి వ్యాపించి యున్నది. ఆ పర్వతలోయలో మలచఁబడిన గుహాలేయజంతా గుహాలని సాటిలేని మేటి యశమును బడసినవి. ఈ గుహాలు ఔరంగబాదునగరమునకు నలువది మైళ్ళదూరములోను, జలగాంకు ముప్పదినాల్గుమైళ్ళ దూరములోను, ఫరీదాపూర్‌కు నాలుగుమైళ్ళ దూరములోనున్నవి. బౌద్ధమతమును స్థాపించిన గౌతమీబుద్ధుని యవశేషములిందుఁగలవు. వానిపై ఆయన శిష్యుల స్థూపాలను, విహారాలను, సంఘారామములను, నందమైన రాళ్ళతోఁ బసందుగాఁ గన్నులవిందుగా నిర్మించిరి. ఇందుఁగట్టఁబడిన స్థూపములచుట్టు బుద్ధమహాత్ముని జీవితగాధలను జిత్రించు శిల్ప ఫలకంబులమర్పఁబడి యున్నవి. అందలి శిల్పకళయత్యద్భుతముగానుండి మిక్కిలి కీర్తినిఁగాంచెను.

అజంత గుహలకు సమీపమందున్న ప్రదేశమంతయు భయంకరారణ్యము. అందుచేనందు ప్రవేశించుటకుఁ బూర్వము వీలుగాకుండెడిది. ఆంగ్ల సేనాపతియయిన అలగ్జాండరు స్మిత్ యను నతఁడు మొదటవానిఁ గనుఁగొనెను. అనేక సంవత్సరములనుండి, యెవరికిఁ దెలియక మట్టిలోను, రాతిగుట్టలలోను బూడియున్న వీనిని గాంచెను. వానిశిల్పకళా ప్రావీణ్యమునకు వానిలోనున్న చిత్రలేఖనమునకాశ్చర్యపడెను. ఆ సేనానిలోకమునకు నివ్విషయముల వెల్లడించెను. అదివిని పాశ్చాత్యులువ్యయ ప్రయాసలకోర్చి, ఈ ప్రదేశమునుదర్శింపఁజొచ్చిరి. అందలి శిల్పకళావిశిష్టతను, చిత్రలేఖనా ప్రావీణ్యతను జాటఁజొచ్చిరి. ఇక్కడ 100 అడుగుల యెత్తుగల యొకచక్కని గుహాలయమున్నది. అందులో దాదాపు 70 యడుగుల యెత్తుననున్న బుద్ధవిగ్రహ మొకటి యున్నది. ఆ విగ్రహమేడు మంచాల వరుసలమధ్య ప్రతిష్ఠితమైయున్నది. ఈ మంచాలొకదానితో నొకటి విడఁదీసి యొకదానికొకదానికి మధ్య సుమారు మూఁడడుగుల దూరమున నెత్తుగాఁగడు పసందుగా నమర్చియున్నవి. బౌద్ధమతంబు ప్రచారంబందున్నంతకాలం బీ గుహల గొప్పఁదనంబు వెల్లడియగు చుండెడిది. క్రీ॥శ॥ 7 వ శతాబ్దమున హుయానుసింగు అను చైనా యాత్రికుఁడీ గుహలను సందర్శించెను. అప్పటివాని కళా ప్రాశస్త్యమును, చిత్రలేఖనా విశిష్టతనునచ్చి విపులముగా వర్ణించి ప్రకటించెను.

బౌద్ధమతము క్షీణించిన పిదప నీ గుహలను సందర్శించువారి సంఖ్యకూడఁ హెచ్చుగాఁ దగ్గఁజొచ్చినది.

అక్కారణమున నిగ్గుహలు పర్వతారణ్యముల మధ్య యగో చరమై యనన్యసాధ్యమై యుండిపోయెను.

( క్రీ॥ శ॥ పందొమ్మిదవ శతాబ్దము మొదట ఆంగ్ల సేనాని యయిన జేమ్సు అలగ్జాండరుస్మిత్తు వీనిని దర్శించి యిందలి యశేష విశేషంబులను ప్రపంచంబునకుఁ బకటించెను.) క్రీ॥ శ॥ పదునెనిమిదివందల నలువది తొమ్మిదవ సంవత్సరమున మేజరు గిల్ అనునతఁడు అజంతా గుహలను గాంచి యాశ్చర్యపడెను. అతఁడు వెంటనే వానికి సరియగు నకళ్ళు తీయించెను. కాని యవి దురదృష్టవశంబున లండన్‌లోఁ నగ్నిప్రమాదంబున దగ్ధమైపోయినవి.

క్రీ॥ శ॥ పందొమ్మిదివందల రెండవ సంవత్సరమున ఫెర్గూసన్ అనునతఁడు అజంతా గుహలను సందర్శించెను. అందలి కళానైపుణ్యమునకు, చిత్రలేఖనావిశిష్టతకును నబ్బురపడెను. అందలి గొప్పఁదనమును నతఁడు వెంటనే ప్రకటించి, వాని వ్యాప్తికి మిక్కిలి కారణభూతుఁడై, వాని కెక్కువ కీర్తినిఁ గలిఁగించెను. ఈ అజంతా గుహలు మొత్తము యిరువదితొమ్మిది గలవు. ఇందు 'వాఘురా' అనునొక చిన్న జలప్రవాహము గలదు. ఈ నీటిప్రవాహమున కుత్తరపు టొడ్డు వెంట నిట్రముగా రెండువందల యేఁబది అడుగుల యెత్తుగల యొక కొండగలదు. అది గుఱ్ఱపునాడ రూపమున నుండును. ఈ 'వాఘురా' ప్రవాహమున కెత్తుగా నీ చైత్య విహారాలు, తూర్పుదిశనుండి పడమర దిశవఱకు కారువందల గజముల మేరకు మలఁచబడియున్నవి. ఇవి యెంతో యం

దముగాఁ బ్రశంసనీయముగా నున్నవి. 'వాఘరా' జలప్రవాహ మిఱువదియెనిమిదవ గుహ సమీపములో నొక లోయనుండి క్రిందకుఁ బడుచున్నది. చైత్యవిహారాలకు సమీపమునందుఁ గొండకోనకుఁ బైభాగమున నేడంతస్థుల నుండి లోయలోనికిఁబడు, వాఘరా జలప్రవాహమువలన నడుగుభాగమందొక జలాశయం బేర్పడినది. ఈ ప్రవాహం బేడంతస్థులనుండి పడుటవలన దీనికి శాతగుండమని పేరు గలిగినది. ఇచ్చటనుండి, యీ ప్రవాహంబు లోయగుండఁ బ్రవహింపుచున్నది. ఈ ప్రాంతమంతయు నల్లిబిల్లిగఁ బెల్లుగ నల్లుకొన్న పెద్దపెద్ద చెట్లు, భయముగొలుపు క్రూరమృగాలు గలిగి, నిర్జనమై యుండెడిది ఈ లోయల ప్రాశస్త్యమును గనుఁగొన్న తరువాత నా క్రూరమృగాలను ప్రభుత్వము గాల్చివైచెను. ఈ లోయలను దర్శించుటకుఁ జక్కని మార్గంబు లేర్పరిచిరి. అందము జిలికించు ప్రకృతిదృశ్యాలు కనులకు విందునొందించుచు, నేటికిని నానందమును నొందింపుచుండును.

ఈ యజంతా గుహలలో నిఱువదినాలుగు, చైత్యంబులుగ నిఱువది తొమ్మిది గుహలు సంఘారామములుగాఁ బ్రసిద్ధిఁజెందినవి. గొప్పఁగా వీనిని శిల్పులుఁ జెక్కిరి యేనాటికిని గొప్ప మెప్పుబొంద నొప్పిరి ఇందన్ని గుహలుగాని, చైత్యంబులుగాని యొకసమయంబున నిర్మింపఁబడినవి కావు. క్రీ॥ పూర్వము రెండవ శతాబ్దమునఁ బురాతన గుహలు నిర్మింపఁబడినట్లు తెలియుచున్నది పురాతన కాలమునందు నిర్మింపఁబడిన గుహాలలో బుద్ధదేవుని చిత్రములు గనఁ

బడవు. తరువాత నిర్మించిన గుహలు క్రీ॥శ॥ 5-6-శతాబ్దంబులందు నిర్మింపఁబడియున్నవి. వాకాటక పాలకుఁడగు హరిసేనుని మంత్రి. వరాహసేనుఁడు బౌద్ధసంఘముకొఱకు నిందుఁ బడియా అవ గుహను నిర్మించెను. అస్మకుండను రాజు పదిహేడవ సంఖ్యగల గుహను కట్టించెను. మొత్తము మీఁదఁ బ్రాచీన శిల్పకళా ప్రవీణతను వెల్లడించు నీ గుహల నాటివే—సామాన్యంబుగా నీ విహారంబు లన్నియు జతురస్రంబుగా నున్నవి. ఇందులోనున్న గోడపెంట బౌద్ధభిక్షులు శయనించుటకు విశాలంబులయిన గదులు గలవు. ఈ విహారంబు పొడుగునాఁ బైకప్పు కాధారంబుగ స్తంభంబుల వరుసలూ యా విహారంబుల వైశాల్యంబునుబట్టి యుండును. ఆ స్తంభ మధ్యప్రదేశంబొక సభాస్థలంబు విధంబుగఁ బ్రకాశిల్లుచుండును. ఇవ్విహారంబుల ముఖంబున కెదురుగా లోపలిభాగంబునందొక గది. దేవాలయంబువలె నుండును.

అందు మధ్య ప్రదేశంబున నొక గది యందమైన దేవాలయంబువలె నుండును. అమ్మందిరంబున బుద్ధదేవుని విగ్రహం బొండు స్థాపితంబై యుండును. ఆ నిలయమున కిరుదిశలందు గోడలవరుసలు గలవు. వానికిఁ బ్రక్క న భిక్షులు నివశించుటకు గదులు నిర్మింపఁబడియున్నవి. ఈ విహారంబుల ముందు గదులతోఁగూడిన యొక విశాలంబయిన యొక వసార యేర్పరుపఁబడియున్నది. ఈ విహార ముఖద్వారమ్ము లత్యంత ప్రశంసనీయమ్ముగు చిత్రకళా ప్రావీణ్యమ్ము విరజిమ్ముచుండును. ఈ ప్రతి విహారముఖమ్మునకు సమీపంబునం దొక యూ[illegible]త్రితమై యున్నది.

ఇందలి చైత్యంబులు వెడల్పునకు రెండింతల పొడవు గలిగి, వెనుకవైపు వర్తులాకారంబున నుండును. పైకప్పులు నిలువంపుగా, బట్టె యెముకవలెఁ దీర్పంబడిన చెక్కవలెఁగాక, కూర్పఁబడిన రాతివలె నేర్పుగా నిర్మింపఁబడినవి. చైత్యాల వెనుకవైపు వర్తుల భాగములో బుద్ధదేవుని స్మరణచిహ్నంబు గల యొక వేదిక రాజిల్లియున్నది. చైత్యముఖ మొక గోడవలె నుండును. అయిన నందులోఁ బ్రవేశించుటకు వీలుగ మూఁడు ద్వారంబు లిరువైపులఁ కిటికీలు గల యొక పెద్ద ముఖద్వార మమర్చియుండును. అసమాన శిల్పకళా విశిష్టత యీ గోడయందు బిట్టుగా నుట్టిపడుచుండును. అందున్న స్తంభాలమీఁదఁగూడ రమణీయంబులగు రకరకాల చిత్తరువులెంతో నైపుణ్యముతోఁ దీర్చికూర్చియున్నవి. జలప్రవాహము నుండి, ప్రతి గుహకు సోపానంబు లందంబుగా సమర్పఁబడియున్నవి. బౌద్ధభిక్షువు లిందలి మందిరంబులందుఁ బూజలఁ గావింపుచుందురు.

ఈ అజంతా గుహలు నిజముగా గుహలుకావు. దూరమునుండి చూచువారికి గుహలవలె నగుపించును. ఇందులోనికిఁబోయి చూచిన మనోహరమైన భవనంబు లటులఁ గనఁబడును. ఈ చైత్యంబులను విహారంబులను, ప్రాచీనతమము, ప్రాచీనతరములని, ప్రాచీనములని మూఁడు భాగంబులుగ విభజించిరి. ప్రాచీనతమ గుహా విహారంబులు నిర్మించినవారు లోయలోఁబ్రవహించు ప్రవాహపుటొడ్డునకు సమీపంబుగాఁ గొండ క్రింది భాగంబున నిర్మించిరి. ప్రాచీన తరంబగు చైత్య విహారంబులనుంచినవారు జల ప్రవాహ తీరంబు

నకు నైఋత్తయిన ప్రాంతంబులో నిర్మించిరి. ఇంకమూఁడవవి యగు చైత్యంబులు తరువాత కాలంబున నిర్మించినవి. ఇందుఁ జిత్రింపఁబడిన చిత్రంబులు బుద్ధుని, బోధిసత్త్వుల జీవితంబులో జరిగిన సంఘటనలేకాక, జాతకకథలనుగూడఁ జిత్రలేఖకులు విచిత్రంబులందుఁ జిత్రవిచిత్రంబులుగా లిఖించిరి. అవికాంచినచో నాటి చిత్రలేఖకుల చిత్రలేఖనా విశిష్టత గొప్పఁగానొప్పఁగా, విందుగాఁ బసందుగానుండి యుండెడిదనుట నిస్సందేహము. ఇందానాటి ప్రజల జీవితంబులను వారి సాంఘిక మతాచారంబులను, చక్కఁగా మిక్కిలి ప్రతిబింబింపు చున్నవి. వారి యలంకారములు, గృహోపకరణము లిందుఁ జిత్రింపఁబడినవి. వారియాచార వ్యవహారంబులు, దైనందిక జీవితమునచ్చునట్లు చిత్రింపఁబడినవి శతాబ్దములు గడచినను, నాటి చిత్రలేఖకుల నేర్పు గొప్పగా నాటికి నేటికిగూడ వెల్లడియగుచున్నది. ఇవియేకాకయందు వివిధ పుష్పములు, లతలు, జంతువులు, నౌకలు, చేపలు, దేవతలు, వ్యవసాయాదులు నాట్య సంగీతాభ్యసన గావించు స్త్రీ పురుషాది చిత్రము లిందుఁ జిత్రింపఁబడినవి. భిక్షుకుని మొదలు, మహారాజు వఱకు నడిపిన జీవితమును సహజముగా, స్వభావ సిద్ధముగాఁ జిత్రింపఁబడినవి. ఈ చిత్రంబుల యపురూప సౌందర్యమత్యంత వర్ణనాతీతము. ఈ చైత్యవిహారాల పైకప్పులోని చిత్రలేఖన మెంతదూరము నుండి పరిశీలించినను, నెంతో రమణీయంబుగాఁ గనఁబడును. ఇంతటి యద్భుతమును గలిగించు చిత్రకళా నైపుణ్యంబందుఁ ప్రదర్శింపఁబడినది బుద్ధభగవానునిఁ పరిశుద్ధ జీవితకథ నిందుఁ గళా నైపుణ్యబద్ధములుగా నిందుఁ జిత్రింపఁ బడియున్నవి.

అజంతా గుహల శిల్పకళను గాంచుచున్న నందలి చిత్రకళా విశిష్టతయును. చిత్రలేఖనా ప్రావీణ్యాతయును, నబ్బురపడఁగలరు. ఈ చిత్రలేఖనమందలి విచిత్రములందెనలేని సౌందర్యంబు నాపాదించి లేఖకులనుపమకీర్తిఁ, బపంచంబున సంపాదించినారు. వీరునిర్మల ధర్మబుద్ధితోను, నాధ్యాత్మిక చింతనతోను, నీ చిత్రంబులను చిత్రించిరనుట సందేహము లేదు. అందుచేత నివి యింతటి విశిష్టతను, సుస్థితను బొందినవి ఇందలి మొదటి గుహ యత్యద్భుతమైన చెక్కడపుఁబనికి జిహ్నంబుగా మనోహర విహారంబులలో నొకటిగా భావింపఁ బడుచున్నది.

ఇరువది సంఘటన లిందుఁ జిత్రితంబులై యున్నవి. ఇందుఁ బైకప్పుపైని నొక పారశీకుని విగ్రహము లిఖింపఁబడినది. రెండవ గుహయందు ముప్పదెనిమిది చిత్రంబులును వ్రాయఁబడియున్నవి. తొమ్మిదవ గుహలో. ననేక కాలంబులనాటి పంచరంగుల చిత్తరువులు మిక్కిలి యందంబుగాఁ జెక్కఁబడియున్నవి పదవ గుహ క్రీస్తుపూర్వము రెండవ శతాబ్దము నాటిదిగాను, ప్రాచీనతమమైనదిగను తలంపఁ బడుచున్నది. ఇందులో వాసిష్ఠపుత్రుని శాసనము ఒక స్తూపమున్నవి. ఈ గుహయం దన్ని దిశల మిన్నమైన చేరెన్నికఁగన్న చిత్రంబులున్నవి. పన్నెండవ గుహ ప్రాచీన కాలమందలి సంఘారామము ఈ గుహయం దన్నిదిశలందమైన చిత్రములు పొందుపఱుపఁబడియున్నవి. పురాతన కాలమునందే నిర్మితమైనది పండెండవ గుహ అదియే సంఘారామము. ఘనమదుడనే యొక వర్తకుఁడు దానమొసఁగి బ్రహ్మి లిపిలో వ్రాయించిన శాసనంబొం డిందున్నది.

పదహారవ గుహ అజంతా లోని యత్యుత్తమ విహారంబుగా భావింపఁబడుచున్నది. క్రీ॥ శ॥ 5 వ శతాబ్దమందున్న వాకటక రాజగు హరిసేనుని మంత్రియగు వరాహసేనునిచే నీ విహార మర్పింపఁబడినది. ఇందత్యంత గంభీరమై మనోజ్ఞంబైన బుద్ధవిగ్రహంబు విరాజిల్లుచుండును. ఇదిగాక యిట పదకొండు విగ్రహంబులున్నవి. హరిసేనుని సేవకులలో నొకఁడైన యస్మకునిచే పదిహేఁడవ గుహ నిర్మితమైనది. ఇందద్భుత శిల్పకళ నుట్టిపడు నఱువదియొకటి చిత్రంబులున్నవి. వానియందలి యనల్పమైన శిల్పకళ హెచ్చుగా మెచ్చఁదగినది. బౌద్ధుల శిల్పకళకుఁ బరిపూర్ణ చిహ్నమైనది పందొమ్మిదవ గుహ. ఇఱువదియారవ గుహ చైత్యము. ఇందు రెండు శాసనంబు లున్నవి. ఇందు మరణదశలోనున్న బుద్ధ ప్రతిభ కూడఁ గలదు. మన్మథుని బాణమునకు గురియై మోహతాపంబులొందుఁ జిత్రంబుకూడ నిందుఁగలదు. పదియాఱవ గుహలో నొకచో మరణావస్థలోనున్న యొక స్త్రీ చిత్రమిందు విచిత్రాతిచిత్రముగఁ జిత్రితమైనది. పదవ చైత్యమందు సుందరీమణులతో నానందించు రాజు చిత్రంబు చిత్రింపఁబడినది. ఈ చిత్రంబు చూచువారి స్తోత్రంబునకుఁ బాత్రంబైనది. పదియాఱవ గుహలో మరణశయ్యపైనున్న యందాల సుందరి రాకుమారి చిత్రమిందు లిఖింపఁబడినది. పదిహేఁడవ గుహలో. బతుంబులఁ గట్టికొని యెగురుచున్న బొమ్మలు- మహారాణి విస్తారము ముస్తాబు గావించుకొను చిత్రము — బుద్ధదేవుని ప్రబోధము — కరులను బంధించు దృశ్యము—విరాగియై యశోధరను గాంచు బుద్ధుని చిత్రము—

బోధిసత్త్వుని చిత్రము – చైత్యకూటము–గుహా ముఖభాగం బులు–రాజు నర్తకిని శిక్షించు దృశ్యము మున్నగు చిత్రంబు లింపు రమణీయంబులై, బౌద్ధ శిల్పకళా ప్రావీణ్యంబునకుఁ జిహ్నంబులై యానందకారణంబులై కనంబడుచుండును.

అజంతా గుహాలలో 5-6 గుహాలు హీనయాన తెగకుఁ జెందిన బౌద్ధాలయంబులుగను, మిగిలిన 25-26 గుహాలు మహాయాన తెగకుఁ జెందినవిగాఁ గనఁబడుచున్నవి.

మహాయానముకన్న హీనయానమతి పురాతనమైనది. హీనయాన బౌద్ధులంతగా విగ్రహారాధనఁగావింపరు. మహా యాన బౌద్ధులు విగహారాధన మొనరింతురు. మహాయాన బౌద్ధులనేక దేవాలయంబులను నిర్మించి, చిత్రలేఖనమునుశిల్ప కళను నభివృద్ధిఁగాంచిరి. అందుచేత మహాయాన బౌద్ధులచే నిర్మితంబులయిన గుహాలయందుఁడి జిత్రలేఖనము బుద్ధ విగ్ర హాల మితంబుగఁగనఁబడుచున్నవి. (గిప్తున్) అను నాంగ్లేయుఁ డజంతాలోని చిత్రలేఖనంబులను కాగితంబులపైనను, నార గుడ్డలమీఁదను లిఖించి, వాని సౌందర్యంబును లోకంబు నకుఁ జాటినాఁడు. అజంతా గుహాల చిత్రలేఖనా శిల్పకళా విశిష్టతఁను ప్రతి చిత్రకారుఁడు ప్రతిశిల్పి ఆదర్శముగాఁబెట్టు కొనుచుండిరి. బౌద్ధమత మారంభించిన దాదిగా, వృద్ధిఁబొంది దిన దాదిగా, క్షీణించినందాఁక గలమతము, సంస్కృతి నాగ రికత. సాంఘికజీవనము, మున్నగునవి. యీ యజంతాగుహాల చిత్రలేఖనా శిల్పకళల వెల్లడిఁజేయుచున్నవి.

ఇందలి చిత్రంబులను జిత్రించుటకుఁ జిత్రకారులు బంకమన్ను, చెట్లనార యుపయోగించినట్లు తెలియుచున్నది. పిదప వానిమీద సున్నముతోఁ బూఁతఁబూసిరి. పిదప వజ్రం అను బంకయు మున్నగువానితో రంగులు తయారుచేసినట్లు గ్రహింపఁదగును. శిల్పులు, చిత్రకారులుకూడఁ నీ చైత్యవిహారంబులలోఁ బ్రథమంబున పై కప్పునుంచి, పనినిఁ బ్రారంభించి క్రిందబాగంబునకుఁ జెక్కు చుఁబోయిరి. ఇవి గుప్తులకాలములో నిర్మింపఁబడినవి. ఈ చిత్రలేఖనము, శిల్పకళ ప్రపంచమం దెచ్చట లేదని తెలియుచున్నది. ఈ చిత్తరువులందుఁ జిత్రితమైన భావోన్మీలనము, రసపుష్టి, ఆధ్యాత్మిక కాంతి దేదీప్యమానంబుగా నుట్టిపడుచుండును. ఈ అజంతాగుహ లీనాడు నిర్మించినవిగనే యుండి చూచువారికి నేత్రపర్వమై యుండును. అందలి ప్రకృతి గాంచినచో హృదయోల్లాసము గలిగితీరును.

—:o:—

పంచాయతీ
వేమన గ్రంథాలయం, ఎల్లోరా
తేలప్రోలు :: కృష్ణా జిల్లా.

సృష్టికిఁ బ్రతిసృష్టివలె నద్భుత శిల్పకళా సౌందర్యమునఁ గీర్తిగాంచినవి ఎల్లోరా గుహలు. ఈ గుహలు బౌద్ధ జైన హిందూమతముల నాగరికతకు, సంస్కృతికి చిహ్నంబులై యున్నవి. ఇవి ఔరంగాబాదుకుఁ బదునాలుగు మైళ్ళ దూరములో వాయవ్యదిశన నున్నవి. ఇందలి గుహాలయంబులన్నియుఁ జాల పెద్దవి. ఇవి యొక కొండ ముఖమున నుత్తరముననుండి దక్షిణంబునకు మలచఁబడియున్నవి. ఏలాపురమునుండి ఎల్లోరా అను పేరు క్రమముగా వచ్చియుండవచ్చును. వీని పొడవు వుత్తరమునుండి దక్షిణంబున కొక మైలు, రెండు ఫర్లాంగులుండును ఇవి యుత్తరము నుండి దక్షిణంబున కొక వంపుతిరిగి పశ్చిమవైపుకుఁ బోవుచు కొనివచ్చిన రెండు కొండకొమ్ములలోఁ జూడ ముచ్చటగా నందంబు గొలుపుచుండును. దక్షిణపు చివరన బౌద్ధ గుహలు గలవు. వీనిలోఁ బ్రాచీనతమమైన గుహలు పడమటి దిశకు వంపుదిరిగినచోట నున్నట్లు దెలియుచున్నది. ఉత్తరపు దిక్కు కొసన జైనగుహలు వంపుఁదిరిగి సొంపుగానున్నవి. ఈ రెంటి గుహలమధ్య హిందువుల గుహలు నెలకొనియున్నవి. బౌద్ధగుహలు పండ్రెండు, జైనగుహలు ఐదు, హిందూగుహలు పదిహేడు — మొత్తము ముప్పదినాలుగు గుహలు గలవు. వీనిలో హిందూ గుహాలయంబులు చాలఁ బ్రసిద్ధిఁజెందియున్నవి. ఎల్లోరా శిల్పంబు లన్నిటిలోఁ గైలాస దేవాలయము శిరోరత్నమైనది. ఇది యేకశిలచే

నిర్మితంబైనది. కైలాసాలయంబునకు దక్షిణ దిక్కునఁ బైకి నెక్కుటకు మార్గంబుగలదు. ఇది దశావతార గుహమీఁదుగాఁ బోవును. కైలాస దేవాలయంబునకు దక్షిణపు దిక్కునఁ బదియారు గుహలు గలవు. ఉత్తరపు దిక్కునఁ గొన్ని కలవు. పదవ శతాబ్దమునకుఁ జెందిన యరబ్బీ భూగోళ శాస్త్రవేత్త మసూదీ యను విదేశ యాత్రికుఁడు క్రీ. శ. 1667 వ సంవత్సరములో దెవేనాట్ యను విదేశ యాత్రికుఁ డీ గుహల సందర్శించి, వీని కళావిశిష్టతను లోకంబునకుఁ బ్రకటించెను. పెరెన్, దూలెట్ మున్నగు వారుకూడ నీ గుహలను దర్శించి, వీని కళా ప్రాశస్త్యంబును బ్రపంచంబునకుఁ జాటిరి. దక్షిణదిక్కు చివరనున్న బౌద్ధ గుహాలయంబులు క్రీ. శ. 350, క్రీ. శ 550 మధ్య సంవత్సరంబులందు నిర్మించినట్లుగఁ దెలియుచున్నది. ప్రథమమున నున్న కొన్ని బౌద్ధ గుహలు దేదవడా గుహలను పేరుతోఁ గీర్తిఁజెందినవి. ప్రథమ బౌద్ధగుహ బౌద్ధవిహారముగా నున్నది. ఇందు బౌద్ధభిక్షులకు నెనిమిది గదులు విశాలముగా నిర్మింపఁబడినవి. రెండవది పూజ కుపయోగించు విశాలమందిరము. ఇందు సోపాన పరంపలున్నవి. పెద్దపెద్ద ద్వారపాలకుల బొమ్మలతోనున్న యొక వరండాకూడ నున్నది. పన్నెండు స్తంభములను నాధారంబును జేసి పైకప్పు నిర్మింపఁబడినది. ముందు భాగమున నంచెలంచెలుగఁ దీర్చి కట్టిన స్తంభాల వరుసలాధారంబుగనున్నవి. ఈ స్తంభంబులపైని జక్కని శిల్పకళ నుట్టిపడు చిత్రంబు లున్నవి. వెనుకవైపు గోడమీఁదఁ బదకొండడుగుల యెత్తున నుపవిష్టుండైన బుద్ధవిగ్రహంబు

గలదు. మూఁడవ గుహకూడ బౌద్ధవిహారమే యైయున్నది. అందుగల సుందర విశాలమందిరపు టుత్తరపు దిక్కునందు జిన్న గుడికలదు. అందుఁ బద్మాసీనుఁడౌ బుద్ధభగవానుని విగ్రహ మత్యంత రమణీయముగా నున్నది. నాలుగవ గుహ కూడ విహారమే. అందులో బోధివృక్షము కిందఁ గూర్చొని యున్న బుద్ధదేవుని విగ్రహం బతి మనోహరంబుగా సం శోభిల్లుచుండును. అయిదవ గుహ ధేదవడా లేక మహార్ వడా గుహాలయంబుగఁ బ్రసిద్ధిజెందియున్నది. ఒక్క యం తస్థుగల విహారంబు లన్నింటిలో నిది పెద్దది. పైకప్పు కాధా రంబుగాఁ బది స్తంభంబులు రెండువరుస లందంబుగా నమర్చిరి. దీనిని బౌద్ధభిక్షువులు కొలువుకూటంబుగా నుప యోగించెడివారు. పదియవ గుహను విశ్వకర్మ గుహాలయ మని పేరుకలిగెను. దీనిని గుప్తరాజుల కాలములో నిర్మించి నట్లు తెలియుచున్నది. ఇందు ముందు నందమైన మందిరము పొందుపఱుపబడినది. దీనినిఁబట్టి చూడఁగా బ్రాచీనకాలం బులో ఎల్లోరా పట్టణంబు ననతిసి నిపుణులైన శిల్పులున్నట్లు దెలియుచున్నది. వీరందరు బుద్ధభగవానునిఁ దమయారాధ్య దైవంబగు విశ్వకర్మరూపంబున బూజించుటకే గుహాలయం బును నిర్మించిరి. ఇది విశ్వకర్మ గుహాలయంబని పేరొంది నది. గొప్పఁగా జెప్పఁనొప్పిన యనల్ప శిల్పకళను, సృష్టికి బ్రతిసృష్టిగా నిది తోఁచును. ఈ గుహాలయందలి గర్భగుడి పొడవు యెనుబదియైదడుగులు. వెడల్పు నలువదిమూఁడడు గులు. ఎత్తు ముప్పదినాలు గడుగులుండును. ఈ చైత్యం సుమారు క్రీ. శ. 600 వ సంవత్సర ప్రాంతంబున నిర్మించిరి.

ఈ చైత్యము ముందరిభాగమందు దొక యందమైన పెద్ద కొలువుకూటము మెట్లనగసలు గలిగియున్నది. అంచెలంచెలుగాఁ దీర్చికట్టిన సోపానపరంపర లందమైన స్తంభంబులిందు నింపొందవుచున్నవి. ఇచట గుఱ్ఱపునాడాకృతిలో నున్న కిటికీ యొకటి గలదు. ఇది మూఁడు భాగంబులుండు నట్లందంబుగాఁ దొలఁచి మలిచిరి. ఇం దాసీనుఁడై యున్న బుద్ధభగవానుని విగ్రహం బతి గంభీరంబుగా నుండును.

పదకొండవ గుహ దొతల్ గుహయని కీర్తిఁగాంచెను. దీనికి మూఁడవ అంతస్థుకూడనున్నట్లు తెలియుచున్నది. ఇది క్రీ. శ 1876 సంవత్సరమునఁగనుఁ గొనఁబడినది. దీని మధ్యంతస్థులో ముందరికడ నెనిమిది స్తంభంబులు, అయిదు గదులు గలవు. అందు మధ్యగదిలో సుందర బుద్ధభగవానుని విగ్రహము పొందుపఱుపఁబడినది. పండ్రెండవ గుహను 'తన్ తాల్' అనిపిలుతురు. ఇది మూఁడంతస్తుల గుహాలయమై యున్నది. ముందు కొలువుకూటము — ఇటనుండి నూటపది హేనుఅడుగుల పొడవు—నలుబది మూఁడడుగుల వెడల్పుగల యొక పెద్దహాలుగలదు. అటుపై నినలుబదిమూఁడడుగులపొడవు ముప్పది యైదడుగుల వెడల్పుగల మఱొక చిన్న మందిరంబుగలదు. దీని ప్రక్కన బుద్ధదేవుని గర్భాలయమందుఁ బదకొండడుగుల యెత్తుగల యొక బుద్ధ విగ్రహంబు గలదు. మూఁడస్థులలో మధ్యాంతస్థునందు రెండు వరుసలఁదీర్చి, మార్చిన యెనిమిది స్తంభములుగలవు. ఆ గర్భాలయం బెంతో విశాలంగా, రమణీయంబుగ మలచబడినది. అన్నిటికన్నఁ బైయంతస్థులో నయిదువరుసలఁ దీర్చిన యెనిమిది స్తంభాలు

నూటపదిహేనడుగుల పొడవు. డెబ్బది అడుగుల వెడల్పుగల యొకవిశాల రమణీయమైన హాలుగలదు. ఆ గోడకు రెండు ప్రక్కలఁ గూర్చుండియుండు బుద్ధ భగవానుని ప్రతిమలందం బుగా నున్నవి. ఇవి క్రీ॥ శ॥ 700 సంవత్సరంబులందు నిర్మించి యుండవచ్చును. మొత్తము పండ్రెండు గుహలు బౌద్ధ గుహలై యున్నవి. పదమూఁడవ గుహనుండి, యిరువది యెనిమదవ గుహవఱకు హిందూగుహాలయంబుగఁ గీర్తినొంది నవి. ఎల్లోరాలోని హిందూగుహలు, ఇక్కడి బౌద్ధ, జైన గుహలకన్నఁ బెద్దవి. అనల్ప శిల్పసౌందర్యమందునఁ జెక్కడపుఁ బనియందున, గట్టడ నిర్మాణమందున మిన్నఁగా నున్నవి. అప్పటి శిల్పులు బౌద్ధప్రభావంబునుండి విడిపోయి, సంపూర్ణంబుగా నిజప్రతిభా విశేషంబులను ప్రదర్శించి నవీన శిల్పపద్ధతులతో, నద్వితీయముగా నత్యుత్తమముగా, వీనిని నిర్మించిరి. వారల శిల్పకళా ప్రావీణ్యత కైలాసాలయ మందు గొప్పఁగా నుట్టిపడుచున్నది. ఇది వైశాల్యమందు, శిల్పకళావిశిష్టతయందును, సాటిలేని మేటి కీర్తిఁగాంచినది. ఇంతటి పెద్ద గుహాలయము, ఇట్టి శిల్పకళాసౌందర్యము నిధానము భారతదేశంబునం దెందు లేదు. ఉండదు. ఉండఁబోదు.

పండ్రెండవ గుహ బౌద్ధుల తీన్‌తాల్ గుహ తరు వాత—బదమూఁడవ గుహనుండి వరుసగా హిందూగుహలు ప్రారంభమగును. వీనిలో మొదటి గుహ విశాలమగు గదిలోనుండి యొక విధమగు ధర్మశాలవలెఁ గనపడును. పదునాలుగవ గుహ రావణ్—కా—జైయె అను పేరుతోఁ

ప్రసిద్ధికెక్కినది. ఇందుగల ముందు ప్రదేశము 54 అ. ల పొడవు 55 అ. వెడల్పుగల విశాలమైన హాలు. హాలుచివర గర్భగుడియున్నది. దానికిఁ జుట్టు ప్రదక్షిణమును జేయుటకు గడు వెడల్పయిన తోవయున్నది దక్షిణపు గోడమీద శైవమత సంబంధమైన యనల్ప విశిష్టతను దెల్పు శిల్పకళ యొప్పుచుండును. ఇందు మహిషాసుర మర్దని, శివపార్వతుల లీలావిలాసాలు, పరమేశ్వరుని తాండవ నృత్యము, రావణాసురుఁడు కైలాస పర్వతమ్మును బెకలించుట, శివుఁడు పర్వతమ్మును దన బొటన వేలుతో రావణాసురు నణఁచుట, మున్నగు చిత్రంబు లిందద్భుతంబుగ నున్నవి. ఉత్తర కుడ్యముమీఁద దక్షిణ హస్తముతో త్రిశూలం బెత్తిపట్టుకొని, శార్దూలముపై నధిష్ఠించిన పార్వతీదేవి, పద్మాసనాసీనురాలయిన లక్ష్మీదేవి, వైకుంఠమున సభాకూటమందున్న శ్రీవిష్ణుమూర్తి మున్నగు చిత్రంబు లత్యంత ప్రశంసాపాత్రంబుగా, మనోహరంబులుగాఁ గనఁబడును. పదిహేడవ గుహ దశావతార గుహ క్రీ॥ శ॥ 560—850 సంవత్సరముల మధ్య పరిపాలించిన రాజులు దీనిని నిర్మించిరి. ఇది యొక రాతితో నిర్మించినట్లుగఁ గనఁబడును. దీనిమధ్య యొక యజ్ఞశాల గలదు. ఈ గుహ రెండంతస్థులఁ గలిగియుండును. క్రింది భాగమందలి యంతస్థులో నెనిమిది స్తంభంబులు వరుసగాఁ బసందుగా నమర్చియున్నవి. పైభాగమం దంతస్తులో నాలేసు స్తంభంబులు వరుసలు దీర్చియున్నవి. వీని మీఁదఁగల యనల్ప శిల్పకళ యద్భుతంబై నిరుపమానంబై యుండును. ఇందుఁ గపాలధారియగు భైరవుని ప్రతిమ

భయంకరమును గొలుపునదియైనను, శిల్పకళా ప్రావీణ్యతలో ముందంజవేసియున్నది. ఇంకొక యాకర్షణ మిందున్నది. అది శివపార్వతుల కళ్యాణము. అది యత్యంత మనోజ్ఞమై యున్నది. తరువాతఁ జెప్పఁదగినవి మార్కండేయుని రక్షించుటకొఱకు శివుఁడు లింగమునుండి యుద్భవించుట, లక్ష్మీదేవిమీఁద నేనుగులు తొండాలతో జలంబుల నభిషేకించుట, అయిదు శిరస్సులుగల శేషునిమీద విష్ణుమూర్తి శయనించుట, నరసింహ వామనావతారములు — మున్నగు చిత్రముల సమాన కళాప్రావీణ్యంబును వెల్లడిజేయుచున్నవి. వెనుకవైపు గోడమీఁద, జ్వాలలు గ్రక్కుచున్న లింగమునుండి శివుఁ డుద్భవించుట, పరమేశ్వరుఁడు సూర్యరథమును స్వాధీనమొనర్చుకొని, నాలుగు వేదాలను నాలుగు గుఱ్ఱంబులుగను, బ్రహ్మను సారథిగను గావించి, ఆ రథముమీఁద తారకాసురుని జిత్తంబున సంహరించుటకు దండెత్తిపోవు చిత్రము మహోల్లాసంబు, మహోత్సాహంబు రేకెత్తింపఁగలదు. క్రీ॥ శ॥ 756–775 సంవత్సరకాలమున నిర్మింపఁబడిన కైలాసదేవాలయము ఎల్లోరా గుహాలన్నిటిలో మిన్నయైనది. ఇది హిందూగుహాలయము. భారతదేశంబందలి గుహాలన్నిటిలోఁగూడ విశిష్టంబైనది. దీని నిర్మాణమందుఁ జూపఁబడిన వాస్తుశాస్త్ర వైఖరి, శిల్పకళ పాపనాధాలయం శిల్పకళా విశిష్టతను బోలియుండును. ఈ రెండు దేవాలయంబు లించుమించుగా నొక్కవిధంబుగనే యుండును. ఒక రాతితో నిర్మించిన మహాబలిపురమందలి రాతిరథంబులు మున్నగునవి ప్రాచీనకాలమునాటి నిదర్శనంబులై

యుండ, నీ కైలాస దేవాలయ శిల్పకళ దానితరువాత కాలంబునాటిదిగాఁ గనఁబడుచుండును. దీనిని నిర్మించుటకు దాదాపు రెండులక్షలటన్నుల పైచిలుకు రాయి త్రవ్వి, బయటకుఁ దీసినట్లూహింపవచ్చును. ఇందుఁ బ్రవేశించుటకుముందు ద్వారమందు శిలానిర్మితమైన రెండేనుఁగులు గలవు. దేవాలయంబున కెదురుగఁ బెద్దనందికలదు. కైలాసదేవాలయము పొడుగు నూట అరువదినాలుగు అడుగులు, వెడల్పు నూట తొమ్మిది అడుగులు. ఈ యాలయంబు మూఁడు భాగంబులుగ నున్నది. దీనికి ముందు వసారా, మధ్య విశాలమైన హాలు, గర్భగుడియున్నది. వసారనుండి నంది వఱకు వంతెనవలె నొక పైకప్పు గలదు. దానిమీఁద మెట్లకొఱకు గోడ కట్టఁబడియున్నది. ఆ గోడలమీఁద రామాయణములోని దృశ్యంబులు చక్కని శిల్పరూపంబునఁ జెక్కఁబడియున్నవి. దక్షిణ దిక్కున సప్తమాతృకలు విఘ్నేశ్వరుని విగ్రహంబు లతి మనోరంజకంబుగాఁ జిత్రింపఁబడియున్నవి. వీనికిఁ దూర్పుదిక్కున నొక గుహయొకటి గలదు. ఆ గుహ పై యంతస్థు ఊరక వ్రేలియాడు వంతెనవలన కైలాస దేవాలయంబున కతుకఁబడినది. ఈ యాలయ మధ్యభాగంబులో శైవవైష్ణవ సంబంధములైన దృశ్యంబులెన్నియో మిన్నఁగాఁ జిత్రింపఁబడినవి. ఇవి చూచుటకు యెంతో సందర్శనీయంబుగా నుండును. దీనింబట్టి యాకాలమందు శైవ వైష్ణవ మతభేదంబు లంతఁగా లేవని వీనిఁబట్టి సులభంబుగా నూహింపఁదగును.

ఇందొక విచిత్రమున్నది. ఈ కైలాసాలయము శివాలయముగాఁ బ్రఖ్యాతిఁ గాంచినప్పటికి, విష్ణుసంబంధమైన చిత్రంబులెన్నో యిందుఁ జిత్రింపఁబడినవి. దేవతల చిత్రంబులన్నియు నిందుఁ జక్కగాఁ జిత్రింపఁబడినవి. ఇవి చూడ ముచ్చటగా నుండును. ఇఱువదొకటవ గుహ రామేశ్వర గుహమైయున్నది. ఈ గుహాలయంబు ముందు వసారాలో నాలుగు స్తంభంబులు మూఁడువరుసలుగా నొప్పుచున్నవి. ఇఱువదిరెండవ గుహ నీలకంఠ గుహ. ఇందలి గర్భాలయంబందు నపురూప శిల్పకళాప్రావీణ్యతను జూపు నీశ్వర లింగమున్నది. ఇరవదియైదవ గుహ కుంభర్వాడ గుహ. ఇందు సప్తాశ్వరథుఁడైన సూర్యుని చిత్రంబు నిరుపమాన కళావిశిష్టత గనఁబరచుచున్నది. ఇఱువదియేఁడవ గుహ గోపీగుహ. ఇందుఁ జిత్రితంబులైన చిత్రంబులు గనులవిందుగా నుండును. ఇఱువదితొమ్మిదవ గుహ సీతాకీసహాని—

ఈ శైలంబున నుత్తర దిక్కున నైదు జైనగుహలున్నవి. ఇవి క్రీ॥ శ॥ ౧-13 శతాబ్దంబుల మధ్య నిర్మితంబైనవి.

ఇందు మొదటిగుహకుఁ జివరగుహకు ఛోటాకైలాస అని పిలుతురు. ఇది కైలాసాలయంబునకుఁ బ్రతిగా నిర్మింపఁదలచిరి. కాని కాలవశంబున నది పూర్తికాకుండఁగనే నిలిచిపోయినది. జైనగుహలలో మిక్కిలి ప్రావీణ్యతనుగన్నది ఇంద్రసభ. ఇది చాల బురాతనమైనది. ఇందు మహావీర, గౌతమ మున్నగు చిత్రంబులిందుఁ జిత్రితంబులై యున్నవి.

గోడలమీఁద జైనుల చిత్రంబులతి సోయగంబుగాఁ జిత్రింపఁబడినది. ఇట శిల్పమెంతో సున్నితంబుగను, మనోజ్ఞంబుగను జగన్నాథ సభ గుహలోనుండి ఇంద్రసభలో జతఁజేయఁబడియున్నది. ఈ యెల్లోరా గుహల చిత్రములు, శిల్పములను జిత్రించిన శిల్పకారులు, చిత్రలేఖకులు పరబ్రహ్మలనఁదగినవారు. కాలవశమున వారు గతించినను, వారి ప్రావీణ్యము ప్రతి రసజ్ఞుల హృదయంబులందు శాశ్వతంబుగ నిలిచిపోయినది. ఇక్కడనున్న ఎల్లోరా పట్టణం బొకప్పుడు మహాప్రభావంబుగను, నిరుపమాన యశోసంపదలతో వెలసియున్నది. ఇందలి శిల్పకళావిశిష్టత, చిత్రలేఖనా ప్రావీణ్యతలు, హిందూదేశ చరిత్రలో సువర్ణాక్షరంబులతో వ్రాయఁబడి, నాటికి నేటికి సూర్యకాంతివలె వెలుఁగుచున్నదనుట నిస్సందేహము.

—:000:—

# సారనాథ్

భారతదేశమునఁ కీర్తిఁగాంచిన చారిత్రక ప్రదేశములలో సారనాథ్ యొకటి. ఇది పవిత్ర పుణ్యక్షేత్రమై, మహేశ్వరునకుఁ బ్రీతిపాత్రమైన కాశీపట్టణమునకు నాలుగుమైళ్ళ దూరమున నున్నది. కాశీలోని పంచగంగ ఘట్టమునుండి బయలువెడలి నలత్తై మీఁదుగా సారనాథ్‌కు చేరవచ్చును. సారనాథ్‌కడఁ బ్రస్తుతము రైల్వేస్టేషను కూడఁ

గలదు. స్టేషన్‌నుండి ప్రాచీన శిథిలాలకు నొక మైలుదూర ముండును. ఇందు యాత్రీకులకుఁ దగిన సదుపాయంబులు లేవు. ఇది ప్రాచీన బౌద్ధగ్రంథములలో ఋషిపట్టణము-ఇసి పట్టణము-మున్నగు నామంబులతోఁ బిలువఁబడుచుండెడిది.

గౌతమ బుద్ధుఁడు జ్ఞానోదయమును బొందిన పిదపఁ బ్రథమమున నిచ్చటనే తన సిద్ధాంతములను నైదుగురు సన్యాసులకుఁ బ్రబోధించెను. ఆయన చేసిన ప్రథమ మతోప న్యాసంబునకు 'ధర్మచక్ర ప్రవర్తన సూత్ర' మని పేరొంది నది. ఇందు బౌద్ధమత మూలసూత్రంబు లిమిడియున్నవి. ఆ బోధనలను విని, యా యైదుగురు బౌద్ధమతమును స్వీక రించిరి. వారే గౌతమ బుద్ధుని ప్రథమ శిష్యులు. వారు కౌండిన్యుఁడు, వప్పుఁడు, భద్రికుఁడు, మహానముకు, అశ్వజిత్తు అనువారు. లుంబినీవనము బౌద్ధమతస్థులకుఁ బ్రధాన యాత్రాస్థలములలో మొదటిది. ఇది బుద్ధుని పవిత్ర జన్మస్థలము. ఇది కపిలవస్తుపురంబునకుఁ బదిమైళ్ళ దూరంబున నున్నది.

గౌతమ బుద్ధుని మాతృమూర్తియగు మాయాదేవి పూర్ణగర్భవతిగానుండి, కపిలవస్తునుండి కోశలికిఁ బ్రయాణం బును గావించుచుండ, మార్గమధ్యంబున నిట నొక మోదుగ చెట్టుక్రిందఁ బ్రసవించినది. ఇట్టి పవిత్ర స్థలంబందు నొక శిలాస్తంభంబును నశోక చక్రవర్తి యివ్విషయంబున వ్రాయించి నిర్మించినాఁడు.

గౌతమ బుద్ధుఁడు క్రీ. పూ. 557 సంవత్సరంబున జన్మించెనని మాక్సు ముల్లగోను, లాసెన్ అను ప్రసిద్ధ పండితుఁడు క్రీ పూ. 623 లో గౌతమ బుద్ధుఁడు జన్మించి, క్రీ. పూ. 543 నిర్యాణము చెందెనని పరిశోధించి ప్రకటించినారు. గౌతమ బుద్ధునికి జ్ఞానోదయమైన మూఁడవ పట్టణము సారనాథ్. ఇది యొకప్పుడు ఇసిపట్టణమను పేరుతో నుండెడిది. నాలుగవది గోరక్‌పూర్ జిల్లాలోని కుశినగరము ఇంద మహానుభావుఁడు నిర్యాణమును జెందిన పవిత్రస్థలము. ఇది నేటికినిఁ బవిత్రయాత్రాస్థలంబైనది.

గౌతమ బుద్ధుఁడు దన ముప్పదియైదవయేట జ్ఞానమును బొందెను. పిమ్మట నమ్మహానుభావుఁడు క్రీ. పూ. 583 లో ప్రథమంబున సారనాథ్ గ్రామంబునఁ బ్రబోధము గావించెను. ఆ కారణంబున సారనాథ్ పవిత్రయాత్రాస్థలంబుగా నెంచఁబడుచున్నది. కాని గౌతమ బుద్ధ భగవానుని యవశేషంబు లిందేమి లభింపలేదు. కాని మౌర్యులకాలమునాటి శిథిలంబు లిచ్చటఁ గనుఁగొనఁబడినవి. బుద్ధదేవుని యస్థికలపైని, బౌద్ధభిక్షువుల యస్థికలపైని గోళాకృతిలోనుండు కట్టడంబు లనేకంబులను నశోకుండు నిర్మించెను. వీనిపై గౌతమ బుద్ధుని జీవిత విశేషంబులను జిత్రించు శిల్పఫలకంబు నమర్చఁబడినవి.

కళింగయుద్ధము తరువాత బౌద్ధమతమును స్వీకరించిన శోకుఁడు (84000) స్థూపంబులను దేశమందెల్లెడ నిర్మించె. అతఁడు నిర్మించినవానిలో సారనాథ్ స్తూపంబులు

మిక్కిలి ప్రఖ్యాతిఁగాంచినవి. ఇందలి యశోక స్తంభము కూడ నిర్మింపఁబడెను. ఇవి పురాతన శిల్పకళ వెదజల్లు చున్నవి. అశోక స్తంభముపైనగల శాసనమందిట్లు వ్రాయఁబడియున్నది. దేవానాం ప్రియుఁడగు ప్రియదర్శి శాసనము—పాటలీపుత్రమందుఁగాని, దానికి సమీపంబందున్న నగరంబులుగాని, ఇతర నగరములలోఁగాని, యెవఁడు సంఘంబున నే భిక్షుకునిఁగాని, యే భిక్షుకిఁగాని విడదీయఁగూడదు. అట్లు గావించినవారికి శ్వేతవస్త్రంబులు ధరింపఁజేసి, ఇందొక ప్రదేశమందుంచునట్లు గావింపవలయును. ఈ శాసనంబును బౌద్ధసంఘంబు లన్నిటికిఁ దెలుపవలెను. ఈ యనుశాసన ప్రతిని కార్యాలయంబందును, మఱొక ప్రతిని నుపాసకుల గృహమునం దుంచవలయును. ఈ యనుశాసనమందు దృఢ విశ్వాసంబు గలిగియుండుటకొఱకు నుపవాసదినంబు లన్నిటిలో నొకచోట సమావేశంబు గావలయును. దీనియందు విశ్వాసముండి, దీనిని బాగుగా నలవరచుకొనుటకు మహామాత్రులుకూడ నుపవాస దినంబులలో నచ్చుటకుఁ బోవలయును. రాష్ట్రంబందలి యాదాయంబుకొఱకు నొక్క యధికారి నంపవలయును. ఈ శాసనం బన్నిప్రాంతాలకుఁ తెలియఁజేయుట కుద్యోగస్థుల నంపవలయును'' అనియున్నది.

సారనాథ్‌లోని యశోక శిలా స్తంభం బిప్పటికి చెక్కుచెదరకయున్నది ఈ శిలా స్తంభ శిరోభాగముమీఁ గంటవలె నొక కమలమున్నది. దానికి నాలుఁగు దిశల నాలుగు సింహములు నోరుదెఱచియున్న శిల్పంబులున

ఈ సింహంబుల మధ్యన నొక పెద్ద శిలాచక్రమున్నది ఇప్పుడీ చక్రమందుఁ గొన్ని భాగంబులుమాత్రిమే మిగిలి యున్నవి. ఇదియే యశోకుని ధర్మచక్రము ఈ సింహ విగ్రహములు మృదంగ రూపముననున్న యొక శిలపై నిలువఁ బడియున్నవి. మృదంగముమీఁద నొక సింహము, ఒక కరిరాజు, ఒక వృషభము, ఒక యశ్వము—ఈ నాలుగింటి విగ్రహములు. నాలుగు చక్రములమధ్య నందముగాఁ బసందుగాఁ గనులవిందుగా నమర్చఁబడియున్నవి.

ప్రపంచమున నే దేశంబున నెచటఁగూడ నింతకన్న నేర్పరితనముతోడను, నింతకన్న మిన్నయైన యందముతోడను, నింతకన్న సహజముతోను, నింతకన్న గంభీరముగను, ప్రతివిషయము నతిజాగరూకతఁబూని నిక్కముగఁ జెక్కఁబడిన యనల్ప శిల్పాబులు లేవు—ఉండవు—ఉండఁబోవు సారనాథ్ గ్రామమువద్దఁ బూర్వము లేళ్ళవనము ఉండుటచేత నీ ప్రదేశమునకు మృగవనంబు అని పేరు గలిగెను ఇందులో నశోకచక్రవర్తి నిర్మించిన యొక స్తూపంబునకు ముందు డెబ్బదడుగుల యెత్తుఁగల యొక శిలా స్తంభమున్నది. కాని యిచట నిప్పుడున్న స్తంభపుఎత్తు ముప్పదేడడుగులు మాత్రమే యున్నది. ప్రసిద్ధ చీనాయాత్రికుఁడు హుయాన్‌సాంగు దీని యెత్తునే యెక్కువగ లెక్కవేసి తెలిపెనో లేక యతఁడు వచించినది మఱొక స్తంభంబే యయున్నదో తెలియుటలేదు హుయాన్‌సాంగ్ కాక పాహియాన్ అను ప్రసిద్ధ చీనాయాత్రికుఁడుకూడ సారనాథ్‌ను [illegible]ంచెను పాహియాన్ క్రీ॥ శ॥ అయిదవ శతాబ్దములోను,

హుయాన్ సాంగ్ క్రీ॥ శ॥ ఏడవ శతాబ్దములోను, వీని మధ్య కాలములోను భారతదేశమును దర్శించిరి. వీరిఱువురుకూడ మనదేశమం దనేక ప్రసిద్ధ స్థలంబులను దర్శించి, వానిిం గూర్చిన విషయములు విపులంబుగ, నిష్పాక్షికముగ నున్నది నున్నట్లు గన్నది గన్నట్లు విన్నది విన్నట్లు లిఖించిరి.

సారనాథ్, వారణాశి వీనిిం గూర్చి వ్రాసిన వ్రాతలు చాలా వివరంబులతో ఖచ్చితముగఁగలవు. హుయాన్ సాంగు యింక నధిక వివరములు దెలిపెను. ఫాహియాన్ వారణాశి పట్టణమునకు వాయవ్య దిక్కున షుమారు రెండు మైళ్ళ లోపున మృగవనమందొక యందంబైన దేవాలయంబున్నది. సారనాథ్ గ్రామంబునొద్ద నొక చిన్న గర్భాలయంబు, నాలుగు గోపురములు, రెండు మఠంబు లున్నవని యతఁడు లిఖించెను.. వారణాశీరాజ్య మూరువందలరువదియేడు మైళ్లు చుట్టుకొలతఁ గలిగియున్నది.

ఈ రాజ్యమందు ముప్పది బౌద్ధభిక్షువుల సంఘంబు లున్నవి. షుమారీ సంఘమునందు మూఁడువేలమంది బౌద్ధ సన్యాసు లున్నారు హిందూదేవాలయములు దాదాపు నూరున్నవి. ఈ దేవాలయములందుఁ బూజారులు భక్తులు కూడి దాదాపు పదివేలమంది యుందురు.

సారనాథ్ మఠ మెనిమిది భాగంబులుగనుండి, చుట్టు నొక పెద్దగోడ నిర్మింపఁబడియున్నది. ఇందులో రెండ... గుల ఎత్తునఁగల యొక బౌద్ధవిహారంబు నిర్మితంబైయున్న... దీని పై భాగమున బంగారుపూఁతఁ బూసిన యొక ...

మామిడిపండును మలిచిరి. దీనిచుట్టు చూచువరుసలగా, గోడలో మలచిన గూడులు గనఁబడుచున్నవి. అన్ని గూడు లందును బంగారుపూఁత పూసిన బుద్ధవిగ్రహ మమర్చఁబడి యున్నది. విహారంబు మధ్యలో బుద్ధుని కంచువిగ్రహం బొకటి బ్రహ్మాండంబై యున్నది. ఈ విహారానికి నైఋతి దిశగా నశోకుఁడు నిర్మించిన శిలాస్థూపము గానఁబడుచున్నది. ఈ స్థూపము ముందు డెబ్బదడుగుల యెత్తుగల యొక స్తంభము పాతబడినది. బుద్ధుఁడు ప్రథమంబునఁదన ధర్మోపన్యాసము గావించిన దీ ప్రదేశంబుననే. వీనికి సమీపముగా నేడు స్థూపములు, ప్రాచీనంబగు ననేక వేదిక లందంబుగా నిందమర్చఁబడినవి. వీనిపైఁ గూర్చుండి బౌద్ధభిక్షులు యోగాభ్యాసనాదు లొనరించిరట. మఠావరణమం దనేక సుందరతర విహారంబులు, స్తూపంబులెన్నెన్నో పవిత్ర చిహ్నంబులు నిర్మింపఁబడియున్నవి. ఆవరణ కుడ్యములందు బశ్చిమముగా నొక తటాకంబున్నది. ఇందులో గౌతమ బుద్ధుఁడు సుస్నాతయగుచుండునట. దానికిఁ బశ్చిమమున నొక సరస్సుగలదు. గౌతమ బుద్ధుఁడిందులోఁ దన కమండలంబును బరిశుభ్రతఁ గావించువాఁడట — కొంచెం బుత్తరంబుగ నరుగ మూఁడవ చెఱువు గనఁబడుచుండును ఇందు గౌతమ బుద్ధుఁడు దన నిజవస్త్రంబుల నుదుకుకొనుచుండు డట — ఈ తటాకంబు ప్రక్క నలుచదరముగా నున్న గొప్ప శిలగలదు. దీనిపై నిలిచి బుద్ధుఁడు కాషాయములను ధరించెడివాఁడు. దీనికి దగ్గరగా నొక స్థూప

మొక యడవిని నిర్మించిన మశోక స్థూపంబు గనఁబడు చుండును.

ఈ బౌద్ధమఠంబునకు దక్షిణమున సుమారు ½ మైలు దూరమున నురుతర స్థూపమొకటి మూఁడువందల యడుగుల యెత్తుగలది-శిరోభాగాన శరాకృతితో నింక నపురూప—మమూల్యమైన యనేక వస్తుజాలంబులతో, విస్తారము నిస్తుల సౌందర్యవంతముగా నెలకొల్పఁబడినదని చైనాయాత్రికుఁడు హుయాన సాంగు లిఖంచెను.

బుద్ధుఁడైదుగురు సన్యాసులకుఁ బ్రథమంబున ధర్మోపన్యాసమును గావించి, వారిని శిష్యులుగా మార్చినచోట స్థూపంబులున్న విషయము ప్రసిద్ధ యాత్రికుఁడగు ఫాహియాన్ తెలిపెను. అచ్చట నశోకస్థూపంబు, శిలాస్తంభ మున్నవని తెలుపుచుండెను. ఈ యశోక స్తంభము బౌద్ధ చరిత్రలో నత్యంత ప్రాధాన్యత వహించెను. ఎనిమిది దివ్య గోపురములలో నొకటిగా నిది భావింపఁబడుచున్నది

సారనాథ్ యొద్దఁగల యశోక స్తంభము ప్రాచీన భారతీయ కళలలో విశిష్టస్థానమును నాక్రమించెనని, ప్రపంచంబంతయు నంగీకరించినది-ఇందలి శిల్పచాతుర్యం బపూర్వంబయి యొప్పుచుండెను. ఈ స్తంభ మేకశిలానిర్మితంబసి, మొదట నేఁబదడుగుల యెత్తున నుండియున్నదని తెలియు చున్నది. ఇందుఁగల శిల్పనిర్మాణం బెంతయో ప్రశంసనీయార్హమైనది. ఈ యందము. ఈ శోభ, ఈ శిల్ప విశిష్టత క్రీస్తుపూర్వము ప్రథమ శతాబ్దము తరువాతి దేశమునుండి యదృశ్యమైపోయినటులఁ జెప్పుచు

సారనాథ్‌లోని ప్రాచీన శిథిలంబులు మౌర్యరాజుల కాలము నాఁడు నిర్మించినవని కొన్ని యశోకచక్రవర్తి నిర్మించినవని యూహించుచుండిరి. ఇచట అశోకుని స్తంభముగల సింహాలు గుర్తునే భారత ప్రభుత్వము నేటి ప్రభుత్వ లాంఛనముగా నుపయోగించుచున్నది. అశోకుని కాలమునాటి జ్ఞాపక చిహ్నములు మఱొకటి ధర్మరాజిక స్థూపంబందు నొక భాగము. దీనినిఁ గుషాణుల కాలమునుండి క్రీ॥ శ॥ పండ్రెండవ శతాబ్దముపఱ కనేకవిధంబు లభివృద్ధిఁ గావింపఁ చువచ్చిరి. ఇందు నిలుచున్న బుద్ధవిగ్రహం బత్యంత ప్రశంసనీయంబు. ఈ విగ్రహంబతి గంభీరమైనది దీనిపైన నొక ఛత్రంబున్నది. ఇందు శాసనములను జెక్కఁబడిన గుప్తుల కాలంబందలి విగ్రహంబు లనేకము లందముగాఁ బొందుపఱుపఁబడినవి.

క్రీ॥ శ॥ మూఁడవ శతాబ్దము తర్వాత సారనాథ్, బౌద్ధమత హీనయాన తెగకుఁ జెందిన సర్వాస్తివాద శాఖీయుల క్రింద నున్నట్లు కొన్ని శాసనంబులవలనఁ దెలియుచున్నది. అంతకుబూర్వము మఱొక శాఖీయుల క్రింద నుండి నట్లు శాసనంబువలనఁ దెలియుచున్నది బౌద్ధమతస్థులు, ఏఁడవ శతాబ్దమం దిచ్చట నధికారంబు వహించిరనియుఁ దెలియుచున్నది పండ్రెండవ శతాబ్దము తర్వాత సారనాథ్ లోని స్థూపంబులు గర్భగుడులు శిథిలావస్థలో నున్నవనుట స్వాదాంశము వీని వైభవం క్రీ॥ శ॥ 1033 లో జరిగిన మహమ్మదీయ దండయాత్రవలన నివి శిథిలంబై యుండ వచ్చును. వారు వీనినెల్ల విధ్వంసంబును గావించిరి.

క్రీ॥ శ॥ 1114–1154 సంవత్సరముల మధ్య సహడ వాలి వంశంబునకుఁ జెందిన గోవిందచంద్రుఁడను నృపుఁడు కనోజ్ యను పట్టణమును పరిపాలించెను. ఆయన భార్య కుమారదేవి. ఆ రాజపత్ని సారనాధ్‌యొద్ద నొక పెద్ద బౌద్ధ విహారమును నిర్మించెను. అందలి శిల్పకళావిశిష్టత, చిత్ర లేఖనా ప్రావీణ్యత నందరి నాకర్షించినది. అందుచేత కాల క్రమంబున నది పవిత్ర యాత్రాస్థలముగ మారిపోయెను. హిందువులు, జైనులుకూడ నీ ప్రాంతమందు ననేక దేవా లయములను, గోపురములను నిర్మించిరి.

క్రీ॥ శ॥ 1194 లో కుతుబుద్దీన్ వారణాసి, సారనాధ్ దేవాలయములను విధ్వంసంబు గావించెను. నాఁటినుండి బౌద్ధ, జైనమతంబులు క్షీణదశనొందుచు వచ్చెను. ఆ కారణమున సారనాధ్‌లోని విహారంబులపైని శ్రద్ధజూపువారు లేకపోయిరి. పురాతనవస్తు పరిశోధన శాఖవారు నిరంతరము సాగించిన కృషిఫలితంబువలన నివి మఱల మట్టినుండి బయలుపడినవి.

సారనాధ్‌లోని బౌద్ధ శిధిలాలకు షుమారు అరమైలు దూరంబందు సారంగాలయముకూడఁ గలదు అక్కారణ మున నీ ప్రదేశంబున కీ నామంబు గలిగెను. క్రీ॥ శ॥ 1835 కన్నింగ్‌హామ్ అనునతఁడిట త్రవ్వకంబులు సాగింపఁగా విగ్రహము లెన్నియో బయలుపడెను. కొన్ని కలకతా మ్యూజియముకుఁ గొనిపోఁబడినవి. కొన్ని సారనాధ్‌యం దుంచబడినవి. అందుంచబడిన యవశేషములతో వర నదిపై వంతెనను నిర్మించిరి. క్రీ॥ శ॥ 1794 లో వారణా

రాజా చైత్యసింహుఁడు పరిపాలించెను. అందు ననేక వీథులను నిర్మించుటకు సారనాథ్‌లోని శిలావిగ్రహంబులెన్నియో యతఁడు గొంపోయెను.

క్రీ॥ శ॥ 1904 నుండి ఇండియా ప్రభుత్వపు పురాతత్త్వ పరిశోధన శాఖవారు క్రమపద్ధతిలో నిక్కడఁ బరిశోధన లొనరించుచుండుటవలన ననేక ప్రాచీన స్థూపంబులు, కట్టడములు బయలుపడినవి. సారనాథ్‌కు ఋషిపతనము, ఋషిపట్టణము, మృగవనము అని పురాతన నామములుండటానికి బౌద్ధ సంస్కృతగ్రంథ మొకదానిఁబట్టి యీ క్రింది కథ తెలియుచున్నది.

మున్నొకప్పుడు కాశీకి నొకటిన్నర యోజనముల దూరములో నొక మహారణ్యంబున నైదువందల బౌద్ధ భిక్షువులు నివశించుచుండువారు. ఒకప్పుడు వారెల్లరు ఆకాశంబులోని కెగిసిపోయి. యక్కడ నిర్వాణంబును పొందిరి. అప్పుడు వారి భౌతిక దేహంబులు వసుధాస్థలిపైఁ బడిపోయినవి ఇవ్విధముగా మునులు పతనంబైన యీ యరణ్య ప్రదేశంబునకు ఋషిపతనంబని నామంబు వచ్చినది. ఈ యరణ్యంబునఁ ప్రత్యేక బౌద్ధుఁడొక్క డుండువాఁడని, యతండు గౌతమ బుద్ధుని జ్ఞానోదయమైనదని యాలించి నిర్వాణము పొందెనని ప్రసిద్ధ చైనాయాత్రికుఁడు ఫాహియాను లిఖించెను. ఈ ప్రదేశమునకు మృగవనమను నామంబు వచ్చుటకు గల్గిన జాతకకథలో నొక కథ నిట్లున్నది.

"బుద్ధుఁడు దన పూర్వజన్మంబున సారంగ రూపమున నుంచు వారణాసి సమీపములో నీ యడవిలో నివసించు

చుండెడివాఁడు. అది మిగిలిన లేళ్ళన్నిటికి రాజు. అప్పుడు కాశీనిఁ బరిపాలించు రాజునకు వేటయనిన మిక్కిలి యాభిమానంబుగా నుండెడిది. అందు సారంగనాథుఁడగు బుద్ధుఁడా నృపుకడకుఁ బోయి, రోజుకొక లేడిని నాహారముగా బంపుట కాతనితో నియమం బొనరించుకొనివచ్చి యటులఁ గావింపుచుండెను. ఇట్లుండ నొకనాఁడు గర్భిణియైన యాడ లేడి వంతు వచ్చినది. అప్పుడు బోధిసత్త్వుండగు రాజు దానిపైఁ గనికరించెను. దానికి బదులుగాఁ దానే రాజునకు నాహారముగ బోయెను అప్పుడు కాశీపతి మిక్కిలి ఆశ్చర్య పడి హృదయ పరివర్తనంబును బొందెను. నాఁటినుండి బోధిసత్త్వుఁడు లేడిరూపమున నివశించిన ఈ ప్రదేశమునకు మృగవనంబని నామంబు గలిగినది.

సారనాథ్‌లోని చౌఖండి స్తూపంబు మిక్కిలి ఎత్తైనది. ఈ స్థూపముమీఁద నిటుకతో నొక గోపురము నిర్మించిరి. గోపుర శిరోభాగ మష్టకోణాకార రూపంబున నొప్పారుచున్నది. గౌతమ బుద్ధుఁడు దన యయిదుగురు శిష్యులను ప్రథమమునఁ గలసిన ప్రదేశమున దీనిని నిర్మించినట్లు మాత్రము గ్రహింపఁబడుచున్నది. హుమాయూన్ చక్రవర్తి ఈ ప్రదేశంబును సందర్శించెను. అందుకు జ్ఞాపకార్థంబుగ నీ స్థూపంబుమీఁద నొక గోపురమును నిర్మించెను. ఒక శిలా ఫలకంబుమీఁద పర్షియన్ భాషలోఁ బద్యంబులు చెక్కఁబడియున్నవి. వాసిలో 'రాజు జనాబ్ ఆషియానీ హుమాయున్' ఒక దిన మిచ్చటకు నరుదెంచి సింహాసనాసీనుఁ ఈ ప్రదేశంబును దానంబుగా నొసంగినాఁడు.

అక్బరు చక్రవర్తి బానిస గోవర్ధన్ నీలాకాశంబు నొప్పిన యొక గోపురమును క్రీ॥ శ॥ 996 లో నిర్మించెను. ఇచట క్రీ॥ శ॥ 5-6-7 9-10 శతాబ్దములలో నిచ్చట విహారంబులను నిర్మించినట్లు దెలియుచున్నది. ఇచటగల ధర్మరాజిక స్తూపంబునకు సమీపముగా నొక శిథిల దేవాలయము గలదు. ఇందు మూలవిరాట్టునందు గర్భాలయము రెండు వందల యడుగుల యెత్తుననున్నది. ఆలయ గోపురము చివరన బంగారు మామిడిపండును శిల్పంబును నిర్మించిరి. ఈ గర్భగుడికిఁ బశ్చిమంబుగ నశోక స్తంభములు గలవు. దమేఖ స్తూపంబు, జైనదేవాలయమున కీశాన్యదిక్కున నొప్పుచున్నది. ఇది యెనిమిది ముఖంబులును, చాల గోడ గూళ్ళు గలిగియున్నది. వీనిమీఁద వివిధ పుష్పంబులు జెక్కఁబడియున్నవి. ఇవి యెంతయో మనోజ్ఞంబుగను, గుప్తుల కళావైభవమును బ్రకటింపుచున్నవి. బుద్ధదేవుఁడు ప్రథమంబునఁ దన ధర్మచక్రంబును సారనాథ్‌లోఁ ద్రిప్పినాఁడు. అందుకుఁ జిహ్నముగ నీ దమేఖ స్తూపంబును నిర్మించెను. దీనిని నిర్మించినది అశోక చక్రవర్తి. సారనాథ్ యొద్ద బుద్ధభగవానుని పవిత్ర దేవాలయం బొకటి నిర్మింపఁబడినది. మఱల నిది ప్రాచీన వైభవమును బొందఁగలిగెను. ఇందు క్రీ॥ శ॥ 1956 మే 24 వ తేదీని గౌతమ బుద్ధుని రెండువేల ఐదువందలవ నిర్వాణ వార్షికోత్సవము బ్రహ్మాండముగా జరిపినది. ఈ యుత్సవం బతి బ్రహ్మాండముగా ప్రదేశంబులందు జరుపఁబడినది.

సారనాథ్‌లోని విహారములందుఁగాని, దేవాలయము లందుఁగాని కుషాణ గుప్తరాజుల కాలమునాఁటి శిల్పకళా ప్రాభవమును ప్రకటింపఁజేయును. ఇందు గౌతమ బుద్ధుఁడు పద్మాసనాసీనుఁడై, పంచభగ్గీయులు పరివేష్ఠించియుండఁగా, ధర్మబోధ గావించు శిల్ప మప్రతిమానంబయి యున్నది. అందుచేతనే సారనాథ్ బౌద్ధులకు, భారతీయులకు, నితర ప్రపంచ యాత్రికుల కత్యంత యాత్రాస్థలమైనది.

———:o:———

# నలంద

పరమపవిత్రమయిన బౌద్ధమతము వ్యాప్తినిఁ గనిన కాలమందు సమస్త కళలకు, మహావైభవంబులకుఁ జేరెన్నికఁగన్నది నలందాపట్టణము. అప్పుడిందు విశ్వవిద్యాలయ మఖిల కళలకు నిలయమై, విదేశ విద్యార్థులకుఁగూడ జ్ఞాన భిక్ష పెట్టినది. ఇది బీహారు రాష్ట్రమునందుఁగల రాజగిరికి నుత్తరదిక్కున నేడుమైళ్ళ దూరంబున నున్నది. క్రీ॥ శ 629–64. సంవత్సరముల మధ్య భారతదేశమందుఁ బర్య టనమును గావించిన ప్రసిద్ధ చీనాయాత్రికుఁడు హ్యూన్ సాంగు, ఈ నలందా విశ్వవిద్యాలయమున నైదు సంవ

ములు విద్యాభ్యాసంబును గావించెను. ఈ నలందా ప్రదేశం బును, నయిదువందలమంది వర్తకులు పదికోట్ల బంగారు నాణంబు లొసఁగికొనిరి. అచ్చటఁ బానరికాయను మామిడి తోపులో గౌతమబుద్ధుఁడు మూడుమాసము లుండి, బౌద్ధ మత ధర్మమును బోధించెను. అవ్వర్తకు లబోధలు విని, యప్రదేశమును గౌతమ బుద్ధభగవానునకు దానముగా సమర్పించిరి.

జైనమత స్థాపకుండయిన మహావీరుండు నలందాను సందర్శించెను. అచ్చట గోసలునితో నతఁడు గొన్ని మాసం బులు నివసించెను. ఆచార్య నాగార్జునుఁడు ఆయన శిష్యుండు ఆర్యదేవుండు బహుకాలం బిచ్చట వసించిరి. క్రీ॥ శ॥ నాలు గవ శతాబ్దమందు నాగార్జునాచార్యుని సమకాలికుండగు సవిష్ణువను బ్రాహ్మణ పండితుండిచట నూటఎనిమిది దేవా లయములను నిర్మించెను.

క్రీ॥ శ॥ నాలుగవ శతాబ్దమున నలందాపట్టణం బొక విద్యాకేంద్రముగాఁ బ్రభాసిల్లినది. బుద్ధభగవానుని ప్రియ శిష్యులైన సరిపుత్తుఁడు మహామొగ్గలసుఁడు నలందా పట్టణ సమీపంబందు జన్మించి యిచ్చటనే నిర్యాణమును బొందిరి. ఇందుఁగల విద్యాలయంబందు బౌద్ధవాఙ్మయంబు నెక్కువగా బోధించెడివారు. గౌతమబుద్ధుని పూర్వజన్మలలో నతఁ డొక జన్మయందు గొప్ప దాతగా నుండెడివాఁడు. 'నలందా'-అనఁబడెడివాఁడు. ఆతఁ డెవ్వరికెంత యొసంగుచున్నప్ప టికి, నాయనకుఁ దృప్తి యుండెడిది కాదఁట! అమ్మహా

గుణవిశేషమ్మునుబట్టి, యీప్రదేశమ్మునకు నలందా యని పేరొసంగబడినది-నలందాయందు దాదు మఠంబు లుండెడివి. వానిని శక్రాదిత్యుఁడు, బుద్ధగుప్తుఁడు, తథాగతగుప్తుఁడు, బాలాదిత్యుఁడు, వజ్రుఁడు, మధ్య ఇండియాకుఁ జెందిన పేరు దెలియని మఱొక రాజుల ధనసహాయంబు మూలమున నిర్మింపఁబడినవి. గౌతమ బుద్ధభగవానుండు నిర్వాణానంతర మున శక్రాదిత్యుం డిచ్చట నొక సంఘారామమును నిర్మిం చెను. ఈ యారుమఠంబులచుట్టు నొక పెద్ద రాతిగోడప్రాకా రమువలె నిర్మింపఁబడినది.

నలందాపట్టణ విశ్వవిద్యాలయము తక్షశిల తరువాత భారతదేశమందు మిక్కిలి ప్రసిద్ధిఁబొందినది. అంతియేకాక దీని కీర్తి నలుదిశలఁగూడ వ్యాపించినది. అందుచేత విదేశ విద్యార్థుల నాకర్షించినది ఆ కాలమం దింతటి ప్రాభవమున్న విశ్వవిద్యాలయము మఱొకటిలేదు. ఇది బారగాన్ సరోవర ములయొడ్డున నిర్మించిరి విశ్వవిద్యాలయ గోపురము లెంతో యెత్తున వాయువునఁ దేలిపోవుచున్నట్లు సూర్యోదయ కాంతిలో మిలమిల మెఱిసిపోవుచుండెడివఁట. ఈ గోపురాల గవాక్ష రంధ్రములనుండి ప్రాతస్సంధ్యలందు సంజకెంజా యలు విరజిమ్మచు, నెంతయో మనోజ్ఞంబుగా నుండెడివి. నిండుచంద్రుని నందమైన వెలుఁగులు గురియుచుండెడివి. ఈ విశ్వవిద్యాలయావరణంబునందు విశాల భవనంబు లెన్నో యున్నవి ఇవి యత్యద్భుత శిల్పకళా ప్రాభవమును జాటుచున్నవి. వీనిచుట్టు పెద్దపెద్ద చెట్లు, చక్కని యుద్యాన

వనము, పుష్పోద్యానంబులు, నిర్మలజలపూరితములైన సరోవరంబులనుండి మెల్లగాఁ జల్లగా వచ్చు పిల్లగాలులు, గిరగిర తిరుగుచు సన్నని జలధారలుచిమ్మె జలయంత్రములు, మంచినీటి కాలువలతో విరాజిల్లు నారామంబు లెన్నో స్థూపములు, శిలా స్తంభములు, అందమైన దేవాలయములు, గర్భాలయములు, శిలావేదికలు-ఇక్కడఁ బ్రకృతి సర్వంబు మహోన్నతముగా, గంభీరముగా నుండి, యాత్రీకులకు మనోరంజకముగా నుండెడిది. ఈ నలందా పట్టణ వైభవంబు సహస్ర సంవత్సరకాలము మహోన్నతకీర్తినందినది. ఇందలి విశ్వవిద్యాలయముచుట్టు నొక బ్రహ్మాండమైన కుడ్యంబు-మహాకళాశాలలోఁ బ్రవేశించుటకు నొకేయొక సింహద్వారంబు మిక్కిలి గంభీరముగఁ బ్రశంసనీయముగానుండును. ఇందలి సంఘారామంబు లెంతయో యున్నతంబై, మనోహరంబై, సందర్శనీయంబై యుండును.

క్రీ॥ శ॥ 606-640 సంవత్సర మధ్యకాలంబున నలందా విశ్వవిద్యాలయమున పదివేలనుంది విద్యార్థులు, పదిహేను వందల బదిమంది యుపాధ్యాయు లుండెడివారు. ఈ యుపాధ్యాయ విద్వాంసులలోఁ బదిశాస్త్రంబులలో నసమాన పాండిత్యముగలవారు సహస్రాధికంబుగ నుండెడివారు. తిదశ శాస్త్రములందు నయిదువందలమంది యుద్దండపండితు లుండెడివారు. ఏఁబది శాస్త్రములందు సాటిలేని మేటి పండితులు పదుగురుండెడివారట - వీరుగాక నెన్నోవేలమంది బౌద్ధ సన్యాసులు, విద్యాప్రవీణు లుండెడివారు. అందుచేత నలందా

విశ్వవిద్యాలయంబు విదేశ విద్యార్థులనుగూడ నాకర్షించినది. పెక్కురు విద్యాసక్తులు విద్య నభ్యసించుటకు, దూరదేశం బులనుండి వ్యవధానంబులేకుండ నలందాకు వచ్చుచుండెడి వారు. అన్ని శాఖలకుఁ జెందిన విద్యార్థుల కిచ్చటఁ బ్రవే శంబు లభించియుండెడిది. ఈ విశ్వవిద్యాలయంబునం దుచి తంబుగా విద్య నేర్పెడివారు. ఇప్ప్రాంతము పరిపాలించు నొక భూపాలకుం డీ విశ్వవిద్యాలయంబునకు శతగ్రామములను దానముగా నొసంగువాఁడు.

ఇందు వ్యాకరణము, తర్కము, విజ్ఞానము, జ్యోతిషము, వేదము, గణితశాస్త్రము, ఖగోళశాస్త్రము, శబ్దవిద్య, సాంఖ్యము, యోగశాస్త్రము, బౌద్ధపురాణము, బౌద్ధధర్మాలను బోధించెడివారు. ఇందు ముఖ్యముగా వ్యాకరణంబును బోధించెడివారు. దివారాత్రంబులు, శాస్త్రచర్చలు, విద్యా వివాదంబు లెంతో ప్రశంసనీయముగా జరుగుచుండెడిది.

ఒక్కొక్క శాస్త్రమును బోధించుట కొక్కొక్క కళాశాల యుండెడిది. ఆయా శాస్త్రంబులలోఁ బరిపూర్ణ నిష్ణాతులైన పండితు లాయా కళాశాలలోని నాయా విద్యార్థులకు బోధించెడివారు. ఆ నలందా విద్యాపీఠంబునకుఁ బ్రధానాచార్యుండగు శీలభద్రుం డతిమాన పండితుండు. ఆయన సాహిత్య సామ్రాజ్య చక్రవర్తియని కీర్తిఁగాంచి నాఁడు. గొప్ప తపస్సుఁ జేసినవాఁడు ఆయన చదువని శాస్త్రంబు లేదు. ఆ కాలములో విశ్వవిద్యాలయ విద్యార్థికి నసమాన గౌరవ మెచ్చటికిఁబోయినను నుండెడిది. ఇక్కడ

నివసించు బౌద్ధ శ్రమణకులు, గ్రంథములందు జెప్పఁబడిన నియమంబు లన్నియుఁ జక్కఁగా బోధించువారు. అవియెల్ల ననుసరించువారు. నేటికాల విద్యాభ్యాసమువలె నాఁడుకూడ నొక్కొక్క విద్యార్థి యొక్కొక్క శాస్త్రంబును నభిమాన విద్యగాఁ దీసికొని, యందుఁ బరిపూర్ణ పాండిత్యమును సంపాదించెడివాఁడు. కొందరు విద్యార్థులు కొన్ని కొన్ని శాస్త్రములలోఁ బరిశోధన లొనరింపుచుండెడివారు. నలందా విశ్వవిద్యాలయంబందుఁ బ్రవేశ పరీక్ష చాల ఖచ్చితముగను, నియమబద్ధముగను ఉండెడిది. ప్రవేశ పరీక్షకుఁ జనువు విద్యార్థులు నూటికిరువదిమందికంటె నెక్కువ ప్రవేశార్హతఁ బొందఁగలుగువారుకారు అయినప్పటికిఁగూడ విద్యాలయమందు సామాన్యముగ బదిహేనేండ్ల ప్రాయంబుగల విద్యార్థి ముందు సూత్రవృత్తి నభ్యసింపవలయును, ఇరువది యేండ్లు నిండినప్పటికిఁ దానిఁ బూర్తిఁజేసి రెండుమూఁడేండ్లు తత్త్వశాస్త్రంబును నభ్యాసము గావింపవలయును. అప్పటికి నలందావాలభివలె నున్నత విశ్వవిద్యాలయములలో విద్యాభ్యాసం బొనరించుటకు వీలులేదు. ఏ శాస్త్రములోనే స్వల్పసందేహము గలిగినను, నచ్చట యుపాధ్యాయులతి ప్రేమతోఁ దీర్చుచుండెడివారు. విద్యార్థుల ప్రతిభ దివ్యమేధాశక్తి, పండితోపాధ్యాయుల బోధనాశక్తి, యద్భుత ప్రశంసార్హంబులై యుండెడివి ఇవికాక వారికి లభించిన నైతికశిక్షణకూడ నత్యున్నతపథమున కొనఁగొనఁబడియుండెడివి.

విద్యాలయంబందుఁ బ్రతి స్వల్పవిషయం బతి జాగరూకత నియమబద్ధతఁ గలిగియుండెడివి. విద్యార్థులేదైన

నేరంబొనరించిన, సంఘనియమంబు లుల్లంఘించినవారికిఁ దీవ్రముగా శిక్షలుండెడివి. విద్యాలయమునుండి బహిష్కరించుటనుకూడ నొకప్పుడు జరుగుచుండెడిది. అయిన నీ నేరములన్నియు విద్యార్థుల సమక్షమున విచారించి న్యాయ పద్ధతిలో విచారింపఁబడుచు, నందుకుఁ దగిన శిక్ష విధింపఁ బడుచుండెడిది.

నలందా విశ్వవిద్యాలయమున నొక గొప్ప గ్రంథాలయం బుండెడిది. ఇందు 'రత్నసాగరము, రత్నోదధి, రత్నరంజకము' లను మూఁడు పెద్దభవనములలో నుండెడిది. ఈ గ్రంథాగార మసమానంబైనది. ఇందత్యుత్తమ గ్రంథంబు లెన్నో యుండెడివి. ఇందమూల్య బౌద్ధగ్రంథంబు లెన్నో యుండెడివి. ఈ విశ్వవిద్యాలయమునకు అధ్యక్షుఁడగు శీలభద్రుని ముందు ధర్మపాలుఁడు, చంద్రపాలుఁడు, గుణమతి, స్థిరమతి, ప్రభమిత్రుఁడు, జనమిత్రుఁడు, జినచంద్రుఁడు మున్నగువార లీ విద్యాలయమందుఁ బ్రసిద్ధ పండితులుగ వాసిగాంచిరి. హుయాన్‌సాంగ్ ఈ విద్యాలయంబం దైదారు సంవత్సరములు విద్యాభ్యాసంబును గావించి, యేఁబది శాస్త్రంబులం దుద్దండ పండితుండుగఁ బ్రసిద్ధిఁజెందెను. ఆ హుయాన్‌సాంగ్ పండితునిఁ దమ తమ సంస్థానములందు సన్మానించుటకుఁ జక్రవర్తులానాఁడు మిక్కిలి యభిలాష పడెడివారఁట. కనోజినిఁ బరిపాలించు హర్షచక్రవర్తి మహాకవి, మహావిద్వాంసుఁడుకూడ. పాహియాన్ నిరుపమాన పాండిత్యమునకు నబ్బురపడియెడివాఁడు. ఆ చక్రవర్తి బౌద్ధమతము స్వీకరించినప్పటికి నఖిలమతంబులందు సమానాదర

ణంబును జూపెడివాఁడు. నలందా విశ్వవిద్యాలయాభివృద్ధిని, కళాసౌష్ఠవమునుగాంచి సంతసించి, యెన్నో దానములు మిన్నఁగా నొసంగి యాదరించెను. అమ్మహారాజు కాలమున నలందా విశ్వవిద్యాలయం బత్యున్నత దశనొందినది. క్రీ॥ శ॥ 8 వ శతాబ్దమునందుఁ బరిపాలించిన యశోవర్మన్ అను రాజు నలందాలో నొక శిలపైఁదఁ నలందా విషయము లన్నిటిని సమగ్రముగా వ్రాయించెను బుద్ధభగవానుని విగ్రహము పూర్ణవర్మ్మండను రాజు నలందా విశ్వవిద్యాలయమునకుఁ గానుకగా సమర్పించెను. అవ్విగ్రహంబు చక్కఁగ రాగిలోఁ దయారు జేయఁబడినది. ఈ విగ్రహమున బుద్ధదేవుండు నిలుచున్నట్లుగఁ గలదు. ఇది యెనుబదడుగుల యెత్తుగలదు.

నలందా విశ్వవిద్యాలయంబునఁ జదువు విద్యార్థులకు ధారణాశక్తి, వాచాలత, తర్కచాతుర్యము, మున్నగునవి చక్కఁగా నలవడుచుండెడివి. అందు విద్యార్థులలోఁ బెక్కురు ఏకసంతగ్రాహులై యుండెడివారు. విద్యార్థులు వ్యాయామముఁగూడ నొనరించెడివారు నలందాలో జలఘటికా యంత్రం బొక్కటి యుండెడిది అది మగధసామ్రాజ్యమున కంతకు సరియయిన కాలప్రమాణమును జూపుచుండెడిది. చీనా, టిబెట్టు, మధ్యఆసియా మున్నగు ప్రదేశములనుండి యనేక విద్యార్థు లరుదెంచి విద్యాభ్యాసనం బొనరించెడివారు. నలందా విశ్వవిద్యాలయ పండితుల బోధలను వినుటకు వారిని నితరదేశంబు లాహ్వానించువారు. ఇతరదేశ పండితు లిచ్చోటి కరుదెంచి, ఇక్కడఁ బ్రసిద్ధంబగు ప్రదేశములఁ

గాంచి యానందాశ్చర్య నిమగ్నులయ్యెడివారు. ఫాహియాన్, హుయాన్‌సాంగ్ ఈటింగ్సులుగాక, అన్య చీనాదేశీయులు విజ్ఞానసంపాదనార్థము మనదేశమున కరుదెంచెడివారు. భారతదేశమునుండి చీనాదేశానికి జనుదెంచెడివారు. ఈ దేశమునుండి చీనాదేశమునకుఁబోయి, యటఁ జ్ఞానబోధ గావించిన బౌద్ధాచార్యులలో కుమారజీవుఁడు (క్రీ॥ శ॥ 401–412) పరమార్థుఁడు క్రీ॥ శ॥ 546 సం॥లో బోధిధర్ముఁడనువారలు ముఖ్యులు. నలందానుంచికూడఁ గొందఱు బౌద్ధాచార్యులు చీనా, టిబెట్టు దేశాలకుఁబోయి, యట మతబోధఁ గావించిరి. భారతదేశం బంతటనుండి నలందాకు విచ్చేసి యనేక పండితులచట నుపన్యాసంబు లొసంగెడివారు. నాగార్జునాచార్యుఁడు, ఆర్యదేవుఁడు ముఖ్యులు. రాములభద్రుఁడు, అసంగుఁడు వసుబంధుఁడు, దిన్నగుడు, ధర్మపాలుఁడు అనెడివారు కంచినుండి నలందా కరుదెంచి, యట మహోపన్యాసంబుల నొసంగి విజ్ఞానభిక్షువు నొసంగిరి.

ఇంతటి మహావైభవముగల నలందా తురుష్క దండయాత్రలవలన సర్వంబు నిర్మూలనంబయి నేడు నామమాత్రావశిష్టంబైనది. వారిచటి దేవాలయములనుగూడ విధ్వంసంబును గావించిరి. పిదప ముదితభద్రుండనే యొక మహర్షి వానిని మరలఁ గొంత బాగుజేయించెను. అటుపిమ్మట మగధతరువాత మగధ ప్రభువుకు మంత్రిగానున్న కుక్కుటసిద్ధుఁడొక దేవాలయమును నిర్మించెను. ఒకదినమున నా దేవాలయమున మహోపన్యాసంబు జరుగుచుండ నెవరో యువకులగు నూతనసన్యాసులు కొందరరుదెంచి, యయ్యిద్దరు

బౌద్ధభిక్షువుల నవమానపరచిరి. అంతట నా బౌద్ధసన్యాసులకుఁ గోపంబు గలిగెను. అందుకు వారు పండ్రెండు సంవత్సరములు సూర్యునారాధించిరి. పిదప వారొక యజ్ఞమును జేసి, యా యజ్ఞకుండములోని యగ్నిహోత్రమును దీసి బౌద్ధదేవాలయములు మున్నగువానిలో వేసిరి. అప్పుడు గ్రంథభాండాగారముగల రత్నోదధి — త్రొమ్మిదంతస్థుల భవనము మున్నగునవి దగ్ధంబైనవి. బౌద్ధమత క్షీణదశవలనఁ గాని, మహమ్మదీయుల దండయాత్రా ఫలితమువలనఁగాని, నలందా తనయనిర్వచనీయ ప్రాభవమును, విశిష్టకళావిభవంబును గోల్పోయినది.

నలందాలో నొక గొప్ప దేవాలయము. మూఁడు చిన్న దేవాలయము లుండియుండెడివని పరిశోధనవలన బయలుపడినది. ఈ ప్రధానాలయము నలుచతురముగా నిర్మితంబైనట్లుఁ గనఁబడినది. ఈ యాలయమున బుద్ధదేవుని విగ్రహములు పెట్టినట్లు దెలియుచున్నది ఈ దేవాలయమునకుఁ దూర్పునఁ జతుర్భుజాకారముగ నిర్మించిన యొనిమిది బౌద్ధమఠంబులున్నవి. ఇందు జపంబొనరించుకొనుటకు గదులు చిన్నచిన్నవి చాలనున్నవి. ఆభరణములు, కంచు విగ్రహములు, మఠాధికార ముద్రలు, గుప్తరాజుల నాణెములనేకము బయల్పడినవి.

ఈ నాణెంబులలోఁ గుమారగుప్తుఁడు, నరసింహగుప్తుఁడు శశాంకుఁడు, మిహిరభోజుఁడు మున్నగువారి చిత్రంబులున్నవి.

ప్రాచీన భారత విజ్ఞానమును, దేదీప్యమానంబుగాఁ గాంతి నలుదిక్కుల వెలిఁగించిన విజ్ఞానచంద్రికను, సహస్ర సంవత్సరంబు లప్రతిమానంబుగా, సదృశ్యంబును గన్న నలందా నేఁడు నామమాత్రావశిష్టంబైనది. తిరిగి నలంద నాటివైభవమును నేనాటికైనఁ బొందఁగలదని యాశింతము.

——0₀0——

# పాటలీపుత్రము

ప్రాచీన కాలమందు మహోన్నత దశను, మహా వైభవమును, మహాకీర్తినిఁగన్న పట్టణంబులు మన భారత దేశ చరిత్రలో సువర్ణాక్షరములతో వ్రాయఁబడిన వెన్నో లెక్కకుమిక్కిలియున్నవి. వానిలోఁ జేరెన్నికఁగన్నది పాటలీ పుత్రము. ఇది యిప్పుడు బీహారు రాష్ట్రములో పాట్నా యను నామంబున నున్నది. పురాతనకాలమున నిది మగధ సామ్రాజ్యమునకు ముఖ్యంబైన పట్టణముగ నుండెడిది. ఇది కలకత్తాకు మూఁడువందల ముప్పదెనిమిదిమైళ్ళ దూరమున నున్నది. పాటలీపుత్రమునకుఁ గుసుమపురంబని నామం బున్నది. పాటలీ యనఁగ నెఱుపు వర్ణముగల యొకానొక పుష్పము. దానినిఁబట్టి యీ పేరు వచ్చినట్లు తెలియు చున్నది.

గాధిరాజు కుమార్తె పేరు పాటలి. ఆమె విశ్వామిత్రుని సహోదరి ఆమె కోరినంతట విశ్వామిత్రుండొక పట్టణమును దన మాయాజాలంబుచేత సృష్టించి, దానికిఁ బాటలీపుత్ర మను పేరుపెట్టినాఁడు. ఇదియొక పురాణగాథ. క్రీ. పూ. 430 సంవత్సరములోఁ బాటలీపుత్రమును నిర్మించినాఁడు. అజాత శత్రుని ప్రధాన మంత్రులగు సునీథుఁడు, వర్మకరుఁడనువారి యాధ్వర్యమున నీ నగరనిర్మాణము జరిగినది. అజాతశత్రుండు తన రాజ్యమునకు రాజగృహంబును రాజధానిగాఁ జేసి పరిపాలించినాఁడు. కాని రాజగృహంబు చాలదూరమున నున్నందున, నచటనుండి పరిపాలనా వ్యవహారములను సాగించుటయు, నెదిరించుటయు నా రాజునకు దుస్సాధ్యంబుగా నుండెడిది. ఆ కారణమున నజాతశత్రుండు గంగాతీరంబునఁ గ్రొత్తఁగాఁ పాటలీపుత్రంబను నొక పట్టణమును నిర్మించి, రాజధానినందు స్థాపించినాఁడు. గౌతమ బుద్ధుఁడు పాటలీపుత్రంబునకుఁదనచివరదశలో నజాతశత్రునిమంత్రులయాహ్వానమువిూఁద బోయెను. అప్పుడా మహాత్ముఁడు ప్రవేశించిన నగరద్వారమునకు, దానికి సమీపంబునఁగల గంగానదివిూఁద గల ఘట్టంబునకు గౌతమ ద్వారంబని, గౌతమ ఘట్టంబని నామంబును బెట్టిరి గౌతమ బుద్ధునకు నజాతశత్రుండు గొప్ప విందును గావించెను. ఆ సందర్భమున నాయన పాటలీపుత్రమునుగూర్చి, ఇమ్మహానగరం బార్యావర్తంబంతటకుఁ బ్రధాన నగరంబయినభివృద్ధిపొందఁగలదనియు, వ్యాపారాదులకు, సంస్కృతీ నాగరికతలకు నిది కేంద్రముగానుండి మహావైభవముగా వెలుఁగొందగలదనియు గానికొంత కాలమునకు

నగ్ని దేవున కాహుతి యయిపోవఁగలదనియు, బాపవిద్రోహం బులకు నిలయంబై క్షీణంబై పోవఁగలదని దాని భవిష్యత్తును దెలిపెను. అమ్మహాత్ముండు నుడివినట్టులఁ బ్రథమమున మహోన్నత దశయు దుదిదశన దుర్గతిఁగలిగి నామమాత్రావశిష్టంబైనది.

అజాతశత్రువుని తరువాత శిశునాగులు, నందులు మగధరాజ్యంబును బరిపాలించిరి. వీరికిఁగూడ రాజధాని పాటలీపుత్రము వీరుగూడఁ బాటలీపుత్రం బభివృద్ధికి, మహార్దశకెంతో పాటుఁబడిరి క్రీ॥ పూ. 321-298 సంవత్సరములో మౌర్యచంద్రగుప్తుఁడు భారతదేశంబందు నొక గొప్ప సామ్రాజ్యంబును నిర్మించెను. చంద్రగుప్తుఁడీ పాటలీపుత్రాభివృద్ధికి మిక్కిలి కృషిఁజేసెను క్రీ॥ పూ॥ 305 మెగస్తనీసు అను ప్రసిద్ధ విదేశయాత్రికుఁడు మౌర్యచంద్రగుప్తుని యాస్థానమునకు వచ్చి గౌరవింపబడెను. అతఁడు చాలకాలము పాటలీపుత్రంబందు నివశించియుండెను. అతఁడీ పాటలీపుత్రమును నిటుల వర్ణించెను.

పాటలీపుత్రము గంగా హిరణ్యావతీ నదుల సంగమంబున వున్నది. ఇది యత్యంత సౌందర్యవంతమై యున్నది. ఆ కాలంబందలి పట్టణంబులందిది మిక్కిలి గొప్పదియయి యుండెను. ఇప్పట్టణంబునకుఁ జుట్టు శిలాకుడ్యంబు శత్రువులకు దుర్భేద్యంబుగానుండెను. ఇది సుమారు నలువదిమైళ్ళవైశాల్యంబుగల నగరంబై యున్నది. దీని పొడవు ఇరువది మైళ్ళు గలిగియున్నది. ఇప్పట్టణంబునకు ముందు గంగానది ప్రవహించుచున్నది. దీనికిఁగల ప్రాకారంబున కరువది

నాలుగు ద్వారంబులు, డెబ్బది బురుజులు గలవు. ఇమ్మహో న్నత ప్రాకారంబునకుఁజుట్టు పరిఖాజలంబులు భీకరంబుగా, శత్రుభీకరముగాఁ బ్రవహింపుచుండును. ఇందు రాజప్రాసాదము మధ్యనుండి, మహామనోజ్ఞంబుగా నుండెడిది. ఈ మహారాజ సౌధంబునందు, సుందరోద్యానంబులు, గిరగిరఁ దిరుగుచు, నూర్ధ్వముఖంబునఁ బ్రవహించు జలయంత్రధారలతోఁ గన్నులపండువగాఁ గనుపించుచుండును. ఇందుగల స్తంభములను బంగారుపూఁత బూయఁబడినవి. అందముగాఁ గనులవిందుగా నగిషీలు చెక్కఁబడిఁ యింపొంకఁబడినవి. ఈ రాజప్రాసాదంబందెందుఁ జూచిన వెండి బంగారు, మణులింపొందు సుందరతర తల్పంబుల నల్పముగా నున్నవి. రాజభవనంబున కుత్తరదిక్కున మౌర్యచంద్రగుప్తుని పూజామందిరంబెంతో మనోజ్ఞముగ వెలయుచున్నది. ఇప్పట్టణంబందనేక ప్రదేశంబులందు గొప్పగొప్ప దేవాలయంబులొప్పుచున్నవి. ఈ దేవాలయంబుల బురుజులు పసిఁడి నిగ్గులఁదీరు పసిమికాంతులు నలుదిశల నసమానంబుగాఁ బ్రసరింపుచుండును. పట్టణంబున కుత్తరభాగంబున బ్రాహ్మణులకుఁ బ్రత్యేకంబయిన వీధిగలదు. వాయువ్య భాగంబునఁ గల వీధులలో మహౌషధశాలలుండెడివి. పూర్వదిక్కు వీధిన క్షత్రియులు, వైశ్యులు, లోహకారులు నివశింపుచుండెడివారు. పశ్చిమవీధిని, శూద్రులు, సాలెవాండ్రు, చర్మకారులు నివశింపుచుండెడివారు. పట్టణంబందలి నాలుగు దిక్కులందును బరపతిసంఘంబులు, శ్రమజీవికా సంఘంబులొప్పుచుండెడివి. పట్టణమునకు నాలుగు దిక్కులందలి

నాలుగు ద్వారంబులందు బ్రహ్మమహేశ్వర మృత్యుదేవతల దేవాలయములు మహోన్నత వైభవమును బొందుచున్నవి. రాజమందిరమునకు వెలుపల బాటసారులకు విశ్రాంతి గృహములు సుందరోద్యానములు లింపొందియుండెడివి—

ప్రజాపాలన, పట్టణ పారిశుధ్యము, ప్రజారోగ్య రక్షణములెంతో శ్రద్ధగాఁ జూడఁబడుచుండెడివి. శాసనము లతి తీవ్రముగా నమలుజరుపఁబడు చుండెడివి. నూతులందలి జలము లపరిశుభ్రముగావించిన శిక్షలొసంగు చుండెడివారు. బాటలను నసుద్ధముగాఁ గావించినచో తీవ్రశిక్ష గురియగుదురు. మృతకళేబరములను గొనిపోవుటకుఁ బ్రత్యేక మార్గములు గలవు. పురపాలకసంఘ మత్యంత సమర్థనీయముగాఁ బరిపాలించు చుండెడిది. ఈ పురపాలక సంఘం ఐదుగురు సభ్యులుగల పంచాయితీలుగా విభజింపఁబడి యుండెడిది. ఆకాలమునందీ పాటలీపుత్రవైభవము నిత్యకళ్యాణ పచ్చల తోరణంబుగా నుండెడిది. దానితో సరియగు పట్టణము భారతదేశము సందెచ్చటనులేదు. అని యతండున్నదున్నట్లుగా లిఖించినాఁడు.

క్రీ॥ పూ॥ 272 వ సంవత్సరమున అశోక చక్రవర్తి రాజ్యానికి వచ్చి క్రీ॥ పూ॥ 269 వ సంవత్సరమునఁ బాటలీపుత్రమున పట్టాభిషిక్తుండయ్యెను. ఆ చక్రవర్తి దాదాపు నిరువది సంవత్సరంబు లేకచ్ఛత్రాధిపత్యంబుగాఁ బరిపాలించెను. ఆ కాలమందు దన రాజధానియైన పాటలీపుత్రమందు నెన్నియో సుందరమైన భవనములను, నందమైన మందిరములను, విహారములను, దారువుతోఁ గుడ్యంబులను,

బ్రహ్మాండంబైన పహారీలను మిక్కిలిగా నిర్మించినాఁడు. అశోకుఁడు నివశించు రాజమందిరము దాదాపు పదునాలుగు చదరపు మైళ్ళ విస్తీర్ణం బాకమించియున్నదఁట - షుమారు దాని వెడల్పు ఒకమైలు గలిగియుండేదట - నలువదడుగుల యెత్తైన ప్రహరీగోడ రాతితోఁ జుట్టు గట్టిగాఁ గట్టబడినదట - శత్రువులకది నిర్భేద్యముగా నుండునటుల అశోకచక్రవర్తి గట్టించినాఁడు. ఇందు నూరు స్తంభముల మందిరం బొకటి సుందరముగా నిర్మించినాఁడు.

అశోకుని తరువాతఁ బాటలీపుత్రము గుప్త సామ్రాజ్యమునకు నాయువుపట్టుగా విరాజిల్లినది. మొదటి చంద్రగుప్తుఁడు పాటలీపుత్రమందు లిచ్ఛవి రాకుమారినిఁ బెండ్లాడి, క్రీ॥ శ॥ 319 మార్చి 8 వ తేదీనిఁ బట్టాభిషేకంబు గావించుకొనినాఁడు మొదట చంద్రగుప్తుని తరువాత రాజ్యమునకువచ్చిన యతని కుమారుఁడు సముద్రగుప్తుఁడు క్రీ॥ శ॥ 326–375 అనేక దిగ్విజయయాత్రలఁ గావించి, బ్రహ్మాండగుప్త సామ్రాజ్యమును నిర్మించి, వాసిఁగాంచినాఁడు. అటుపైని రెండవ చంద్రగుప్తుఁడు శౌర్యసాహసాలు గలిగినవాడై సాహసాంక విక్రమార్కుఁడని బిరుదుఁబొంది క్రీ॥ శ॥ 375 నుండి 413 వఱకుఁ జక్కఁగాఁ బరిపాలించెను విక్రమార్కుఁడు పరిపాలించు కాలములోఁ బ్రసిద్ధ చీనాయాత్రికుఁడగు ఫాహియాన్ క్రీ॥ శ॥ 406 ప్రాంతమునఁ బాటలీపుత్రమునకు వచ్చి యచట మూఁడేడులు సంస్కృతమును నభ్యసించెను. ఆకాలమందుఁ బాటలీపుత్రమున్న వైభవం బిటుల వర్ణించెను.

"నగరమందు రెండు బౌద్ధమఠములు గలవు. అందు బౌద్ధభిక్షువు లెందఱోకలరు. వారికిఁ గావలసిన సదుపాయము లెన్నోకలవు. వారి బోధనలను వినుటకు విదేశయాత్రీకు లెందఱో యరుదెంతురు. పాటలీపుత్రమునందుఁ బౌరులొక వైద్యశాలను నిర్మించిరి. ఇచ్చటఁ బేదల కుచితముగా వైద్య సహాయమును గావించువారు. వ్యాధి నయమగునంతవఱ కుచితముగా నన్నపానంబు లొసంగువారు. ఇవికాక పాటలీ పుత్రములో నెటుఁజూచిన ధర్మశాలలు, అన్నసత్రములు, విశ్రాంతి మందిరములెన్నో మిన్నఁగ నున్నవి. చక్రవర్తి మూలంబుగాఁగాని, రాజోద్యోగులవలనఁగాని, ప్రజల కెట్టి బాధ యుండునదికాదు. రాజబొక్కసంబునకుఁ గావలసిన ధనమంతయు ూజమాన్యంబులనుండి వచ్చుచుండెడిది. వ్యవసాయమును జేయు రైతులుమాత్రము పండిన పంటలో నారవవంతు రాజున కర్పించుచుండెడివారు. చక్రవర్తి శాస నంబు లమలుపరచుటలో నుద్యోగు లత్యంత జాగరూకత వహించెడివారు. దోషులకుఁ గఠినములయిన శిక్షలు లేవు" అని వర్ణించినాఁడు.

అటుపిమ్మట క్రీ॥ శ॥ 637 లో పాటలీపుత్రమును ప్రసిద్ధ చీనాయాత్రీకుఁడగు హుయాన్‌సాంగ్ క్రీ॥ శ॥ 637 సంవత్సరమునందు దర్శించెను అప్పటికిఁ బాటలీపుత్రము చాల హీనదశలో, బడినదని తెలిపినాఁడు. నగరమందలి రాజభవనములు, ప్రాకారములు, బురుజులు, పవిత్రదేవా లయములు శోణానదీ ప్రవాహఁబున మునిఁగి పోయినవని

యతండు దెలిపినాడు. అశోక చక్రవర్తి, గుప్తచక్రవర్తులు నిర్మించిన స్తూపములు, శిలాస్తంభములు మాత్రము అక్కడక్కడ సశేషంబుగ నున్నవని యనినాడు అశోకచక్రవర్తి పరిపాలించిన కాలములో క్రీ॥ పూ॥ 74 లో బౌద్ధమత మహాసభ పాటలీపుత్రమందు నొక గొప్పమందిరమున జరిగెనని వర్ణించెను. అది శిథిలావస్థగా నున్నదని హుయాన్ సాంగ్ పలికెను. అప్పటి పాటలీ గతినిజూచి యతండు మిక్కిలి వగచెను. రాజగృహమును బుద్ధుడు సందర్శించినటుల జైనమత స్థాపకుడగు వర్ధమానమహావీరుండీ పాటలీపుత్రమును సందర్శించినాడు.

దాక్షిణాత్యుల పాలనంబందుఁగూడఁ బాటలీపుత్ర ప్రాంతమంతయు బౌద్ధమత జ్ఞానమునకు నిలయముగానున్నది. పిదప మహమ్మదీయుల పరిపాలన కాలమున పాటలీ వైభవంబంతయుఁ బూర్తిగా నశించినది అటుతరువాత నాంగ్లేయుల యధికార మధికమైనది. తరువాత దీనిని నాంగ్లేయులు స్వాధీనంబొనరించుకొనినారు — అదియే ఇప్పటి పాట్నా యయినది

ఇప్పుడు రెండు హిందూదేవాలయము లిందున్నవి. ఇవి యమ్మవారి దేవాలయములు మహారాజ్ గంజ్‌లో నొకటియున్నది. దీనిపేరు బారాపతనదేవి యాలయము. రెండవది హరమందిర్ చౌకుయొద్దఁగలదు. ఈ ఆలయమును ఛోటాపతన దేవాలయము అని యందురు. సతీదేవి మృతకళేబరమును శివుండు మోసికొనిపోవుచుండ నీ ప్రదేశంబం

దామె వస్త్రము జారిపడినందున నా పేరు వచ్చినట్లు దెలియు చున్నది.

క్రీ॥ శ॥ 16౬0 లో గురుగోవింద సింగు పాట్నాలో జన్మించెను. ఈ ప్రదేశం బందు గురుగోవిందసింగు పేర నాలయంబొకటి నిర్మించఁబడినది. ఈ యాలయంబు ముందొక ప్రదేశంబున నెత్తయిన ధ్వజస్తంభమును పాతిరి. ఆ గురుగోవిందు దూగిన ఉయ్యాల, తొడిగిన చెప్పులు గ్రంథ సాహెబ్ అను సిక్కుల పవిత్రగ్రంథము నేటి కీ యాలయములో భద్రపరుపఁబడినవి. భక్తులకు వీనినిఁ జూపెదరు. సిక్కుమతస్థు లీ దేవాలయమును నతిపవిత్రముగఁ భావింతురు—

ఆర్యభట్టను ప్రసిద్ధ భారతీయ ఖగోళశాస్త్రజ్ఞుండు క్రీ॥ శ॥ 476 లో పాటలీపుత్రంబందు జన్మించినాఁడు. అర్థశాస్త్రనిర్మాత కౌటిల్యుఁడు. పాణినీసూత్రములకు వ్యాఖ్యాతయయిన కాత్యాయనుఁడు నీ పాటలీపుత్రములోనే జన్మించిరి ఆ కాలములోఁ పాటలీపుత్ర నగర ప్రాంతములో మోదుగు చెట్లు విపరీతముగ నభివృద్ధిఁజెందినవట — దీనినిఁ ప్రాశస్త్యమునుగూర్చి మహాకవి దండి తన దశకుమార చరిత్రములోను, కవికుల గురువు, మహాకవి కాళిదాసు తన రఘువంశ కావ్యములో, నతి మనోజ్ఞముగఁ ప్రశంసించినారు.

పాటలీపుత్ర ప్రాంతమందు సాఁగిన పరిశోధనలఁబట్టి యనేక పురాతన శిథిలంబులు బయల్పడెను. ఇందెనిమిది పరుసలుగల మౌర్యుల మంటపము కనుఁగొనబడినది. ద్వాపర

యుగమందు హస్తినాపురమును పరిపాలించిన కౌరవ పాండవ భవనముల శిల్పపద్ధతులును, నీ పాటలీపుత్ర భవనములకుఁ బోలికలు గలవని కనుఁగొనఁబడినది. ఒకనాటి భారతీయ కళాసంపదకు స్థానమై, నాటి యార్యావర్త నగరంబులన్నిటికి మాణిక్యంబుగఁ భాసిల్లినది.

ఇప్పటి పాట్నాబంకిపూర్, ఆ పరిసర గ్రామంబు లన్నియు వ్యాపించియున్న ప్రదేశమంతయు బూర్వము పాటలీపుత్రముగా నుండెడిది. జరాసంధుఁడు పరిపాలించిన గిరివ్రజ, మీ పాటలీపుత్రమునకు సమీపముగా నుండెడిది. మగధరాజగు బింబిసారుండు క్రీ. పూ. 519-491 రాజగృహమును రాజధానిగఁ జేసికొని పాలించెను ఈ ప్రదేశమును గౌతమబుద్ధుం డనేక పర్యాయములు సందర్శించి బోధలఁగావించెను అజాతశత్రువను నుదయాశ్వుండు తన రాజధానిని రాజగృహమునుండి పాటలీపుత్రమునకు మార్చెను. అతం డీ పాటలీపుత్ర వైభవమునకు మిక్కిలి కృషిఁజేసెను.

ఇంతటి మహావైభవమును, నెంతో కీర్తిని, మరెంతో విదేశాకర్షణను బొందిన పాటలీపుత్రమునకు నేటి పాట్నాకు నాటి ప్రాభవము, నానాటి యూతీకసందర్శన, ముందు ముందుఁ గలుగఁగలదని యింకెంతెంతో యాశింతుము.

# నాసిక్

కర్మభూమి యయిన భారతదేశమందు దాదాపు యిరువందల సంవత్సరములు జైన బౌద్ధమతములు వ్యాపించినవి. అభిప్రాయభేదముల మూలముగ జైనమతమునకన్న బౌద్ధమతము మిన్నగా రాజాకర్షణ, ప్రజాకర్షణం బొందినది. అశోకుఁడు, హర్షుడు మున్నగు చక్రవర్తులు బౌద్ధమతమును స్వీకరించి, దాని యభివృద్ధికి నధికంబైన కృషి నొనరించిరి. దక్షిణోత్తర దేశములందేకాక, యాంధ్రదేశమందుఁగూడ బౌద్ధమతము మిక్కిలి వ్యాప్తంబైనది. ఎన్నో సంఘారామములు, చైత్యములు స్థాపింపఁబడినవి. ఆంధ్రచక్రవర్తులుకూడ నీ బౌద్ధమతమును విశేషముగ నాదరించుటయేకాక, యనేక గుహాలయములు, చైత్యములు నిర్మించిరి. అట్లు విశేషముగ నిర్మించిన రాజులలో నాంధ్ర శాతవాహనరాజు లెన్నఁదగినవారు. వీరు క్రీ.పూ. 226 సంవత్సరములో నాంధ్రసామ్రాజ్యమును స్థాపించి, షుమారు నాలుగువందలయేఁబది సంవత్సరము లవిచ్ఛిన్నముగాఁ బరిపాలించిరి. వీరు బ్రాహ్మణ మతాభిమానులైనప్పటికీ జైన బౌద్ధమతములను విశేషముగ నాదరించిరి. వీరికాలమున భట్టిప్రోలు, అమరావతి, జగ్గయ్యపేట, నాగార్జునకొండ, నాసిక్ కార్లీ, కన్హేరి మున్నగు ప్రదేశములు గొప్ప బౌద్ధక్షేత్రములుగ రాజిల్లి, ప్రజాభిమానమును సంపాదించుకొనినవి—ఆంధ్ర శాతవాహనులు

జగద్విఖ్యాతంబైన బౌద్ధస్తూపములు—విహారములు — గుహాలయములను, బౌద్ధాలయములను నిర్మించి పోషించి, శిల్పకళను నభిమానించి, యసమాన యశమును బడసిరి. బౌద్ధభిక్షుకుల యారాధనకొఱకు నిర్మింపఁబడినవి చైత్యములు. వీనిని నిర్జనప్రదేశంబందు నిర్మింపక, పర్వతములందుఁ దొలువఁబడినందున గుహాలని పేరుకలిగినది. గుహాలందు సుందరమైన శిల్పకళ సంశోభిల్లుచుండును. వీనిలోపల విశాలంబై, యందంబైన మందిరము లింద్రభవనమువలె నొప్పుచుండును.

ఆంధ్రరాజులు నిర్మించిన గుహాలన్నిటిలోను, విశిష్టత శిల్పకళాప్రాభవము వెలుగొందఁజేయునది కార్లీగుహాలయము. ఇది బొంబాయి పూనా పట్టణములమధ్యఁ గార్లీయను ప్రదేశమున గలదు. ఆ స్థలమున నీ గుహాలయము నిర్మించుటచే దీనికి 'కార్లీ' గుహాలయంబని పేరు కలిగినది. భారతదేశంబందు నిర్మింపఁబడిన గుహాలయము లన్నిటికన్నఁ గార్లీగుహాలయము సాటిలేని కళాఖండము. ఇది యత్యంత గంభీరముగను, నమిత సుందరముగను నొప్పుచుండును ఈ గుహాలయము పొడవు నూటయిరువదియారడుగులు. వెడల్పు నలువదియారడుగులు గలిగియుండును. అందుఁగల సుందరంబైన మందిరమునకు రెండుప్రక్కల నందము జిందియాడు గంభీరములైన స్తంభముల వరుస లున్నవి. ఈ స్తంభములకు వివిధ విధముల శిల్పకళానైపుణ్యము సంపాదవుచుండును. స్తంభముల యుపరిభాగమున సుందరంబైన మకుటము లింపొదవునటులఁ జెక్కఁబడినవి. ఈ మకుటములపైని

నేనుఁగుమీఁద నెక్కిన స్త్రీ పురుష విగ్రహములు శతాధికముగాఁ జిత్రవిచిత్రములుగఁ జిత్రింపఁబడినవి. మందిరము పైకప్పు యర్ధగోళాకృతిలోఁ గడుఁజక్కఁగా జెక్కఁబడినది.

ఈ గుహాలయమందుఁగల మందిరమునకు రెండు దిశల స్తంభముల కావలగుమ్మటాకారముగల గదు లెన్నియో యతి సుందరముగాఁ గనులవిందుఁగా బసందైన శిల్పకళ నింపొందుచందముగా నిర్మింపఁబడినవి. ఇందు బౌద్ధభిక్షువులు నివశించుటకు నేర్పాటుఁ జేయబడినవి ఈ మందిరములోపల నెదురుగా నొక శివాలయములోని గర్భగుడియందుఁగల శివ లింగమువలె స్థూపవిగ్రహము ఒకటి కలదు. అది స్వచ్ఛంబైన పాలరాతితో నిర్మింపఁబడినది. అమ్మందిరంబందలి లోపల భాగంబంతయు జిమ్మచీఁకటులఁ గ్రమ్మకొని యుండును. ఆలయంబంతటఁ బ్రశాంత గంభీర వాతావరణము అలుముకొని, యెట్టివారికేనిఁ బ్రశాంతిస్వాంతమునఁ బట్టువడును. అచ్చటఁ జేరినచో నెంత దుర్మార్గులకైన భక్తి యలవడఁగలదు.

ఏ మాత్రం బలికిడియయినను, 'ఓం' అని ధ్వని వినఁబడుచుండును. మందిరోపరిభాగమున నొకమూల గవాక్షరంధ్రములను దొలిచిరి. అందుచేత బౌద్ధారామ ప్రదేశంబగు స్థూపముకడ సూర్యకాంతు లా కిటికిగుండ వచ్చిపడును. అమ్మందిర ప్రకృతియంతయు నిశ్చలచిత్తమునకు, నిర్మల భక్తికిని, నిరుపమ మౌనముద్రకును, నిరంతరసాధనకు దోడ్పడుననుట కావంతయు సందియము లేదు.

ప్రశాంతము జీవితమును సంపాదించుట కా మందిరం బెంతయో సహాయకారి కాఁగలదు.

బౌద్ధభిక్షువులా మందిరమునఁ జేరి జ్ఞానశక్తిని, యోగమూర్తిని సంపాదించుకొందురు. అమ్మందిర శిల్పము లనల్ప కళావిశిష్టతను గల్పించి యాంధ్రశిల్పులు ప్రశంసాపాత్రులైరి.

నాటికిని నేటికిని నీ కార్లీ గుహాలయము గుహాలయము లన్నిటికిఁ దలమానికముగాఁగలదు. ప్రాచీనభారత కళా విశిష్టత, సంస్కృతి యీ కార్లీ గుహాలయము ప్రకటింపఁ జేయుచున్నది. దీనిని జయింతీపుర సంవాసియయిన యొక వర్తకుండు నిర్మించినాఁడు. ఇట్టి కళాఖండంబయిన కార్లీ గుహాలయము నతఁడు నిర్మించి, భారతదేశ ప్రాచీన కళా సంస్కృతి చరిత్రలో బంగారుటక్షరముల వ్రాయఁబడిన వాఁడయ్యెను.

అనల్ప శిల్పాలకు, నపురూపచిత్రాలకు, భారతదేశ మత్యంత ప్రాధాన్యత వహించి ఖండఖండాంతరము లందఖండ విఖ్యాతిని సముపార్జించెననుటలో సందియమావంత లేదు. ఉండదు. ఉండబోదు.

———:o:———

# కపిలవస్తు

ప్రతి యుగమునందు ధర్మమంతరించి, యధర్మము ప్రబలినపుడు భగవంతుడే దానొక యవతారమును దాల్చి ధర్మమును స్థాపించుచుండును అట్టి భగవదవతారములలో గౌతమ బుద్ధుని యవతారమొకటి కపిలవస్తురాజ్యము ఆర్యావర్త దేశమందు ప్రజాస్వామికపద్ధతులపై నేర్పడిన నాయకసత్తాక రాజ్యములలో నొకటి. ఈ రాజ్యము నేపాలు సరిహద్దులలో నున్నది. ఈ సామ్రాజ్యమును శాక్యవంశస్థులు పరిపాలించుటచే దీనికి శాక్యరాజ్యమని పేరు కలిగినది నేపాలునకు దగ్గరగా యిగ్లివియాకలదు. దీనికి ఉత్తరదిక్కున సుమారు మూడునన్నరమైళ్ళ దూరమున శాక్యరాజ్యముకలదు ఇప్పటి చిత్రాద్రై, రామ్‌ఘాట్, సారిడ్వా, తిలావురా-అను నాలుగు గ్రామములు కలిసి పూర్వము కపిలవస్తు నగరముగా నుండెడిది. శాక్యరాజుల భవనమును తిలావురాయను గ్రామము దగ్గరుండెడిది. గౌతమబుద్ధుడు జన్మించిన లుంబినీవనము కపిలవస్తునకు పదిమైళ్ళ దూరమునగలదు.

ఈ లుంబినీవనము భగవాన్‌పూర్ ఉత్తరభాగమున రెండుమైళ్ళ దూరముననను, పదేరియాకు నుత్తరమున నొక మైలు దూరమునకలదు. ఈ లుంబినీవనమునందు గౌతమ బుద్ధుడు జన్మించెను. క్రీ. శ. 1066 సంవత్సరములో నొక శిలా స్తంభము బయుటపడినది. దీనినిబట్టి గౌతమబుద్ధ భగవానుని సంస్మరించుటకొరకు నమ్మహాత్ముని జన్మస్థలములో నశోకచక్రవర్తిచే స్థాపింపబడినది. అశోకచక్రవర్తి హిమవ

త్పర్వత పాదభూమిలో కొన్ని స్తంభశాసనములను చెక్కించి నాఁడు. వానిలో నొకటి రుమ్మిందై స్తంభముమీఁదను, మరొకటి నిగ్లివియా స్తంభముమీఁదను, చెక్కింపబడినవి. స్తంభ శాసనములు రెండు మాత్రము కనబడుచున్నవి. అశోకుడు పట్టాభిషేకమయిన తన పదునాలుగవ సంవత్సరమున కనక బుద్ధుని స్థూపమును మునుపటికన్న రెండింతలగా విశాలపరచినాడు. ఆయన స్వయముగా నీ ప్రదేశమునకు వచ్చి యిట నొక శిలా స్తంభమును నాటి తన మతాభిమానమును బుద్ధ భక్తియును పెల్లుగా వెల్లడించెను కనకముని గౌతమబుద్ధుని ముందవతరించిన బుద్ధులలో నొకడు. అశోక చక్రవర్తి లుంబీని గ్రామమువారు ప్రభుత్వమునకు పూర్తి పన్నులు చెల్లింప లేదని, ఊరి ఫలసాయమున నెనిమిదవంతు మాత్రము చెల్లించిన చాలునని ప్రకటించెను.

క్రీ॥ శ॥ 7 వ శతాబ్దమున చీనాయాత్రికుఁడు హుయాన్ యీ స్థలమును సందర్శించి, యిందశోకుఁడు నిర్మించిన శాసనమును పరిశీలించి, యీ ప్రదేశము గౌతమ బుద్ధుని ప్రదేశమని నిర్ణయించెను. రుమ్మిందా స్తంభమునకు పం డెండుమైళ్ళ దూరమున నిగ్లీవమను పట్టణముగలదు. దానికి నొకమైలు దక్షిణముగా నిగిలీసాగరమను గొప్ప చెఱువుకలదు. దానికి పశ్చిమదిక్కున నిగ్లీవియా స్తంభము కలదు. ఈ ప్రదేశమునుగూడ ప్రసిద్ధ చీనాయాత్రికుడగు హుయాన్ సాంగు సందర్శించెను. అటనున్న శిలాశాసనమును నతఁడు చక్కగా పరిశీలించెను. అతడుకూడ నీ ప్రదేశమును గౌతమ బుద్ధుని జన్మస్థానమని నిర్ధారణచేసెను. క్రీ॥ పూ॥

249 వ సంవత్సరమున అశోకుడు ఉపగుప్తుని వెంటబెట్టుకొని లుంబినీవనమునకు వచ్చెను. అమ్మహారాజచట నూరువేల బంగారు నాణెములను నచ్చటవారికి దక్షిణలనిచ్చి, యీ డెరాయి స్తంభములను రెండు నిర్మించినాఁడు. ఈ స్థలము నందు మాయాదేవి దేవాలయముకూడ కలదు. గౌతమ బుద్ధుని మరణానంతరము నతని యస్థికలను నిచ్చట వారు నిక్షిప్తమును గావించిరి. వారు దానిపై నొక సుందర స్థూపమును నిర్మించిరి. ఈ పవిత్రప్రదేశమును నిప్పుడు సిప్రాహాయని పిలుచుచున్నారు. చైనాయాత్రికుడగు పాహియాన్ వ్రాసిన ప్రకారము రుమ్మిందైకి దక్షిణభాగమున తొమ్మిదిమైళ్ళలోగల సిప్రావయొద్దగలది కపిలవస్తు నగరమని తలపవచ్చును. పాహియాన్ యీ ప్రదేశమునకువచ్చి చూచునప్పటికి కపిలవస్తునగరము పూర్ణముగా శిథిలావస్థయందు కలదు. అదియుకాక నిర్జనమైయున్నది. అందుచేత నతండిట్లు వెల్లడించెను.

శాక్యముని గౌతమ బుద్ధునకు పూర్వము ముప్వురు బుద్ధులు జన్మించిరి. అవ్వారిలొ కనకముని బుద్ధుఁడొకడు. అక్కనకబుద్ధుని జన్మస్థలమునకు తూర్పుగా షుమారొక యోజనమునకు లోపుగా నొక కపిలవస్తు నగరము కలదు. ఇందు జన్మించిన శుద్ధోదనుని కుమారుడైన గౌతమ బుద్ధుఁడు నాలుగవవాడు. ఇమ్మహానీయుని తరువాత మైత్రేయుండయిదవ బుద్ధుఁడు. క్రమచందుడు, కనకముని, కశ్యపుడు—అను ముప్వురు గౌతమ బుద్ధునకు ముందున్నవారు'' అని చెప్పినాఁడు.

పాహియాన్ కపిలవస్తునగరమునకు వచ్చునప్పటికి కపిలవస్తునగరమున రాజులేడు. ప్రజలంతకన్న లేరు. సన్యాసులుమాత్రము కొలదిమంది యుండెడివారు. ఇందు శుద్ధోదనుడు నివసించు రాజభవన మప్పుడులేదు కాని ఈ ప్రదేశమునమాత్రము శుద్ధోదనుని మాయాదేవి విగ్రహములు మాత్రము కలవు కాని కపిలవస్తునగరమున గౌతమ బుద్ధభగవానునకు సంబంధించిన ప్రదేశము లనేకములు గలవు. ఆ ప్రదేశము లమ్మహాత్ముని జ్ఞాపకార్థము స్తూపములు, విహారములు నిర్మింపబడినవి లుంబినీవనమందొక యందమైన సరస్సు కలదు. ఇందు మాయాదేవి స్నానమును చేసినది. పిదప సరస్సునుండి గట్టుకువచ్చినది. ఇవ్వలి కరుదెంచి, యిరువదడుగులు వేసినది. ఆమెకు పిదప ప్రసవవేదనము కలిగి యొక మోదుగు చెట్టు కొమ్మ పట్టుకొనినది. అప్పుడు గౌతమ బుద్ధుడు జన్మించినాడు. వెంటనే యా పవిత్రమూర్తి వివశాంగి యయినది. ఆ తరుణమందు పుట్టిన బుద్ధుడేడడుగులు నడిచినాడు. అప్పుడు నాగరాజు లిద్దరు వచ్చి యీ శిశువునకు స్నానమును చేయించిరి

ప్రసిద్ధ చీనాయాత్రికుడు పాహియాన్ కపిలవస్తు నగరమునకువచ్చి, గౌతమబుద్ధుని జన్మస్థలమిటుల శిథిలావస్థయందుండుట కన్నీరుమున్నీరుగా శోకించినాడు. కపిలవస్తు దేశము నాలుగువేల లీలుండేదట. ఒక లీయనగా నారువందల ముప్పదిమూడు గజములు. అంతటి విస్తీర్ణము గలిగియున్నదన్నమాట. ఆ నగరము మధ్యస్థలము పదునెనిమిది మైళ్ళు విశాలముగలిగి యుండెడిదట. దానికి చుట్టుగల

ప్రాకారమును మహాబలీయముగ, కొండరాళ్ళచేత గట్టిరి. దానికి ప్రక్కనే యగాధమైన యొక యగడ్తకలదు. అందుచేత నది శత్రునిర్భేద్యముగ నుండెడిది. శుద్ధోదనుడు నివసించు రాజభవనము నగరమధ్యమువగలదు. అది యీనాటికి శిథిలావస్థనున్నది. అందొక యందమైన విహారమును నిర్మించిరి. ఆ స్థలమున కీశాన్యమూలముగ నొక స్థూపము గలదు. అసితఋషి యచ్చటనే కూర్చుండి గౌతమబుద్ధునకు జాతకచక్రమువేసి, యతండు దివ్యపురుషుండు కాగలండని పలికినాడు.

కపిలవస్తు నగరమున గౌతమబుద్ధుడు దన బాల్యమున నాటలాడుకొను ప్రదేశము లనేకము లీనాటికి చిహ్నములుగ గనబడుచున్నవి. గౌతమబుద్ధుడు యశోధరను వివాహమాడి విహరించిన యుద్యానవనము నేటికి శిథిలావస్థయందున్నది. అమ్మహాత్ము డొకనాడు ఛన్నుడు రథముదోలగా నందధిరోహించి సాగిన నగరవీధుల చిహ్నములుకూడ కలవు. ఆ వీధులందు గౌతమబుద్ధుడు వ్యాధిగ్రస్తుని మృతకళేబరస్థలమును, శ్రమనుని చూచిన స్థలము నేటికిగలదు. తథాగతుండు నిర్వాణమునుపొందిన యనంతరము శాక్యరాజునకు నాయన యస్థికలలో నర్థభాగము స్వాధీనమైనది. ఆ శాక్యరాజు వానిని నిక్షిప్తమునుజేసి దానిపై నొక స్థూపమును నిర్మించెను. అది యెంతో మనోహరముగ, నేత్రపర్వముగ, కళావిశిష్టతగ, నిర్మింపబడినది. ఇది నేటికిని చెక్కుచెదరకయున్నది. దీనిని బౌద్ధసన్యాసులు సందర్శించి పోవుచుందురు. దీనికి ప్రక్కనే యొక సంఘా

రామము కలదు. ఇందప్పుడు బౌద్ధభిక్షువులు నివశించుటకు తగిన సముపాయములుండెడివి. దీనికి తూర్పున ముప్పది యారుమైళ్ళ దూరమున నశోకచక్రవర్తి నిర్మించిన యొక స్తూపముకలదు. ఈ స్థలమునందే గౌతమబుద్ధుడు దన యాభరణములను రత్నాంబరములను దీసి ఛన్నున కిచ్చెను. ఈ ప్రదేశముననే యతడు శిరోముండన మొనరించుకొని కాషాయవస్త్రములను ధరించెను. ఇట్టి గొప్ప విషయమునకు జ్ఞాపకార్థముగ నందు సుందరములైన గోపురములు నిర్మింపబడినవి. శాక్యులు, కోలియలు, బులీలు, భగ్గులు, కలనులు మోరియోలు, మల్లులు, లిచ్ఛలీలు, అను నెనిమిదిమంద క్షత్రియవంశీయులు గౌతమబుద్ధ నిర్యాణానంతరము ఆ మహాత్ముని యస్థికలను గోరిరి. వారికి సమీపమున బుద్ధదేవుని అస్థికలను పంచబడినవి. కపిలవస్తుకు సమీపముగ నిగ్రోధ వనమున్నది ఇప్పుడది యొక దిబ్బగానున్నది. ఆ నిగ్రోధ మఠమునందు బుద్ధుడు జ్ఞానియై తిరిగి కపిలవస్తు నగరమునకు రాక యుందు నివసించెను. అక్కడకు భార్య యశోధరయు, కుమారుడు రాహులుడు మున్నగువారువచ్చి బుద్ధ భగవానుని దర్శించిరి. బుద్ధభగవానుడవ్వారికి హితబోధచేసి తన సిద్ధాంతములను ప్రబోధించెను. పెక్కురచ్చోటనే గౌతమ బుద్ధుని సందర్శించి, సన్యాసముచు స్వీకరించి బౌద్ధభిక్షువులైరి.

శుద్ధోదనుడు పరిపాలించు కాలమున నీ కపిలవస్తునగర మెంతయో మహోన్నతదశ నందెను ఆనాటి పట్టణములలో మిన్నయైన కీర్తిని నందినది. బుద్ధుడు జ్ఞానియైన పిదప నతఁడు కపిలవస్తునగరమునకు రెండుసారు లరుదెంచెను.

గౌతమ బుద్ధుని నిర్వాణానంతరము శాక్యవంశీయులను విరూధక మహీపాలుడు యుద్ధమున నోడించి యా రాజధానిని సర్వనాశనమును గావించెను. క్రీ॥ శ॥ 5 వ శతాబ్దమునాటికి నీ పట్టణమున ప్రజలు లేక యరణ్య ప్రదేశమైనది. శాక్యవంశ రాజులు నివసించిన స్థలములందు స్థూపములను మాత్రము నిర్మించిరి. అమ్మహాత్ముడు నిర్వాణమునుజెంది రెండువేల యయిదువందల సంవత్సరములైన పిదప నా పట్టణము మరల పూర్వవైభవమును పొందగలిగినది. అందిప్పు డందము లయిన కట్టడములను నిర్మించిరి. నాటి వైభవ మీ నాటికి గనబడుచున్నది. ప్రాచీనకాలమం దమిత మహోన్నత దశ నందుండి, ధర్మసంస్థాపనమును గావించిన గౌతమ బుద్ధ దేవుని పవిత్ర జన్మస్థలము కపిలవస్తునగరము. అందానాడు విలసిల్లిన సుందరతరమైన సౌధములు, ప్రజాశాంతి జీవనములు, చరిత్రలో బంగారు టక్షరములలో లిఖింపదగినది. అపర విష్ణావతారమైన బుద్ధుడు యుగయుగములుగ పవిత్ర సంస్మరణీయుడయ్యెను. అమ్మహాత్ముడు జన్మించిన పవిత్ర కపిలవస్తు నగరముకూడ నత్యంత పుణ్యప్రదమైన యాత్రా స్థలము. ఇట్టిమహత్తర పురుషులను, మహత్తర నగరములను గలిగిన మన భారతభూమి యెంతయో కృతార్థత గనినదనుటలో నొక్కింత సందేహముండదు. ఉండబోదు. ఉండదు.

—0₀0—

# విక్రమశిల

ప్రాచీన భారతదేశమునందు ప్రజాస్వామిక ప్రభుత్వములుగాని, రాజ ప్రభుత్వములుగాని విద్యావిషయములందు మిక్కిలి జాగరూకత వహించినవి. ఎక్కువ ధనమును వ్యయపరచి విశ్వవిద్యాలయములను స్థాపించిరి. అందు వివిధకళలు, ప్రాచీన సంస్కృతివిద్యలు బోధింపబడుచుండెడివి. ఈ విద్యాలయములం దుద్దండులైన పండితులాచార్యులై యుండెడివారు. ఇందాచార్యులకు విద్యార్థుల కవినాభావ సంబంధ ముండెడిది. అందుచేత విద్యార్థు లాయా విశ్వవిద్యాలయములందు చదివి పరిపూర్ణ విద్యావేత్తలయ్యెడివారు. అట్టి విద్యాలయములందు కీర్తికాంచినది విక్రమశిలా విద్యాలయమొకటి. విక్రమశిలా విద్యాలయమును క్రీ॥ శ॥ ౮ వ శతాబ్దము చివర వంగదేశపురాజగు ధర్మపాలుడు స్థాపించినాడు. ఇది బీహారులోనున్నది. కాని కొందరిది భాగల్పూరు జిల్లాలోని సుల్తానుగంజ్ యొద్ద నున్నదనియు మరికొందరు భారగాన్ సమీపమునగల సిలానోయొద్ద నున్నదనియు అందురు. ఇంక విదేశ చారిత్రక పరిశోధకులిచ్చటకువచ్చి మిక్కిలి పరిశోధించి భాగల్పూరు జిల్లాలోని పతాన్‌కొండయొద్దనో లేక నలందాకు సమీపముననో హుల్వాగంజి సమీపమునగల కీవూరు ప్రాంతమున గలదనిరి. గంగానది యొడ్డున నొక కొండమీద నీ విక్రమశిలా విద్యాలయముకలదు. ఇచ్చట

నారు కళాశాలలున్నవి. విద్యాలయభవనంలోనే నూట ఎనిమిదిమంది పండితులకు భోజన నివాసాది వసతులను నేర్పరుపబడినవి. ఈ విద్యాలయాచార్యుల కేకాక, యితరాచార్యులకు యాత్రీకులకు దగిన వసతులేర్పరుపబడినవి. ఇందొక పెద్ద విహారమును నిర్మింపబడినది. దానిచుట్టు నొక బ్రహ్మాండమైన ప్రాకారము నిర్మింపబడినది. ఆ ప్రాకారమధ్యన నొక పెద్ద దేవాలయమును, బౌద్ధ కళావిశిష్టతను, సాంప్రదాయమును విలసిల్లునటుల నిర్మింపబడినది. ఈ దేవాలయము చుట్టును చిన్న చిన్న దేవాలయములుకూడ నిర్మింపబడినవి. ఇవికూడ బౌద్ధకళా విశిష్టతను, బౌద్ధ సంస్కృతిని వెదజల్లుచున్నవి. ఈ విశ్వవిద్యాలయమునకు బుద్ధజ్ఞానపాదుడను పండితుడు ప్రథమాచార్యుడు. ఈయనను నీ విశ్వవిద్యాలయ స్థాపకుడైన ధర్మపాలుండు నియమించెను. ఈ పండితుండు సకల విద్యాపారంగతుండు. అఖలశాస్త్రవేత్త. తపస్సంపన్న పరుండు. అందుచేత నా నాడీ విద్యాలయంబు విదేశ విద్యార్థులనుగూడ నాకర్షించినది. ధర్మపాలుండీ విశ్వవిద్యాలయమును, నలందా విశ్వవిద్యాలయమును పోషించినాడు. ఈ రెంటి పోషణకు నొక సంఘము నేర్పరచెను. ఈ సంఘ సభ్యులే యీ రెంటి కార్యకలాపములను జాగరూకతగా నిర్వహించెడివారు రెండు నన్యోన్యసహకారమున నుండెడివి. వీనియందు క్రమశిక్షణ, విద్యాబోధన నైతికపాలన మున్నగునవి ఎంతో ప్రశంసనీయముగా నుండెడివి.

నలందా విశ్వవిద్యాలయాచార్యులను, విక్రమశిలా విద్యాలయమందును, విక్రమశిలా విద్యాలయాచార్యులను

నలందా విశ్వవిద్యాలయమందును నవసరమునుబట్టి మార్చు చుండెడివారు. విక్రమశిలా విద్యాలయముల భవనముల మీద నాచార్యుల విగ్రహములందు చదివి పండితులయిన వారి విగ్రహములందముగా మలచబడినవి. ఈ విశ్వ విద్యాలయమునకు ననుబంధముగ గావింపబడిన కళాశాలలో నొక్కొక్కదానియందు నూటయెనిమిదిమంది పండితులుండెడివారు. వీరందరు సకల విద్యాపారంగతులు. విజ్ఞాన మూర్తులు. ఈ విక్రమశిలా విద్యాలయమందున మధ్య ప్రదేశమున నారు ద్వారములుగలవు. వీనికడ నాచార్యులే ద్వారరక్షకులుగకూడ పనిచేసెడివారు. విద్యార్థులను సమయము తప్పక లోనికిరానిచ్చెడివారు. ఇందు ప్రధాన సింహ ద్వారముకడ దక్షిణపక్కన నాగార్జునుని చిత్రమును వామ దిక్కున నసితుని చిత్రమును లిఖింపబడినవి. వీనికి నాచార్య వర్యులు, విద్యార్థులు ముందు పూజించెడివారు. ఇందు చదివి యుత్తీర్ణులైనవారికి పండితయను బిరుదమే మహారాజుచే నొసగబడును. ఆకాలమున నది గొప్ప బిరుదు. దీనిని బొందుటకెంతయో కష్టించి చదివినగాని లాభములేదు. ఇట్టి మహోన్నతమైన బిరుదును బొందినవారిలో నరేంద్రకు చెందిన ఆచార్య జెతారి, కాశ్మీరమునకు చెందిన రత్నవజ్రుడతిముఖ్యులు. వీరివిద్యాలయమున నేడేండ్లు విద్యనభ్యసించిరి. వీరు మిక్కిలి పట్టుదలతోను, ఎక్కువ శ్రద్ధతోను చదివి యీ బిరుదును సంపాదించిరి. ఆ కాలంబున వీరికి నెనతేని గౌరవము లభించినది. క్రీ॥ శ॥ పదునొకండవ శతాబ్దమునందు చణకుండను రాజు పరిపాలించెను. ఆ రాజుకూడ నీ విశ్వవిద్యాల

యంబును మిక్కిలి గౌరవించెను. ఈ రాజేంద్రుని కాలములో నీ విశ్వవిద్యాలయములందు నారుగురు ప్రసిద్ధ పండితులను నిందలి యారుద్వారములకు రక్షకులుగ నియమింపబడిరి. వారు ఆచార్య రత్నాకరశాంతి కాశ్మీరుకు చెందిన వాగీశ్వర కీర్తి నరోపుండును, ప్రజ్ఞాకరమతి, రత్నవ్రజుడు గాధ దేశమునకు చెందిన జ్ఞానశ్రీముఖులనువారు. వీరు అఖిల శాస్త్రవేత్తలు. ఈ విశ్వవిద్యాలయాధ్యక్షపీఠమున అలంకరించిన ప్రథమాచార్యుడు బుద్ధజ్ఞానపాదుని తరువాత నధ్యక్షపీఠమును వహించినవారు ౹క్రీ॥ శ॥ ౹౹వ శతాబ్దమునకుచెందిన శ్రీ జ్ఞాన అసితుండు మిక్కిలి కీర్తిగనినవాడు. ఆనాటి ఆచార్యపీఠము నందరిలోని శిరోరత్నమణి పేరెన్నికగన్నవాడు. ఈయన కాలమున స్థవీరరత్నాకర పండితుండు బౌద్ధామర శాఖాధ్యక్షుడుగ నుండెను. ఈ విశ్వవిద్యాలయాచార్య పండితుడు విదేశములకుపోయి గొప్పగ సన్మానింపబడెను.

ఇందు పనిచేయు నాచార్యులెల్లరుద్దండ పండితులు. అందుచేత విదేశములందలి ప్రజలు, పండితులు, వీరి జ్ఞాన బోధకు ముగ్ధులైరి. అందుచే జనులు వీరిని దైవసమానులుగ భావించి పూజించెడివారు.

విక్రమశిలా విశ్వవిద్యాలయాచార్యు లతిపుణ్యమూర్తు లని బౌద్ధభిక్షువులలో నత్యుత్తములని ప్రస్తుతించిరి. వీరు గావించిన సేవ సాటిలేనిదని మిక్కిలి ప్రేమతో నెక్కువగా గౌరవించిరి. టిబెట్టు దేశమున నా కాలమున బౌద్ధమతంబున ననేక భేదాభిప్రాయములు కలవు. అందుచేత వానినన్నిటిని

పర్చ్యపరచి యేకాభిప్రాయముగ నొనరించుట ఆ దేశపురాజు కర్తవ్యమని తలంచెను. అటుల గావించుటకు అసితుండు మిక్కిలి సమర్థుడని యా నరపాలుడు భావించెను. వెంటనే యాతడు నాగ్తోషులోత్స్వా అను బౌద్ధసన్యాసిని విక్రమశిల విద్యాలయమునకు పండితుని కొనిరమ్మని టిబెట్టు పాలకుండు పంపెను ఆ కాలమున విక్రమశిలా విశ్వవిద్యాలయమునందు బౌద్ధమత పీఠమునకు స్థవీర రత్నాకరుండు అధ్యక్షుడుగా నుండెను. నాగతోషుండు విక్రమశిలకువచ్చి, రత్నాకరుని సందర్శించి టిబెట్టు పాలకు నాహ్వాన మంద చేసెను. ఆ సమయమున బౌద్ధ మహాసభ విక్రమశిలయందు జరుగుచుండెను. ఆ సభయందు 8 వేల బౌద్ధభిక్షుకులు పాల్గొనుచుండిరి. అందు నాగతోషుండుకూడ పాల్గొనెను. ఆ సభకు విద్యాకోకిలుండను మహావిన్యావేత్త అధ్యక్షుండుగా నుండెను. అమ్మహాసభకు అమ్మహారాజుకూడ చనుదెంచెను. వీరవ్రజుండను నొక బౌద్ధ సన్యాసికూడ సభకు వచ్చెను. అంత నచ్చటకు రాగానే బౌద్ధ భిక్షుకులందఱు అతనికి లేచి నిలువబడిరి. దీపంకర శ్రీ అజ్ఞాన అసితుండు సమావేశము ముగియువేళకు వచ్చెను. సమావేశము చాల గొప్పగజరిగెను. టిబెట్టు సన్యాసియైన నాగ్తోషులోత్స్వా క్రీ॥ శ॥ 1035-1038 వరకు విక్రమశిల బౌద్ధమతమందుండెను. శ్రీ జ్ఞాన అసితునితోపాటు నక్కడ నుంటున్న వీరసింహుడనే యతండుకూడ గొప్ప పండితుండు. అసితుండు టిబెట్టుదేశంబునకు బోవుట కెంతయో ప్రోత్సహించెను. టిబెట్టుపాలకుండు పంపిన ఆహ్వానంబును ఆభరణంబులను, అమూల్య

వస్తువులను నాగతోషుండు స్వయంబుగ నసితునకు నంద జేసెను. పిదప నసితుండు టిబెట్టు దేశంబునకు పోయెను. అచ్చట నసితుని మూడువందలమందిగల యాత్రికదళముతో నూరేగింపుతో టిబెట్టునకు గొంపోయిరి. అచ్చట నతడు ఆదేశంబునగల బౌద్ధమత భేదాభిప్రాయంబులన్నిటిని తొలగించి యుత్తమ బౌద్ధ ధర్మసూత్రంబులను సమున్వయ పరచెను. అది లామానిజర అను నూతన మతమునకు నాంది యయినది. అసితుండు మహారాజు కోరికపై నెన్నియో సంస్కృత గ్రంథములను టిబెట్టుభాషలోని కనువదించెను. అమ్మహారాజు అజితు డనువదించిన గ్రంథము లెన్నియో యభివృద్ధికి ప్రచారంబులోనికి తెచ్చెను. విక్రమశిలా విద్యాలయ ప్రథమాధ్యక్షుండగు బుద్ధ జ్ఞానపాదుండు రచించిన సంస్కృత మంత్రశాస్త్ర గ్రంథము లిప్పటికీ టిబెట్టు భాషలో కలవు. అమ్మహాపండితుని తరవాత ఆ గ్రంథములన్నియు విశ్వవిద్యాలయములందు బోధింపబడుచుండెను. ఇదికాక యీ విశ్వవిద్యాలయమున వ్యాకరణ వేదాంత తర్క-ధర్మశాస్త్రంబులు బోధింపబడుచుండెడివి. పద్మసంభవుడను పండితుడే విశ్వవిద్యాలయంబున నుండెడివాడు. అతడుకూడ టిబెట్టుదేశము నందుండెను. ఆయన శిష్యుండు విరోచనుండు విక్రమశిలలో నివశించి బౌద్ధమతంబును ప్రచారము గావించెను. అతడు మిక్కిలి పండితుడగుటచే సంస్కృత, అనేక బౌద్ధగ్రంథములు మంత్రతంత్ర గ్రంథములు రచించెను. వీనిలో నేటికి కొన్ని టిబెట్టుబాషలో అనువదింపబడి మిక్కిలి ప్రచారమందున్నవట — అటుపిమ్మట విరోచనుండుకూడ

టిబెట్టు దేశమునకు పోయెను. ఈ విశ్వవిద్యాలయమందుగల ఆచార్య జతారికూడ మహాపండితుడు. ఇతడు బ్రాహ్మణ వంశమునకు చెందినవాడు. చణకుని పరిపాలనాకాలమునందు ప్రసిద్ధిచెందిన పండితులలో నగ్రగణ్యుండు. ద్వారరక్షకుండు రత్నాకరశాంతికి ఆచార్యుడితడు.

విక్రమశిల విద్యాలయములందు అనేక పండితాగ్రగణ్యులిప్పటికి చిరస్మరణీయులుగానున్నారు. వారు కమలకులిశుండు. నరేంద్రశ్రీజ్ఞాన దానరక్షితుడు, అభయంకరగుప్తుడు- శుభంకరగుప్తుడు- సనయశ్రీధర్మాకరశాంతి, శాక్యశ్రీపండితుడు, నలందా, తక్షశిల, వల్లభి విశ్వవిద్యాలయంబులు మిక్కిలి ప్రఖ్యాతి గాంచినవి. క్రీ॥శ 1176సంవత్సరమునందు తురుష్కులీ విశ్వవిద్యాలయముపైబడి ధ్వంసము గావించిరి. ఎందరినో బౌద్ధభిక్షుకులను కూల్చిరి. బౌద్ధమతగ్రంధములు లభించినవి దహించిరి. క్రీ॥ శ॥ 1203 సంవత్సరమున భక్తియారు ఖిల్జీ అను మహమ్మదీయుండు సశేష శిధిలములనుగూడ పూర్తిగా నాశనమును గావించినాడు-

ఆ కాలమున కాశ్మీరమునకు శాక్యశ్రీ పండితుడధ్యక్షుడుగా నుండెను. మహమ్మదీయులా పండితునిగూడ దయాదాక్షిణ్యములులేక బాధించిరి. అతడెటులో తప్పించుకొని కొందరు బౌద్ధసన్యాసులను వెంటబెట్టుకొని టిబెట్టు దేశమునకుపోయెను. ఈ విక్రమశిలా విశ్వవిద్యాలయము దాందాపు 400 ల సంవత్సరములు ఖండఖండాంతరముల అఖండకీర్తిని పొందినది. విదేశవేత్తలనుగూడ నాకర్షించిన భారత

దేశ విశ్వవిద్యాలయములన్నిటిలో నసమానకీర్తిని పొందినది. ఈ దుష్కరకీర్తిగనిన యీ విద్యాలయము ముష్కర తురుష్కులవలన క్రీ॥ శ॥ 1203 సంవత్సరమున పూర్తిగా విధ్వంసమైనది. ఒకనాడు తన పండితులను విదేశములకంపి వివిధ ఖ్యాతినిపొందిన ఆ విద్యాపీఠము - ఒకనాడు వివిధ ధర్మవేత్తలనుగలిగి వివిధదేశాల యశమునుబొందిన ఆ విద్యాపీఠము, ఒకనాడు తన పండితులచే వివిధ గ్రంథములను వ్రాయించి వివిధ దేశములందున విఖ్యాతినొందిన ఆ విద్యాపీఠము - కాలగర్భమున కలిసిపోయినది - ఆ విశ్వవిద్యాలయ ప్రణాళికలు - ఆ విశ్వవిద్యాలయ పండితశ్రేష్ఠులు-ఆ విద్యావేత్త మహత్తర గ్రంథరాజములు మున్ముందు తిరిగి వెలయగలవని ప్రాచీన భారతసంస్కృతి మరల పునరుద్ధరింపబడగలదని, తిరిగి విదేశములందు మన వైభవ విఖ్యాతి అశిల్లగలదని ఆశింతుము.

# ప్రతిష్ఠాన నగరము

ప్రాచీన భారతదేశము నందెన్నియో పట్టణము లెన్నెన్నో కళలకు మరెన్నెన్నో వైభవములకు స్థానములై యుండెడివి. వానిలోఁ బ్రతిష్ఠానపురమొకటి. ఈ నగరము ఔరంగాబాదుకు షుమారిరువదిమైళ్ళ దూరమునగలదు ఇది పవిత్ర గోదావరినదియొడ్డున విశాలమైన నగరముగానున్నది. ఈ పట్టణము క్రీ॥ శ॥ 150 సంవత్సరమున నిర్మింపబడినటుల తెలియుచున్నది. ఇప్పుడు దీనిని పైఠాన్ అని పిలువబడు చున్నది. అది ఆనాటి రేవుపట్టణములన్నిటికన్న ముఖ్యమై యున్నదని గ్రీకు యాత్రికుడు భారతదేశమునకువచ్చి దీనిని చూచి పెరిప్లస్ ఆఫ్ ఇరిత్రియవస్ అను గ్రంథమునఁ బేర్కొని నాడు. ఆ శతాబ్దమునందు సోపారా, కల్యాణ మున్నగు రేవు పట్టణములున్నట్లుకూడ తెలిపినాడు.

క్రీ॥ శ॥ 200 వ సంవత్సరమున ఆంధ్ర శాతవాహనులు ప్రతిష్ఠానపురమును దమకు ముఖ్యపట్టణముగ నొనరించుకొని పరిపాలించిరి. టాలిమీాయను విదేశ యాత్రికుడు భూగోళ మను గ్రంథమును రచించెను అందు గౌతమీపుత్ర శాతి కర్ణి కుమారుడగు వాసిష్ఠపుత్రి పులమావి ప్రతిష్ఠానపురమును రాజధానిగఁ జేసికొని పరిపాలించినాడని తెలియుచున్నది. ఆనాడు ప్రతిష్ఠానపురము మహావైభవమున మహాకీర్తిని విరాజిల్లి సర్వకళలకు కాణాచియైనదని యతడు వర్ణించెను.

మగధసామ్రాజ్యమును పరిపాలించిన మౌర్యవంశజులలో చివరి వాడు బృహద్రధుడు. మంత్రి పుష్యమిత్రుడు. క్రీ॥ పూ॥ 185 వ సంవత్సరమున బృహద్రధుని చంపి సింహాసన మాక్రమించి పరిపాలించెను. అతని వంశమే సుంగమవంశము. ఆ సుంగమ వంశరాజు దాదాపు 112 సంవత్సరములు పరిపాలించెను. ఈ వంశమునఁ గడపటివాడు దేవభూతి. ఇతని మంత్రి వసుదేవుడు ఇతఁడు దేవభూతిని వధించి పరిపాలింపదొడఁగెను. ఇతని వంశమే కాణ్వాయవంశము. ఈ వంశజులు పరిపాలించిన పిదప వీరిలోఁ జివరివాఁడగు సుశర్మను ఆంధ్ర చక్రవర్తియైన శ్రీముఖ శాతవాహనుడోడించి, మగధను స్వాధీనమొనరించుకొనెను. నాటినుండి మగధ ఆంధ్ర సామ్రాజ్యమున కలిసిపోయెను. శాతవాహనవంశము శాలివాహన వంశమైయున్నది. ఈ వంశమునకు మూల పురుషుడు శాలివాహనుడు – ఇది ప్రాకృత భాషానామము. శాతకర్ణి యనునది బిరుదము. శతకర్ణి యనగా నూరు చెవులు కలవాడని యర్థము. ఈ రాజులు రాజ్యవ్యవహారములను నూరు చెవులతో నాలింపుచు, రాజ్యమతి శక్తివంతముగా పరిపాలించెడివారు.

శాలివాహను డొక బ్రాహ్మణపు తికకు జన్మించినవాఁడు ఆమె తన యన్నలతోఁ గాలవశమునఁ బ్రతిష్ఠాన నగరమునకువచ్చి యొక కుమ్మరివాని యింట నివసింపదొడగినది ఒక దినమున నామె గోదావరికి స్నానార్థమైపోయెను. ఆ తరుణమున నాగరాజు విహారార్థమై యచ్చటకు వచ్చెను.

ఆమెనుచూచి యతడు మోహించి తన కోరికను వెల్లడించెను. ఆ కన్య యతనిచూచి భయపడి సమ్మతించెను. అతడామెను కూడి యనుగ్రహించెను. ఆ బ్రాహ్మణ బాలికకు కాలక్రమమున కుమారుడు జన్మించెను. అతడే శాలివాహనుడు. ఇతడు కుమ్మరివాని గృహముననే పెరిగి విద్యాభ్యాసనాదులను గావించి సాటిలేని మేటివీరుడయ్యెను.

ఉజ్జయినిని పరిపాలించు విక్రమార్కుడు తన కొక బ్రాహ్మణకన్యకు పుట్టిన వానివలన మరణము రానున్నదని యాస్థానదైవజ్ఞులవలన నెఱిగి యట్టివాడెందున్నాడో తెలిసికొని రమ్మని భేతాళునంపెను. ఆ భేతాళు డన్ని పట్టణములందు తిరిగి, చివరకు ప్రతిష్ఠానపురి మందుండినట్లు తెలిసికొనెను. అత డా విషయమును రాజున కెఱిగించెను పిమ్మట శాలివాహనుని, అప్రకపరాక్రమ శోభితుండైన విక్రమార్కుం డెదుర్కొనెను. విక్రమార్కుండాతని ధాటికాగలేక యోడి మరణించెను. పిమ్మట శాలివాహనుఁడు రాజ్యమును స్వాధీనమును జేసికొని పరిపాలింప దొడంగెను. గుణాఢ్యుండను ప్రతిభాశాలి యితనికి మంత్రియైయుండెను. ఈ గుణాఢ్యుడు బృహత్కథను పైశాచీబాషలో రచించెను. ఒకానొక యక్షుడొక శాపమున కారణభూతియను పేరుగల పిశాచియై యరణ్యమందు దిరుగజొచ్చెను. ఒకనాడు శాలివాహనుని మంత్రి గుణాఢ్యుఁ డడవికిపోయెను ఆ పిశాచి, యిమ్మంత్రి యతి సమర్థుడని బృహత్కథను నతనికిఁజెప్పెను ఆ గుణాఢ్యుడు బృహత్కథను తన రక్తముతో లిఖించెను. అంతట

నా యక్షునకు శాపము తీరినది. అమ్మహాకావ్యమును నమ్మహామంత్రిశేఖరు డమ్మహారాజున కర్పింపుచు, దాని వృత్తాంతమంతయు నెరిగించెను. శాలివాహను డా గ్రంథము రక్తముచే లిఖింపబడినదని యెరింగి, దానిని స్వీకరించుటకు సమ్మతించక పోవుటచే నతడు కొన్ని భాగంబులను దహింప జేసెను. కొంతకాలంబు గడిచినపిదప నా సశేషభాగంబు లందలి విశేషంబుల నెఱిగి యా గ్రంథమును కావలెనని కోరెను. అప్పుడు మిగిలిన భాగములను గుణాఢ్యుడు రాజున కందజేసెను ఆ బృహత్కథను సోమదేవుఁడను మహాకవి కథాసరిత్సాగమను పేరుతో సంస్కృతమున రచించెను. ఇందు శాతవాహనునిగూర్చి చిత్రములైన కథలున్నవి పూర్వము దీపకర్ణుండను నృపుండు గలండు అతండు సంతాన హీనుండై యుండెను. ఆ కారణంబుచే నతండు దుఃఖస్వాంతుడై యుండెను. ఒకనాడు కలలో శివు డా నృపాలునికి గన పడి మహారాజా విచారపడకుము, నీవు రేపు వేటకై యర ణ్యమునకుఁబొమ్ము. అచ్చట నొక బాలుడు సింహమునెక్కి తిరుగుచు నీకు కనబడును. వానినిదెచ్చి పెంచుకొనుము. అతండే నీ కుమారుడు. అతనివలన నీవు నీ వంశము మిక్కిలి ఖ్యాతిచెందగలదని చెప్పెను. మరునాడు దీపకర్ణుం డరణ్యము నకు శివుడు చెప్పినటులపోయెను. అత డటునిటు తిరుగు చుండగ, నొకచోట నొక బాలుడు సింహముపై నెక్కి తిరుగు చుండెను. అప్పుడు దీపకర్ణ తన బాణంబు సింహముపై సంధించెను. అది బాణము తగిలిన వెంటనే, నిజరూపమును బూని యక్షుఁడై "రాజా కలతనొందకుము. ఈ బాలుని

గైకొనిపొమ్ము. ఇతఁడు మిక్కిలి బలశాలియై ఎక్కువ విఖ్యాతి నందగలఁడ''ని మాయమయ్యెను. అతడే శాలివాహనుడు

క్రీ॥ పూ. 73వ సంవత్సర ప్రాంతమున మాత్రము ప్రతిష్ఠానపురము అత్యంత శోభాయమానముగ విరాజిల్లినది. ఆ శతాబ్దమున శ్రీముఖ శాతవాహనుఁడు సామ్రాజ్యమును నేకచ్ఛత్రాధిపత్యముగ పరిపాలించినాడు. ఇతడు మహావీరుడు. ఆంధ్రవీరుల అఖండ ప్రచండశౌర్యమును దిఙ్మండలమున సాటిలేని మేటికీర్తితో చాటినవాడు. ఇతడు సుమారు 23 సంవత్సరములు పరిపాలించెను. పిదప నీ నృపాలుని తరువాత కృష్ణశాతవాహనుడు సింహాసన మధిష్ఠించెను. ఈతని పరిపాలనలో ప్రజలు మిక్కిలి సుఖములను నెనలేని వైభవములనుపొందిరి. విదేశయాత్రికులీతని కాలమున పురవైభవమును నిటుల వర్ణించిరి. ఎటుజూచిన ఆకాశమునంటు మేడలతి మనోహరముగనున్నవి. అందమైన వీధులుగలవు. రాజభవనము శత్రువులకు జాడరాకుండును. కృష్ణశాతవాహనుని తరువాత శ్రీ శాతకర్ణుడు పరిపాలించెను. ఈయన కాలమునందుకూడ ఆంధ్రసామ్రాజ్య మతి శోభాయమానముగ నుండెను. ఈయన తరువాత శాతవాహనులలో గౌతమీపుత్ర శాతకర్ణి చెప్పదగిన గొప్పరాజు. యవనులను శకులను పారదోలి ఆంధ్రసామ్రాజ్యమును విస్తరింపచేసెను. తరువాత ఇతని కుమారుడు వసిష్ఠపుత్ర శ్రీపులమావి. ఆంధ్రసామ్రాజ్యమును పరిపాలించెను. ఈ భూపాలుని కాలము

నందు ఉత్తరకెనరాలోని వైజయంతీ పట్టణము, దక్షిణాన గుంటూరు మండలములోని అమరావతీ మిక్కిలి వైభవమున విరాజిల్లినది ఆ కాలములో ప్రతిష్ఠానపురము, నాసికనగరము మిక్కిలి యభివృద్ధితోను, నెక్కువ విఖ్యాతితోను విరాజిల్లినవి. ఆంధ్రశాతవాహనుల కాలమున ప్రతిష్ఠాననగరము గొప్ప వ్యాపార కేంద్రముగా, కళాకేంద్రముగా ప్రకాశిల్లినది. విదేశ వ్యాపారస్థులకు యాత్రీకులకుమిక్కిలి నెలవైయా నాటిసుందర పట్టణములలో నెక్కువ పిఖ్యాతిగాంచినది. మహాభక్తుడైన జ్ఞానేశ్వరమహనీయుడు ప్రతిష్ఠానపుర బ్రాహ్మణులకడనుండి తన శుద్ధిపాత్రను స్వీకరించెను. ప్రఖ్యాత ధర్మశాస్త్ర గ్రంథమును రచించిన హేమాద్రి ప్రతిష్ఠానపురమున జన్మించి రాజాదరణమును మిక్కిలి గనినవాడు. చతుర్వేద చింతామణి యను గొప్ప ధర్మశాస్త్రమును రచించిన హేమాద్రి యిందు మంత్రిగానుండి పరిపాలించినాడు. హరినీల ముక్తఫాలయను దివ్యభాగవత గ్రంథములను రచించిన బోపదేవుడీ ప్రతిష్ఠానపురమున జన్మించి విఖ్యాతినందెనవాడు. మహారాష్ట్ర భక్తుడైన ఏకనాథుండిందు నివశించి తరించెను. ఈ మహాభక్తుడు క్రీ॥ శ॥ 14 వ శతాబ్దమున నున్నవాడు. జగద్గురువు, జనార్దనస్వామి యీ ప్రతిష్ఠాన పురమునందున్న మహనీయుడు. ఈ మహనీయునికడ ఏకనాథుండు జ్ఞానేశ్వరి అమృతానుభవంబులగల గ్రంథములను పఠించినాడు. ఏకనాథుడు మహాభక్తుడై విఠలమంత్రోపదేశమును పొందెను. భక్తాగ్రగణ్యుండు తన భక్తి ప్రభావంబున శ్రీకృష్ణ సాక్షా

త్కారంబును పొందెను. ఈ మహానీయుఁడు మహాత్ముని కృప వలన చతుశ్శ్లోక భాగవతమును రచించెను. క్రీ॥ శ॥ 1506 సంవత్సరమున మహాభక్తుండైన ఏకనాథుండు జ్ఞానేశ్వరీ గ్రంథమును రచించెను. ఈ మహానీయుండే క్రీ॥ శ॥ 1599 సంవత్సరమున ప్రతిష్ఠానపురమున పరమపదించెను. ఆ మహాభక్తకోటికి విచారదినమున్నది. అఖిలవైభవంబున విభ్రాజిల్లిన ప్రతిష్ఠానపురమున నెందరో మహాభక్తులు, మహాకవులు, మహాజ్ఞానవేత్తలు, మహా ధర్మపరులు, జన్మించి నివశించి ఆ పురమునకు మిక్కిలి కీర్తినికూర్చిరి. అందులో మహా పండితులైన నారాయణ రామేశ్వరుడు, నారాయణభట్టు గొప్పగా జెప్పఁదగినవారు. నారాయణభట్టు ఎన్నో గ్రంథములను రచించి కీర్తిగాంచిన పండితుడు. మిక్కిలి ప్రఖ్యాతి గాంచినవాడు. ఇమ్మహాత్ముండీ ప్రతిష్ఠానపురమున విశ్వేశ్వరాలయమును నిర్మించినాఁడు. ఇది యిప్పటికిని చెక్కుచెదరక యున్నది. ఇమ్మహాత్ముని మనమడగు దినకరుడు కమలాకరుడనువార లభ్యుదయ పండితులు. ధర్మశాస్త్ర గ్రంథములను రచించిరి. వీరికీర్తి యెంతయో ప్రశంసింపఁదగినది. వీరందరిందు నివశించినవారే. వీరి వంశమునందెందరెందరో పండితులు జన్మించి, అనేక మహాగ్రంథములను రచించి మహాకీర్తిని పొందిరి. గంగాభట్టు అను మహా విద్వాంసుఁడీ వంశమున జన్మించినవాఁడు. ఈ మహాత్ముఁడు మహారాష్ట్ర స్థాపకుడైన శివాజీ పట్టాభిషేకమును గావించినవాఁడు. ప్రతిష్ఠాన నగర మాంధ్రరాజుల కాలములో రాజధానిగనుండి మహా

వైభవములను మహాకీర్తినిపొందిన నగరరాజము. విదేశ వ్యాపారకేంద్రముగకూడిన సాంద్రకీర్తిని బొందినది. అనవద్యమైన విద్యాకేంద్రముగ, సుద్యత్కీర్తిని బొందినదీ పట్టణరాజము. ఆనాటి పురవైభవంబునకు చిహ్నముగ నేటికిని నా వైభవచిహ్నములు నామమాత్రావశిష్టముగ నున్నవి. ఇప్పటికి నానాటికి దేవాలయములలో కొన్ని చెక్కుచెదరక యున్నవి.



# కనోజి

భారతదేశమునందు చారిత్రకముగ పౌరాణికముగ ప్రసిద్ధిగాంచిన పట్టణములెన్నియో యున్నవి. అంగ ప్రాచీన వైభవములు పురాతన నిర్మాణము లానాటి నామములు నేటికిని శిథిలావస్థయందున మారుపేరున వెలసిల్లుచున్న పట్టణము లెన్నియో కలవు. వానిలో కనోజి యొకటి. ఇది ఉత్తరప్రదేశ్ లోని ఫరూకాబాద్ జిల్లాలో కాళిందీ నది యొడ్డున గలదు. ఈ పట్టణమునకు తూర్పుదిక్కున గంగానది షుమారు 2 మైళ్ళ దూరమున ప్రవహించు చుండును. పూర్వము దీనికి కన్యాకుబ్జమని పేరుండెడిది. ఇది త్రేతా ద్వాపరయుగములందు మిక్కిలి పేరుగాంచినది. పురాణ గ్రంథములైన భారత రామాయణములందు దీనినిగూర్చి ప్రశంసనీయముగ దెలుపబడినది దీనినిబట్టి యిది మిక్కిలి ప్రాచీన నగరమైనదని నిస్సందేహముగ తెలుపబడినది. బ్రహ్మర్షి విశ్వామిత్రమహర్షి జనకుండగు గాధిరాజు కన్యాకుబ్జమును రాజధానిగ పెట్టుకొని పరిపాలించెను. బ్రహ్మర్షి విశ్వామిత్రుడీ పట్టణమున జన్మించెను. అమ్మహాఋషి కూడ నిమ్మహానగరమును పరిపాలించెను. బౌద్ధమతయుగము నందుకూడ దక్షిణ పాంచాల రాజధానికిగూడ ముఖ్యపట్టణముగా నుండెడిది. బ్రహ్మపుత్రుండు కుశరాజు, విదర్భ రాజ పుత్రికను పెండ్లియాడెను.

అతడు నలుగురు పుత్రులను గనెను. వారు కుశాంబుడు కుశనాధుండు, అధూర్తరజనుండు, వసువులనెడివారు. ఈ నలుగురు తండ్రి కుశనాధుని నాజ్ఞను నాలుగు రాజ్యములను నేర్పరచుకొనిరి. కుశాంబుడు కౌశాంబి పట్టణమును, కుశనాధుండు మహోదయ పట్టణమును, అధూర్తరజనుడు ధర్మారణ్యమును, వసురాజు గిరివ్రజమును రాజధానిగఁ జేసికొని పరిపాలించిరి. ఈ కనోజికి మహోదయంబను నామంబున్నట్లు తెలియుచున్నది. ఈ విధముగ వాల్మీకి కృత రామాయణమున వ్రాయబడినది. అభివాద చింతామణియందు నీ కన్యకుబ్జము, మహోదయము, గాధిపురము, అను నామాంతరములు గలిగియున్నదని పేర్కొనబడినది. ఈ కన్యాకుబ్జనగరమునకు దగ్గరగా అశ్వతీర్థముకలదు. ఇది యతి ప్రాచీనమైనది. ఈ కన్యకుబ్జము పురాధిపతి కుశరాజుయొద్దకు రుచికుండను మహాముని వచ్చెను.

ఆ మహామునికి ఆ మహారాజు స్వాగతగౌరవముల నొసగి ఆదరించెను. అప్పుడా మహాముని నామహీపతినిగాంచి 'మహారాజా! నీ విచ్చిన సత్కారములకు నా మనం బానంద పడుచున్నది. ఏ నొక కోరికను నీకడకు వచ్చితిని. నీ సుతను నాకు సతిగా జేసికొనుటకు గోరి చనుదెంచితిని. కాన నా యభిమతమును నంగీకరింతువని యూహింతును.' అనెను. అందులకు కుశరాజు "మహర్షిసత్తమా! నీవంటి మునిపుంగవుడు నా సుతను గోరి యడుగుట కుంటివానిపై భాగీరథి ప్రవహించుట యట్లగును. కాని నే నొక విన్నపమొనరించెదను.

శరీరమెల్ల తెలుపునుండునటులు, చెవులుమాత్రము నలుపుగల గుఱ్ఱములను వేయి నాకు ప్రసాదించినచో తను కోరిక తీర్ప గలను" అనెను. అందులకు మహాముని సమ్మతించి, యట దాపునగల గంగానదియొద్దున వరుణదేవునిగూర్చి తపమొన రింపబూనెను. వరుణదేవుఁ డా మహాముని తపమునకు మెచ్చి యట్లనుగ్రహించెను. అంతట మహాముని యీ మహారాజు నకు వేయి గుఱ్ఱములను నొసంగెను. అంతట గాధిరాజు ముని మహిమను గొనియాడి, తన సుతను నా మునికినిచ్చి మహా వైభవముగ పెండ్లిచేసెను. వరుణదేవునిచే సహస్రాశ్వముల పొందిన ప్రదేశమగుటచే దీనికి నశ్వతీర్థమని పేరుగలిగెను. ప్రసిద్ధ మహాగ్రంథమైన దేవీభాగవతమున దేశమందంతట 108 శక్తిపీఠములు గలవనికలదు. వానిలో 11 వ శక్తిపీఠ మీ కన్యాకుబ్జమందున్నదని పేర్కొనబడినది. ఈ శక్తి పేరు గౌరి ఈ యమ్మవారికి అప్పుడు బ్రహ్మాండమైన దేవాలయ ముండెడిది. ప్రతినిత్యము జనులు తండోపతండములుగావచ్చి అమ్మవారిని దర్శించి పూజించి పోయెడివారు.

గంగా యమునల మధ్య ప్రదేశమునకు మధ్యప్రదేశ మని పేరుండెడిది. ఈ దేశమతి పురాతన భారతీయ సంస్కృ తికి మూలకందముగా నుండెడిది. ఆ దేశమును ద్వాపర యుగ మున యాదవరాజులు పరిపాలించెడివారు. బలశాలియైన జరా సంధుడు వారినెల్లర పాఱద్రోలి దానిని తన రాజ్యంబున కలుపుకొనెను. క్రీ॥ శ॥ 405 వ సంవత్సరమున ప్రసిద్ధ చీనా యాత్రికుఁడు భారతదేశమును సందర్శింపుచు నిచ్చోటికి

వచ్చెను. ఆ కాలమున నీ పట్టణము మహావైభవోపేతము గను భారత ప్రాచీన సంస్కృతికి మూలకందముగను నుండెడి దనియు, నిందొక మహాయాన మఠము, ఒక మనోజ్ఞకళాఖండ మైన స్థూపము కలదనియు చెప్పెను. 7 వ శతాబ్దమున చీనా యాత్రికుడగు హుయాన్‌సాంగు కనోజిని సందర్శించెను. ఆ నాడీ పట్టణము, మహావైభవముగను, మహా శోభాయ మానముగను, సకల విద్యలకు, లలితకళలకు కేంద్రముగా నున్నదని వర్ణించినాడు. క్రీ॥ శ॥ 6 వ శతాబ్దమున గుప్త సామ్రాజ్యము వెలుగొందుచున్నప్పు డీ కనోజీ మౌఖరీలకు రాజధానిగానుండెను. ఈశ్వరవర్మ, సర్వవర్మ, సుస్థితవర్మ మున్నగు మౌఖరీలు గుప్తరాజుల నెదురించిపోరిరి. మౌఖరీ లలో చివరివాఁడగు గృహవర్మ హర్షచక్రవర్తి సోదరియగు రాజ్యశ్రీని పెండ్లాడినాఁడు. మాళవరాజు కనోజిపాలకుడైన గృహవర్మను యుద్ధమున నోడించి చంపి యతని భార్యయగు రాజ్యశ్రీని చెఱఁబట్టెను. స్థానేశ్వరమును పరిపాలించు ప్రభా కరవర్ధనునకు నిరువురు కుమారు లొక కుమార్తె కలరు. పెద్ద కుమారుఁడు రాజ్యవర్ధనుఁడు, రెండవవాడు హర్షుడు కుమార్తె రాజ్యశ్రీ.

రాజ్యవర్ధనుఁడు మాళవరాజుపై దండెత్తి యుద్ధంబం దతనిని జయించి, వంగరాజగు శశాంకు నోడించి తన చెల్లె లిని చెఱనుండి విడిపించెను. వంగరాజు మోసము నీతనిని వధించెను. క్రీ॥ శ॥ 606 లో హర్షుడు స్థానేశ్వరంబును జయించి తన స్వాధీనమును జేసికొనెను. పిదప వింధ్యారణ్యా

మునఁ ప్రాణత్యాగమును గావింపనున్న తన చెల్లెలైన రాజ్యశ్రీని గాపాడెను. ఆమె కోరికపై స్థానేశ్వర కనోజ్ రాజ్యముల రెంటిని బరిపాలింపఁబూనెను. హర్షుఁడు తన రాజధానిని స్థానేశ్వరమునుండి కనూజికి మార్చెను. హర్షుని కాలంబున కనూజి మిక్కిలి యభివృద్ధిచెందెను. హర్షుడు హిందూదేశము నేలిన చక్రవర్తులలో గొప్పవాఁడైన అశోకుని తరవాత చెప్పుకొనదగినవాఁడు. ఈ చక్రవర్తి మహావిద్వాంసుఁడు. మహాకవి. అందుచేత నతఁడు సంస్కృతమున నాగానంద ప్రియదర్శిక రత్నావళియను నాటకములను రచించెను. అనేక కవిపండితులను పోషించెను. శ్రీహర్షుఁడు బౌద్ధమతాభిమానియైనను అన్ని మతములను నాదరించెను. ప్రాచీన భారతీయ సంస్కృతిని చక్కఁగా పోషించెను. ధర్మాత్ముఁడై ప్రజలను గన్నబిడ్డలబోలె పరిపాలించెను. ధైర్యసాహసములందు సముద్రగుప్తుఁడు మున్నగు చక్రవర్తులఁ బోలియుండెను. ఉత్తర భారతదేశమంతయు నేకచ్ఛత్రాధిపత్యముగ పరిపాలించిన మహాచక్రవర్తి. పటిష్ఠవంతమైన పరిపాలనలోను, అవక్రపరాక్రమములోను, న్యాయనిర్వహణములోను, మరుపురాని మహాచక్రవర్తియయి మిక్కిలి కీర్తిఁగాంచెను.

బౌద్ధమతమందలి భేదాభిప్రాయములను దొలఁగించుటకు శ్రీహర్ష చక్రవర్తి క్రీ॥ శ॥ 643 సంవత్సరమున నిచ్చట నొక బౌద్ధమతమహాసభ గావించెను. ఆ మహాసభకు చీనాయాత్రికుడగు హుయాన్‌సాంగుకూడ వచ్చెను. ఇతఁడు శ్రీహర్షునికి అతిథిగా క్రీ॥ శ॥ 638 నుండి 643 వ సంవత్సరము

వరకు కనూజిలోనేయుండెను. కన్యాకుబ్జమందలి యొక విశాలమైదానమున నొక సభామండపము నిర్మింపబడినది. దానికి ముందున నొక గోపురమును నందముగా నిర్మించిరి. అందు బుద్ధదేవుని శిలావిగ్రహమును నిల్పిరి. ఆ సభామంటపమున సుందరమైన యాసనము నేర్పరచిరి. శ్రీహర్షుడు దన మంత్రి సామంతులతోను హుయాన్‌సాంగు మున్నగు విదేశ యాత్రీకులతో గొప్ప ఊరేగింపుతో నా సభాభవనమునకు విచ్చేసెను. ఒక శుభసమయమున సభాప్రారంభమయ్యెను. హర్షచక్రవర్తి బుద్ధభగవానుని విగ్రహమునకు వింజామరమును వీచెను. కుమారస్వాముడు ఛత్రమునుబట్టెను. ప్రసిద్ధ చీనా యాత్రీకుడగు హుయాన్‌సాంగు అధ్యక్షపీఠ మలంకరించెను. ఆ మహాసభదిగ్విజయముగ జరిగెను. మహాయాన మతధర్మములన్నియు నందు నంగీకరింపబడినవి.

శ్రీహర్షుని పరిపాలనాకాలమున కన్యాకుబ్జ నగరము రెండవ స్వర్గమువలెనుండెను. ఆ నగరము రెండు క్రోసులు పొడవు, ఒక క్రోసు వెడల్పుగలిగి మిక్కిలి విశాలమైయుండెడిది. దీనికొక దిక్కున గంగానది మరొకదిక్కున భయంకరమైన యగడ్త గలిగియున్నది. ఈ పట్టణములో మిక్కిలి యెత్తైన భవనములున్నవి ఇంకను నెన్నియో సరస్సులున్నవి. అందు తెల్లని హంసలు తిరుగుచు మిక్కిలి కాంతిని గలిగి యుండెడివి. సామాన్యపౌరులు, ధనవంతులు విహరించుటకు దగిన ఉద్యానవనములున్నవి. వానిలో వివిధ వృక్షములు, కూర్చుండుటకు దగిన అందమైన తిన్నెలు గలిగియుండెడివి.

అందు నూరు బౌద్ధవిహారములు 200ల హిందూ దేవాలయములు కలవు. అవి ప్రాచీన శిల్పకళకు, అద్భుత చిత్రలేఖనకు ప్రతిబింబములుగా నుండెడివి. ఈ నగరమున అన్ని జాతులవారు నివసించెడివారు. సామాన్యముగ నొక్కొక్క వీధియందు నొక్కొక్క కులమువారు నివసించెడివారు ప్రతి వీధియు పరిశుభ్రముగా నుండెడిది. ఇందు 30 వేల తమలపాకు అంగళ్లుండెడివి. అందమైన నర్తకురాండ్రు, రాళ్లుగరగించు సంగీతగాయకుల కుటుంబములు 60 వేలు ఉండెడివి. శ్రీహర్షుని కాలమున నీ నగరము విద్యాకేంద్రమై యుండెడిది. మహా పండితులకిది యాలవాలముగ నుండెడిది. శ్రీహర్షుని ఆస్థానమున మహాఖ్యాతిగన్న మహాకవులు భాణుడు, మయూరకవి, భర్తృహరి, ధావళకుడు, చంద్రోదితుడను మున్నగువారు ఉండెడివారు. బాణకవి హర్షచరిత్రను, కాదంబరియను గద్యకావ్యమును రచించెను. ఈ మహాకావ్యము లా మహారాజు కాలమునాటికి మహా వైభవమును, ప్రశంసను చాటుచున్నది. మయూరకవి సూర్యశతకము, ఆర్యాముక్తమాల, మయూరాష్టకము అను గ్రంథములను రచించి మహా కీర్తిగాంచిన మహాకవి. సుభాషిత త్రిశతి అను గ్రంథమును భర్తృహరి రచించెను. హర్షచక్రవర్తి కాలమున తక్షశిల, కాశి, నలందా, ఉజ్జయినీ మున్నగు విశ్వవిఖ్యాతినందిన విద్యాపీఠములెన్నో యభివృద్ధి చెందినవి. ఈ విద్యాపీఠములను శ్రీహర్షుడెంతయో ఆదరించెను.

శ్రీహర్షుని కాలము స్వర్ణయుగమని పేరొందదగును. ప్రజలుసుఖజీవనమున విరాజిల్లిరి. ధర్మము, నీతిమార్గమునందు

ఉద్యోగులు నిర్విరంతరము వర్తించిరి. ఆనాటి కన్యాకుబ్జము పరిపాలించినవారు వర్మరాజులు 7 వ శతాబ్దము చివర యశోవర్మ కానూజీని పరిపాలించెను మహాపండితకవి భవభూతి వాక్పతి మున్నగువారు యశోవర్మని కాలమునందు కీర్తి గాంచిరి. షుమారు క్రీ॥ శ॥ 500 సంవత్సరమునుండి 800 ల వరకు వర్మరాజులను తుదకు ఘూర్జర పతిహారపాలకుండు నాగభట్టు జయించి యీ నగరమును స్వాధీనమును జేసికొనెను.

ఈ నగరమును పరిపాలించిన చక్రవర్తులలో జయచంద్రుడు చివరివాడు. ఆ చక్రవర్తి సుతయగు రాణీ సంయుక్తను పృధ్వీరాజు చెఱబట్టెను. జయచంద్రుడు క్రీ॥ శ॥ 94 సంవత్సరమున మృతిచెందెను. షహాబుద్దీన్ కనోజి పట్టణమును సర్వనాశనము గావించినాడు. క్రీ॥ శ॥ 1540 వ సంవత్సరమున మొగల్‌పాదుషా హుమాయూన్ షెర్షా కన్యాకుబ్జమును నోడించి ఢిల్లీ సింహాసనమధిష్ఠించెను. నాటితో కనోజి ప్రాముఖ్యత కాలగర్భములో కలిసిపోయెను.

ఒకనాడు మహావైభవముగను, మహావిద్యాకేంద్రముగను, సమస్తకళల కాలవాలముగను, నిత్యకళ్యాణ పచ్చతోరణముగను, భారతీయ ప్రాచీన సంస్కృతికి ప్రతిబింబముగను విలసిల్లి ఖండఖండాంతరముల నఖండకీర్తిని సంపాదించిన కనోజి కన్యాకుబ్జము మహమ్మదీయ దండయాత్ర మూలకముగ సర్వనాశనమై శిథిలమైయున్నది



వేమన పంచాయతీ
తెలప్రోలు గ్రంథాలయం.
కృష్ణా

# వైశాలి ::

భారతదేశమందు నైతిహాసికముగ, చారిత్ర్యకముగ మిక్కిలి కీర్తిగాంచిన నగరములలో వైశాలియొకటి. ప్రస్తుత బీహారు రాష్ట్రములోని ముజఫర్ జిల్లాలో బసారయను నామమున నున్న దా నాటి వైశాలి. అనాభోగదిష్టుడను నతడిప్పటి బసారాప్రాంతమున దన వంశమును స్థాపించినాడు. అతని వంశీయులలో నొకండగు కందము డా ప్రాంతమును పరిపాలించెను. అతని పుత్రుడు వీక్షిత్తు. పరాక్రమశాలియై యుండెను. విశాలరాజు కుమార్తె స్వయంవరమునకుపోయి, యట విరోధులచే బంధింపబడెను. అపుడు కందముడదివిని తన సేనతోపోయి, వారినెదుర్కొని యోడించి తన కుమారుని విడిపించెను. ఆ వీక్షితుని పుత్రుడు మరుత్తుడు. ఇతడెన్నో యాగములనుచేసి షోడశచక్రవర్తులలో నొకడుగా కీర్తిచెందెను. మరుత్తుని వంశమునందు తృణబిందు వనునతడు జన్మించెను. ఇతని పుత్రుడే విశాలుండు. ఈ విశాలునిగూర్చి కవికులగురువు కాళిదాస మహాకవి తన రఘువంశమునందు గొప్పగా జెప్పినాడు. ఈ విశాలుండే విశాలనగరమును నిర్మించి దానిని తన రాజధాని నగరముగ జేసికొని పరిపాలించెను. అదే వైశాలి నగరముగ కీర్తికాంచినది ఈ వైశాలి త్రేతాయుగమునందు నిర్మింపబడినట్లు తెలియచున్నది. వాల్మీకి రామాయణమునందుకూడ నీ వైశాలి)

గూర్చి తెలుపబడినది. జైనమతస్థాపకుండగు మహావీర వర్ధమానుండే వైశాలి నగరమున జన్మించెను. బౌద్ధమత స్థాపకుడైన బుద్ధభగవానుడీ పట్టణమునకు పలుమారులరుదెంచినాడు. ఇది విచ్ఛలీ రాజ్యమునకు రాజధానిగకూడ కీర్తిగాంచినది. ఇది రాజగృహమునకు 30 మైళ్ళ దూరమున నుండెడిది. ఈ నగరమునకు ఉత్తరదిశన మహాజనమను నరణ్యాటిక యుండెడిది. ఇది హిమవత్పర్వత ప్రాంతము వరకు వ్యాపించియుండెడిది. ఈ యరణ్యమునందు బుద్ధభగవానుడనేక సంవత్సరములు నివసించెను. ఇమ్మహానీయుని కాలములో నీ పట్టణము మిక్కిలి వైభవంబున విరాజిల్లినది. ప్రజలందరు భోగభాగ్యములతో తులతూగిరి. కరువు కాటకములు లేక ప్రజలు సుభిక్షముగనుండిరి. దీని కిరుప్రక్కల నానుకొని రెండు నగరములుండెడివి.

అవి కుందనపురము, ఫణిగ్రామమని యందురు. వైశాలి పట్టణములో బ్రాహ్మణులు నివసించెడివారు. కుందనపురమున క్షత్రియులుండెడివారు. ఫణిగ్రామమునందు వైశ్యులు నివాసమొనరించుకొనిరి. ఈ పట్టణమున కొలది దూరమున నెత్తైన ప్రాకారము నిర్మింపబడియుండెడిది. దీనికి ద్వారములు, బురుజులు సుందరముగ కట్టబడినవి. 16800 ల మంది ప్రజలు నివసించెడివారు. గౌతమబుద్ధ భగవానుడిచ్చటకు వచ్చినప్పుడు నగరవాసులతి భక్తిగౌరవముగ బ్రహ్మాండముగ స్వాగతమిడిరి. అందెన్నియో సుందరమైన కట్టడములు, శిల్పకళ, చిత్రకళావిశిష్టతను దెలుపు చైత్యములుండెడివి.

ఈ నగరమున 7 వేల 7 వందల యేడుగురు రాజులు నివసించెడివారు. వారికి అపురూప సౌధంబులుండెడివి. వైశాలిలో మిక్కిలి కీర్తిగాంచిన ఆమ్రపాలియను నొక సుందరవతి వేశ్య యుండెడిది. ఆనాటి వేశ్యలలో మిక్కిలి యపురూప సౌందర్యముగలది. ఆమె నివసించు భవనము రాజభవనముతో సమానముగ నుండెడిది. ఆ భవనప్రాంగణమునందు పైన పూలచెట్లెన్నియో యుండెడివి. ఆ భవనమునకు దగ్గరగా నొక మామిడితోపున్నది. ఆ మామిడితోపును ఆమెయే స్వయముగ నాటించినది. అందెన్నియో ఫలములు కాయుచుండెడివి. గౌతమబుద్ధుడప్పురమునకు వచ్చినప్పుడు ఆమెయే స్వయముగ నా మామిడితోపును దానముగా నొసగెను. ఆ మహానీయుడా మామిడితోపును బౌద్ధభిక్షుకుల యుపయోగార్థము వినియోగింపబడునటుల చేసెను. వైశాలిలో నిలిచ్ఛవులకు చేతకుండను నతడు నాయకుడుగనుండెడినాడు. ఆతనికి పిక్కురు కుమార్తెలు కలరు. వారిలో చెల్లన అనునామె మగధాధిపుడైన బింబిసారుడు వివాహమాడెను. బింబిసారుని వలన నామెకు కుణికుడు, హల్లుడు, విహల్లుడు అనువారలు జన్మించిరి బిందుసారుని తరవాత కుణికుడు రాజ్యమేలెను. బిందుసారుని వలన హల్లునకు, విహల్లునకు 18 పేరులుగల యొక ముత్యాలహారము శయనాగంబను నొక గజము సంక్రమించెను. కుణికు డా గజమును సోదరులకడనుండి పరిగ్రహింపదలచెను. అతడు తన కోరికను వారికడ వెల్లడించెను. వారలు దానిని అన్నకు ఇచ్చుటకు ఇష్టములేక దానినెక్కి పారిపోయి మాతామహుండైన చేతకుని నొద్దకుపోయి చేరు

కొనిరి. అప్పుడు కణుడు తన గజమును తెచ్చి ఈయమని చేతకునికే వార్తనంపెను. చేతనుండిందులకు అంగీకరింపలేదు. అకారణమున విచ్ఛలీ నాయకులకు అజాతశత్రువు అగు కణికునకు వైశాలిలో గొప్ప యుద్ధము జరిగెను. అజాత శత్రువు కుణికుడు వారినోడింపజాలకపోయెను. అతడెక్లైన నా గజమును మోసమున సంహరింపదలచెను. అప్పుడా యుద్ధభూమిలో నొకచోట కందకమును త్రవ్వించి, యందు కణకణలాడు నిప్పులను పోయించెను. హల్లుడు, విహల్లు డీ మోసమును నరయజాలక మామూలుగ నా కరిపైన నధిరోహించి యుద్ధభూమికి వచ్చిరి. అప్పుడా గజ మా కందకమున బడి కాలి మృతిజెందెను. కాని వీరుమాత్రము బ్రతికిరి. వారా యేనుగు మృతిజెందగనే వైరాగ్యమునుచెంది, సన్యశించి మహావీరు శిష్యులైరి. చేతనుడుకూడ నిరాహారముల వీడి ప్రాణత్యాగమొనరించుకొనెను. ఈ నగరమందలి విచ్ఛవులకు కణికునకు రత్నాలగని విషయములో భేదాభిప్రాయము వచ్చి యుభయులు ఘోరయుద్ధమును వొనరించిరి. లిచ్ఛవీ రాజులలో రాజులు, ఉపరాజులు, సేనాపతులు భాండాగారాధిపతులుండెడివారు. రాజులు 7707 మంది ఉండెడివారు. పరిపాలకులు ప్రజాక్షేమమును చూచెడివారు. ఈ రాజులితర రాజులకడకు రాయబారులను పంపెడివారు. ఈ లిచ్ఛవీ రాజులితరరాజులతో స్నేహబాంధవ్యమును నెఱపెడివారు.

గౌతమబుద్ధ భగవానుని కాలములో నీ రాజ్యము మిక్కిలి బలిష్ఠముగా నుండెడిది. వీరు తమ నాయకులను

ప్రాచీనసంస్థలను నెంతగానో గౌరవించెడివారు. స్త్రీలయందు వీరికి అపరిమితమైన గౌరవముండెడిది. ఇట్లుండుటచే మగధ నాయకుండగు అజాతశత్రువు వీరిని జయింపజాలకపోయెను. లిచ్ఛవీ నాయకుండగు సచేతకుండు జైనమతస్థాపకుండగు వర్ధమానమహావీరునకు మేనమామ. ఈ వర్ధమాన వీరుడు క్రీ॥ పూ॥ 540 సంవత్సరమున వైశాలికి సమీపమందు జన్మించెను. ఇతడు కొల్లంగి గ్రామమున వర్ధమాన మహావీరుడు దన ముప్పదవ సంవత్సరముననే విరాగియై సన్యాసులలో కలిసిపోయెను. కాని వారి బోధనలు నచ్చక యరణ్యములకు పోయెను. తన 42 వ సంవత్సరమున జ్ఞానోదయముగలిగ, జైన మతమును విదేహ, మగధ, పాటలీపుత్రము మున్నగు విదేశములందు ప్రచారమును గావించెను. రాజగృహముల సమీపమున చివరకితడు మరణించెను. వైశాలి నగరమున గౌతమ బుద్ధుడు బౌద్ధసంఘమును సమావేశపరచెను. ఆ మహావీరుడు నిర్యాణముపొందిన యొక శతాబ్దానంతరము 2 వ బౌద్ధసంఘ సమావేశము వైశాలిలోనే జరిగినది. ఆ సభకు ధరయ శుంకను ప్రసిద్ధబౌద్ధభిక్షుకుం డధ్యక్షతను వహించెను.

అందు 700 ల బౌద్ధసన్యాసులు పాల్గొనిరి. వైశాలి నాయకరాజు చేతకుండు ప్రాణత్యాగమును గావించిన పిదప నా రాజ్యము మారసామ్రాజ్యములో కలిసిపోయినది. అశోక చక్రవర్తి యందొక మహాస్థూపమును ఒక ధ్వజస్తంభమును నిర్మించినాడు. క్రీ॥ శ॥ 120 వ సంవత్సరమున బుద్ధదేవుని భిక్షాపాత్రను గాంధార దేశమునకు గొంపోయెను. ఈ వైశాలి

నగరము మిక్కిలి విస్తారమైన వెడల్పుగల అందమైన పట్ట ణము. ఆనాటి క్షుద్రకనగాళివ, అంబష్ఠ, హస్తినాయన, ప్రాకణ్యముద్ర, మధుమంతి, అప్రీతవాసతిభగ్గ మున్నగు పట్ట ణములందు మిక్కిలి భోగభాగ్యములుపొందిన నగరరాజము. మౌర్యసామ్రాజ్య స్థాపకుడగు చంద్రగుప్తుడు లిచ్ఛవిరాజ కుమారిని వివాహమాడెను. ఆ వివాహవైభవమెంతయో చెప్పుటకు అసాధ్యము. నాడీ పట్టణము నైతికముగ ధర్మ వంతముగ విఖ్యాతిచెందినది.

ఇతిహాసముగ చారిత్రకముగ గడుకీర్తిగాంచి మహా వీర గౌతమబుద్ధుల పాదధూళివలన పవిత్రవంతమైన దీ నగ రము. అట్టి యీ వైశాలి నేడు నామమాత్రావసిష్టమై నాటి ప్రాచీన సంస్కృతికి ధర్మనీతులకు చిహ్నమైయున్నది.



# శత్రుంజయ

ప్రాచీన భారతదేశమందు సుందరమైన పట్టణములు, పవిత్ర యాత్రాస్థలములు లెక్కకుమీరి నేడు నామరూపాలు అవశిష్టమై ప్రాచీన సంస్కృతికి చిహ్నములై యున్నవి. వానిలో శత్రుంజయ మొకటి. ఇది సౌరాష్ట్రములో భావనగర మొద్ద గల సిహోరుకు 8 మైళ్ళ దూరమునయున్నది. పలిటానాకు సుమారు 1½ మైళ్ళ దూరమున జైనులకు పవిత్రమైన శత్రుంజయ పర్వతమొకటి కలదు. ఒకప్పుడీ ప్రదేశమందు శత్రుంజయమను గ్రామముండెడిది. శత్రుంజయ పర్వతము సముద్ర మట్టమునకు సుమారు 1977 అడుగుల ఎత్తునయున్నది. జైనులకు పవిత్ర యాత్రాస్థలములైన శత్రుంజయ, గిర్నారు, ఆబూ, అష్టపాదశిఖరములు గలవు. ఇందు శత్రుంజయ మిక్కిలి కీర్తిగాంచినది. ఇది సూరత్ పట్టణమునుండి వాయువ్య దిశన 70 మైళ్ళ దూరమునయున్నది తీర్థంకరులలో మొదటి వాడైన ఋషభదేవుడిం గా వసించినాడు. శత్రుంజయ పర్వతము రెండు పంక్తులుగా చీలియున్నది. ఈ రెండు పర్వత పంక్తులనడుమ నొక పెద్ద లోయగలదు. ఈ దేవాలయము లలో అదినాధ కుమారపాల, విమలాసహ సంప్రాతిరాజ మున్నగు దేవాలయములు ముఖ్యములైనవి. ఈ పర్వతము ప్రక్కన నీ యాలయములుదప్ప మరొకటి గనపడదు. ఈ పర్వతమంతయు స్వచ్ఛముగా స్ఫటికమువలె దళతళ

మెఱయుచుండును. ఇందెల్లస్థలము పరిశుభ్రము గావించినట్లుండును. ఎక్కడ శబ్దము వినబడక ప్రశాంతముగానుండును. ఈ యాలయములోను, నిందలి గవాక్షములలోను పద్మాసనాసీనులైన తీర్థంకుల విగ్రహము లతిగంభీరముగా నుండును. ఇట్టి విగ్రహములెన్నియో లెక్కకుమీరి యున్నవి. ప్రతి యాత్రీకునిని చూచినచో నాధ్యాత్మికశక్తి పెంపొందించుకొనగలండు. ప్రపంచమునందిట్టి దేవాలయములెందు మరెచ్చటలేవు. ఇది యత్యంత పుణ్యస్థలమని భావించుటచే ప్రజలెవ్వరు ఈ ప్రాంతమున నివసించరు. ఇచ్చట నగ్నిచే వంటజేయుట మహాపాపమని తలంతురు. అందుచేత యాత్రీకులు తమవెంట పండ్లు ఫలములు గొనితెచ్చుకొని స్వామి దర్శనానంతరము వానిని దిని పోవుచుందురు

భువనేశ్వర్, కాశీ మున్నగు పుణ్యక్షేత్రములందు భక్తులా యాలయముల ప్రక్కన నివశించుటకు చక్కని యవకాశము లున్నవి శత్రుంజయ జైనుల పుణ్యక్షేత్రమైనప్పటికి నిచ్చటకుపోవు రాజమార్గములలో రాజమతాలయము. హనుమానాలయము, ముసల్మానుపీరుల సమాధులున్నవి ఈ పత్వాతమును అశోక చక్రవర్తి మనమడు సంప్రాతి రాజు క్రీ॥ శ॥ 1618 లో నిర్మించినటుల తెలియుచున్నది. ఈ శత్రుంజయ ప్రాంతము జైనువాస్తు శిల్పకళలోని సౌందర్యము, చిత్రచిత్రములు పోతపోసినటుల గనబడును. ఇందు కొన్ని యాలయములు క్రీ॥ శ॥ 14–15 శతాబ్దములందు నిర్మింపబడినవి. నాటినుండి నేటివరకు జైనభక్తులు పునరిన్మా

కార్యక్రమమును చేయింపుచునే యున్నారు. నీవిటనుండి శత్రుంజయ పోవుటకు అందమైన బాటకలదు. బాట కిరు వైపుల చెట్లు నాటబడినవి. శత్రుంజయ పర్వత మధిరో హించుటకు చక్కని మెట్లు కలవు. ప్రథమ సోపానమందొక యేనుగు విగ్రహము ప్రబహ్మాండముగా నుండును. కొండ నెక్కినప్పుడు కొన్ని చోట్ల నిట్రముగానుండును. పర్వతము పైకిజేరుటకు 2 దారులుగలవు.

ఆ పర్వతపంక్తులు రెండుగాచీలి యొక్కొక్క పర్వత పంక్తి సుమారు 375 గజముల పొడవున వ్యాపించియున్నది. ఈ పర్వతపంక్తుల మధ్యన చిన్నచిన్న కోనలున్నవి. ఈ ప్రదే శముచుట్టు బలమైన ప్రాకారములుగలవు నానికి ద్వారము లేర్పాటుచేయబడి యున్నవి. సాయంసమయము కాగానే యీ ద్వారములన్నియు మూయబడియుండును. జైనతీర్థంకరు లలో ప్రథముండగు ఆదినాధుండే కొండమీద తీవ్రతపము గావించెను నాగార్జునాచార్యుండు దనగురువగు పాదలిప్తుని జ్ఞాపకార్థము పలిటానా నగరము నిర్మించినాడు జైనమతస్థులు కొన్ని రాజకీయ విప్లవకారణముగ రాజపుత్రస్థానమునకు సౌరాష్ట్రమునకు తరలివచ్చిరి. అప్పుడీ శత్రుంజయక్షేత్రము నిర్మింపబడినది. ఇందు ముఖ్యమైన దేవాలయము కఱ్ఱతో నిర్మింపబడుటయు తరువాత రాతితో నిర్మింపబడుటయు జరిగి నది. జయసింహ చక్రవర్తి ఆచార్యహేమచంద్రుడు, కుమార భూపాలుడు మున్నగు రాజులు జైనమంత్రులు, శత్రుంజయ పర్వతము ప్రక్కన దేవాలయములు, గోపురములు నిర్మించిరి.

కాంతకోటలోని జగదూష, తెలంగాణాలోని సమరషా మున్నగుధనవంతులగు వర్తకులెందరో యీ శత్రుంజయులోని యాలయములను బాగుచేయుటలో చాల ధనమును వెచ్చించిరి.

హిందూదేశ మందలి జైనభక్తులందరీ యాలయమును పునరుద్ధరించుటకొరకు కోట్లాధికముగ విరాళములిచ్చిరి. ఈ శత్రుంజయ పర్వతమును నెక్కుచుండ ననేక సుందర జలాశయములు, కుమారపాలకుండం మున్నగునవి యెన్నో కనబడును. అనేక ప్రదేశములందు తీర్థంకరుల పాదచిహ్నములు గలవని చెప్పుదురు. క్రీ॥ శ॥ 1618 వ సంవత్సరమున సోమ్జీ అను నతండు భుకండదాసు కొండయొద్ద ధీశ్వర భగవాన్ ఆలయమును నిర్మించినాడు. ఇది చాల గొప్ప దేవాలయము. ఇది 60 అడుగుల పొడవు. 60 అడుగుల వెడల్పు గలిగి చదరముగనున్న రెండు భాగములుగ విభజింపబడినది. 12 స్తంభములమీద గుమ్మటమువలెనుండు చక్కని గోపురకలశమును గట్టినాడు. గర్భగుడిలో 2 అడుగుల యెత్తుగల పాలరాతి సింహాసనమున్నది. దీనిపైగల శిల్పము, చిత్రలేఖన మతి చిత్రవిచిత్రముగ నత్యద్భుతముగ విరాజిల్లుచున్నది.

ఇందొక సింహము అలరారుచున్నది. దానిపై పద్మాసనమును వేసికొని యోగముద్రను ధరించిన ఆదినాధస్వామి విగ్రహములు నాలుగు దిక్కులందు నందముగా నమర్చబడి

నవి. ఇందు జైన దేవాలయములు గోపురములు, శిఖర ములు తోరణద్వారములెంతో ప్రశంసనీయముగా నున్నవి. ఆనాటి కళావిశిష్టతను, సంస్కృతిని సౌందర్యమును/ వెదజల్లు చున్నవి. ఆదీశ్వరాలయమునకు ముందొక యాలయము కలదు. దీనిని హేమాంబాయి నిర్మించెను. మోతీషాలోయలో పదునారు దేవాలయములు గలవు. వీనిని బాలాబాయి నిర్మించెను. ఇందు పద్మాసనాసీనుడైన అధీశ్వరభగవానుని విగ్రహము 18 అడుగుల యెత్తున బ్రహ్మాండ గంభీరముగ కనబడు చున్నది. ఈ శత్రుంజయ పర్వతముమీద 100 దేవాలయములు పెద్దవి, దాదాపు 700 వందల చిన్నవికలవు. 1100 వేల విగ్రహములు, సుమారు 9(0 పాదుకలున్నవి. ఈ శత్రుంజయకు సిద్ధాచలమని, ఉపసాంబుగిరియని .0( పేరులున్నట్లు తెలియుచున్నవి.

ఇచ్చట కార్తీకచైత్ర పూర్ణిమిలలో బ్రహ్మాండమైన ఉత్సవము జరుగును. జైనులు ఇందు వచ్చినచో నిరాహారముగ నుండి దేవాలయము ప్రదక్షిణమును గాంతురు. ఇందన్ని దేవాలయములలో చౌముండి దేవాలయము చాల గొప్పది. దాదాపు 20 మైళ్ళ దూరమునుండి చూచిన గనబడును. ఇంత ప్రశాంతమైన ప్రదేశము-ఇట్టి కళావిశిష్టత గల దేవాలయ స్థలము, భారతదేశమందేకాక మరెచ్చట లేదని చెప్పబడుచున్నది. శ్రీ మహావిష్ణువు నెనిమిదవ యవతారమైన ఋషభదేవు డీ శత్రుంజయ పర్వతముమీదనే

తపమును గావించినాడు. పదునాలుగవ మనువునకు కురుదేవి యందు ఋషభదేవుడు జన్మించినాడు. ఇమ్మహానీయుడు ఇంద్రుని దయచేత నూరుగురు పుత్రులను పొందినాడు. పిదప సన్యాసి మతప్రవక్త యయ్యెను.

# రాజగృహము

పౌరాణికముగ నైతిహాసికముగ కీర్తిగాంచిన పురములలో రాజగృహమొకటి. ఈ పట్టణము ద్వాపరయుగమున మహాభారత కథాకాలమున మిక్కిలి విఖ్యాతిగన్నది. ఇప్పుడు ఇది రాజగిరి రాజఘర్ అను నామములతో బిలువబడుచున్నది. ఇది పాట్నాజిల్లా భక్తియార్‌పూర్ రైల్వేలైను మీదనున్నది. ఈ నగరము మహాభారత కథాకాలమున మగధరాజగు జరాసంధుని రాజధానినగరము. అప్పుడు గిరివ్రజమని పేరుతో నుండెడిది. జరాసంధుడు బృహద్రధుని కుమారుడు. బృహద్రధుని కిరువురు పుత్రులు. కాని యిద్దరకు పుత్రసంతానము లేకపోయినది. అప్పుడతడు చండకౌశికుండను మహర్షి కడకు పోయి నమస్కరించి, తనకు పుత్రులు గలుగునటుల ననుగ్రహింపమని కోరెను. అంతట నా మునిపుంగవుడు రాజును గరుణించి యొక మామిడిపండును మంత్రించి 'రాజా! యీ దివ్యఫలమును నీ పత్ని కొసంగిన సుతుడు జన్మింపగలడు. నీ కోరిక నెరవేరగలదు' అని వీడ్కొల్పెను.

బృహద్రధు డింటికివచ్చి యీ ఫలమును సమానముగ చేసి యిరువుర కొసంగి భుజింపమనికోరెను. వారద్దానినిగొని తినిరి. తత్ఫలితముగా కాలక్రమమున వారిరువు రొక్కొక్కరి కొక్కొక్క కన్ను, ఒక్కొక్క పాదము, అర్ధశిరము అర్ధభాగములను ప్రసవించిరి. ఆ వికారరూపములనుగాంచి మహా

రాణులు భయపడి వానిని మహారాజునకు చూపుటకు సమ్మ తింపక వానిని దాసీలచే వీధిలో బడవేయించిరి. ఆ సమయము నందు జరయను రక్కసి యాహారార్థమై తిరుగుచు నచ్చటికి వచ్చి యా శిశుభాగములను నెత్తుకొనిపోయెను. కాని యబ్బాగము లొకచో దగ్గరకుచేరియుండుటవలన ఆ భాగము లతికి, మామూలు బాలుడయ్యెను. ఆ బాలుడు మిక్కిలి బలశాలియగుటచే నెక్కువ బరువుకలవాడయ్యెను. ఆ రక్కసి ఆ బాలుని మోయజాలక పోవుచుండెను. అప్పుడా బాలుడే డవదొడంగెను. రాజభటులది విని రాజునకెఱిగించిరి. అంత నా రక్కసి భయపడి సామాన్య స్త్రీవేషముదాల్చి ఆ బాలుని గొనిపోయి రాజునకప్పగించి ఆ వృత్తాంతమంతయు దెలిపెను. బృహద్రథుడు మదమంది రాణులను పిలిపించి ఆ వృత్తాంత మంతయు దెలిపి ఆ బాలునొసంగెను. అంతట నా బృహద్ర థుడు రక్కసికి ఆహారమునకు కొరతలేకుండ చేసి సత్కరించి వీడ్కొల్పెను.

పిమ్మట బృహద్రథుండా బాలుడు జరయను రక్కసి చేత సంధింపబడిన వాడగుటచే జరాసంధుడని నామమిడి ముదమునంది మహోత్సవములను గావించెను. జరాసంధుడు పెరిగి పెద్దవాడై మహాబలశాలియై సమస్తరాజులను గెలిచి చక్రవర్తియయ్యెను. అతడు గిరిధ్రజంబను రాజగృహమును రాజధానిగ చేసికొని ఆనాటి రాజులలో నమిత పరాక్రమ వంతుడని జరాసంధుడు పేరుగాంచెను. జరాసంధునకు అస్తి, ప్రాస్తి అను నిరువురు పుత్రికలుగలరు. వారిని మధురా నగ

రాధిపతి కంసున కొసంగి వివాహమొనరించెను. దురాత్ముడైన కంసుని శ్రీకృష్ణుడు సంహరించెను. జరాసంధుడది విని శ్రీకృష్ణునిపై దండెత్తి ప్రథమముననోడి, తన పురమునకు పారిపోయెను. ఇట్లు జరాసంధుడు 17 సారులు శ్రీకృష్ణునిపై దండెత్తి యోడిపోయెను. తుదకు శ్రీకృష్ణ భగవానుడు మధురానగరమును వదలి సౌరాష్ట్రములోని రైవతక పర్వత సమీపమున ద్వారకా పట్టణమును నిర్మించి, యాదవులతో నచటనుండజొచ్చెను. మహాబలశాలి జరాసంధు డనేక రాజులను జయించి వారిని కారాగారబద్ధులను గావించెను. అనేక స్త్రీలనుదెచ్చి చెరయందుంచెను వాని దుష్కృత్యముల కంతులేకుండెను. వానిని వధించుటకు శ్రీకృష్ణుడు భీముని దోడ్కొని బ్రాహ్మణ రూపములతో కోటలోనికి ప్రవేశించెను. జరాసంధుడు వీరిని బ్రాహ్మణులని తలంచి మిక్కిలి సత్కరించెను. శ్రీకృష్ణు డాతనిని యుద్ధమునకు రమ్మని యాహ్వానించెను. జరాసంధుడు వారి నిజస్వరూపములను దెలిసి భీమునితో కయ్యమునకు పూనెను. భీమ జరాసంధులకు భయంకరముగ సమరము జరిగెను. తుదకు శ్రీకృష్ణుని ఆదేశమున భీముడు జరాసంధుని పట్టుకొని చీల్చి చంపెను. అటుపిమ్మట కారాగారబద్ధులైన రాజులను స్త్రీలను విడిపించెను. శరణాగతుడైన ఆతని కుమారునకు మగధ రాజ్యమును నకు పతిగా జేసెను. లోకంబెల్ల ప్రశాంతినొందెను.

రాజగృహంబుచుట్టును బర్వతంబు లుండుటచే దీనికి గిరివ్రజంబని పేరు గలిగినది. బ్రహ్మపుత్రుండగు వసుమతి

దీనిని బరిపాలించినాడు. అందుచే దీనికి వసుమతియని పిలువబడుచుండెడిది. ఇవ్విషయంబు వాల్మీకి రామాయణంబందున్నది. మగధరాజులు నివసించు భవనం బిందుండుటచే రాజభవనంబనికూడ దీనికి పేరుగలిగినది. అనేక శతాబ్దంబులవరకు, నీ రాజగృహంబే ముఖ్యపట్టణంబుగా మగధ రాజులు పరిపాలించిరి. బృహ్రద్రధుఁడు పరిపాలించినాడు గనుక బృహద్రధపురంబనికూడ గలదు. ఇట దర్భలు విశేషంబుగా నుండుటచే గుశాగ్రపురంబని పేరుకూడ గలిగి యుండెను. ఇది బౌద్ధులకు హిందువులకు పరమ బవిత్ర యాత్రాస్థలంబుగా నుండెడిది. రాజగిరిలో ననేకోష్ణజల కుండంబు లున్నందున హిందువులకది పవిత్ర యాత్రాస్థలంబుగ నుండెడిది. ఈ జలకుండంబులు సరస్వతీనది కిరుప్రక్కల నున్నవి. వైభరగిరిపాదంబులో, గంగా యమున అనంత ఋషి సప్తర్షి వ్యాసమార్కండ బ్రహ్మకశ్యప పేరులతో నేడు కుండంబులున్నవి. సీతాకుండము, సూర్యకుండము, గణేశకుండము, రామకుండము, చంద్రమకుండము, శృంగి ఋషికుండంబను నేడు కుండంబులుగూడ గలవు

బింబిసారుం డీ రాజగృహంబును రాజధానిగా జేసికొని పరిపాలించెను. ఇతండు శిశునాగ వంశంబువాఁడు. గౌతమబుద్ధ భగవానుఁడు బింబిసారుని రాజ్యపాలనలో బౌద్ధ మత ప్రచారంబును గావించినాడు.

అజాతశత్రువు రాజగృహ దుర్గంబును నభివృద్ధి జేసెను. అవంతీ పాలకుండగు చంద్రప్రద్యోతుని దండ

యాత్రలనుండి పట్టణంబును గాపాడెను. ఈ రాజచంద్రుని కాలంబులో నీపట్టణంబు ముప్పదిరెండు సింహద్వారంబులు గలిగియుండెడిది. అరువదినాలుగు చిన్న ద్వారంబులతో నొప్పియుండెడిది. అజాతశత్రువు పాటలీపుత్రమును నిర్మించిన పిదప దీని ప్రాముఖ్యత చాలవరకు తగ్గినది. ఈ పట్టణము బౌద్ధమతంబుతోను, బుద్ధునితోను, సన్నిహితసంబంధంబును గలిగియున్నది. ఇచ్చట మొదట నలరునకుఁ బిమ్మట నుద్రకునకు బుద్ధుఁడు శిష్యుఁడై, వారి బోధనలు రుచింపక గయకడ బోధివృక్షము క్రింద గఠోరతపంబునుఁజేసి జ్ఞాని యయ్యెను. అమ్మహానీయుం డనేక ప్రాంతంబులఁ దిరుగుచు, మగధ రాజధానికి నరుదెంచెను బింబిసారుఁ డమ్మహానీయునికి ఘన స్వాగతంబిచ్చి, తన రాజ్యంబందు బౌద్ధమత ప్రచారంబొన రించుకొనుట కనుమతి నొసంగెను. గౌతమబుద్ధుడు, ఆయన శిష్యులు నివసించుటకు రాజగృహ సమీపంబందుగల వేణు వనంబును దానంబుగా నొసంగెను పిదప బింబిసారుఁడుకూడ బౌద్ధమతంబును స్వీకరించెను. భగవానుఁ డా వేణువనంబందు బహుకాలంబు నివసించెను. గౌతమబుద్ధ భగవానుఁడు రాజ గృహంబున సంచరించిన ప్రదేశంబులిప్పటికి గలవు. అమ్మ హానీయుని జీవితంబందలి ముఖ్యసంఘటనలిందు జరిగినవి. మగధరాజ్యమునం దీ రాజగృహము బౌద్ధమతవ్యాప్తికి, మిక్కిలి తోడ్పడెను.

గౌతమబుద్ధు డొకప్పుడు రాజగృహము పక్కననున్న రత్నగిరి సానువులందుఁ దిరుగజొచ్చెను. అప్పుడు కొందరు

గొల్లలు నడియెండలో మేకలను దోలుకొనుచు బోవుచుండిరి. అందొక మేకపిల్లకుఁగాలికి దెబ్బతగిలి నడువలేక నడువలేక కుంటుచు బోవుచుండెను. దాని బాధజూచి బుద్ధునకు మిక్కిలి జాలిగలిగెను. దయామూర్తియయిన యతండు వారలకడకుఁజేరి వారివలన బింబిసార చక్రవర్తి యొక యజ్ఞంబు చేయుచున్నాఁడనియు, నా యాగంబునకు బలి నిచ్చుటకొరకు గొంపోవబడుచున్నవని యెరింగెను. ఆ దయామయుండైన గౌతమబుద్ధ భగవానుం డా కుంటి మేకపిల్లను తన భుజంబుపై నెక్కించుకొని తానుగూడ నా యజ్ఞవాటి కకు జేరెను. అచ్చట బలికొఱకు బశువులు సిద్ధంబుగా నున్నవి. అప్పుడు బుద్ధుండది చూడఁజాలక, బింబిసారుని సమక్షంబునకుఁ జేరి, జీవహింసకూడదని ప్రబోధించెను. ఆ బోధనలనువినిన రాజు, ప్రజలు మారిపోయిరి. బింబిసారుం డా యాగంబును నాపుచేసెను వెంటనే యతండు బౌద్ధ మతంబును స్వీకరించి, తన రాజ్యంబులో జీవహింస జరుగఁ గూడదని తీవ్రంబుగ శాసించెను.

రాజగృహ సమీపంబందున్న రత్నగిరిమీద గౌతమ బుద్ధుడుండగా, సర్పహతుండయి మరణించిన తన పుత్రునిఁ దోడుకొనివచ్చి, యాయనముందుంచి, బ్రతికించమని యర్థించెను. అందు కాతం డామెకు తల్లీ! నీవు కోరినటులఁజేయ గలను. ముందు నీవీ నగరంబునకుఁబోయి, మృతిఁబొందిన గృహంబునఁగాని, దుఃఖంబులేని గృహంబునగాని యొక

పిడికెడు యవధాన్యంబు గొనిరమ్ము. అటులఁ గొనివచ్చితి వేని నీ కుమారుండు జీవించునటులఁ గావించఁగలను.

అమ్మాటల కా వృద్ధస్త్రీ మిక్కిలి దుఃఖంబుతో నా మృతకళేబరంబును నటనుంచి, వానినిఁ గొని తెచ్చుటకుఁ బురంబున కరిగెను. ఆమె ప్రతి గృహంబున కరిగెను. ప్రతి గృహంబున దండ్రి మృతిజెందియుండుటయో, తల్లి మర ణించియో, పిల్లవాఁడుపోయియో యుండుట తటస్థించినది. ప్రతి గృహంబందెవరో యొకరు మరణించియుండుట, యేదో విధంబైన దుఃఖంబు కలిగియుండుట యా వృద్ధస్త్రీ గాంచి నది. విచారంబులేని గృహంబామెకు గనపడలేదు. ఆమె తిరిగి తిరిగి పాదంబులరిగి, విసిగివేసారిపోయినది. తుట్టతుద కామె రిక్తహస్తంబులతో బుద్ధునిచెంతకు వచ్చి, యవ్విష యంబునెల్ల నమ్మహానీయునకు విన్నవించెను. అప్పు డా భగవానుం డామెనుగాంచి "తల్లీ! విచారపడకుము. పుట్టిన ప్రతి జీవి గిట్టుటతప్పదు. ఇందుకై చింతించుట కేవల మజ్ఞానము. మనమెల్లర మా దశనొందువారమే. ఈ విష యంబు లెరుంగుట కిటులఁ దెమ్మంటిని. కాన గలతనొందక నిర్విచారంబున గృహంబున కరుగుము" అనెను. అప్పలుకుల కప్పడఁతి యప్పరమాత్మకుఁ బ్రణమిల్లి శలవుఁదీసికొని నిజ గృహంబున కరిగెను.

ఒకనాఁడు గౌతమబుద్ధుఁడు రాజగృహంబునందు నొక రైతు గృహంబున విడిదిగావించెను. ఆ రైతు ప్రసంగవశం బున 'అయ్యా మీ రీ విధంబుగ భిక్షంబెత్తుకొను ఖర్మంబే

టికి? హాయిగా నావలె వ్యవసాయం బొనరించుకొనుచు, జీవించరాదా?" యని ప్రశ్నించెను. అందులకు బుద్ధుడు మందస్మితుడై "అయ్యా! మీరు పొరబడుచున్నారు. నే నిపుడు వ్యవసాయం బొనరింపుచునేయున్నాను." అనెను. అందు కతడు "అట్లైన వ్యవసాయంబునకు గావలసిన పరికరంబులేవ"ని యడిగెను. అమ్మాటల కమ్మహాత్ముండు "అయ్యా! నేను దున్నెడిభూమి ధర్మశాస్త్రంబను పొలంబు. నాకు ధర్మంబను హాలంబు. అనిశంబు యత్నంబే నా దుక్కి టెద్దులు. మనంబే యా వృషభంబులను నడుపు ముకుక్కుతాడు. నాకు సత్యమే ములుగఱ్ఱ. సత్కార్యంబే వర్షంబు. అరిషడ్వర్గంబే భూమిలోఁ బొడముకంటకపుమొక్కలు. ఇందువలనఁ బండెడిపంట మోక్షంబు. ఇంతకన్న మించిన వ్యవసాయంబు గలదా" యని ప్రశ్నించెను. ఆ పలుకులువిని, యబ్బురబడి బుద్ధుని పాదంబులకు సాష్టాంగ ప్రణామంబును గావించెను. నాటనుండి బౌద్ధభిక్షువై, సర్వసంగ పరిత్యాగంబును గావించెను.

రాజగృహ నగరమున బౌండవగిరికలదు. దానిపై కృష్ణశిల గుహకలదు. అందు నివశించు బుద్ధుని బింబిసారుండు సందర్శించెను. ఈ నగరమునగల సప్తపర్ణియను గుహాన ప్రథమ బౌద్ధసంఘసభ జరిగెను అజాతశత్రువు బుద్ధుని అస్థికలను సిచ్చటకు కొనివచ్చి యొకచో నిక్షిప్తమునుచేసి దానిమీద నొక స్థూపమును నిర్మించెను. అశోక చక్రవర్తికూడ రాజగృహ పర్వతశిఖరములమీద మరణించి

నటుల తెలియుచున్నది. క్రీ॥ శ॥ 15 వ శతాబ్దమున ప్రసిద్ధ చీనా యాత్రీకుడు ఫాహియాన్ రాజగృహమును సందర్శించి యిటుల వర్ణించెను.

"పాత రాజగృహము నిర్జనముగానున్నది. నూతన రాజగృహమందు శిల్పకళా విశిష్టతను దెలుపు రెండు బౌద్ధ మఠములు, బుద్ధుని యస్థికలపై నిర్మింపబడిన స్థూపముకలదు. క్రీ॥ శ॥ ఆరవ శతాబ్దమున హుయూనుసాంగు రాజగృహ పట్టణమును సందర్శించి సుందరమైన ప్రాకారములు శిథిల మైనవి. కోగలగోడలు బలీయముగా నున్నవని, నగరమున 100 బ్రాహ్మణ కుటుంబములు కలవని, సుందరమైన బౌద్ధ విహారములు, స్థూపములు గలవని వర్ణించినాడు. బౌద్ధ జైనుల కిది పవిత్ర యాత్రాస్థలముగ నుండెడిది. మహావీర వర్ధమానుడిందు చాలకాలము నివసించెను. జైనతీర్థం కరుండగు ముని సువ్రతుడీ రాజనగరిలో జన్మించెను. ఇప్పటికి రాజగృహముమీంద అనేక జైన దేవాలయములు గలవు ప్రాచీన శిథిలములు, రాతిమర్గములు, ప్రాకారములు, స్థూపములు, దేవాలయములు, గోపురములు, పరిశోధకులకు మిక్కిలి యుపయోగపడినవి.

ఇందు కొన్ని క్రీ॥ శ॥ 500 వ సంవత్సరము నుండి 200 వ సంవత్సరము వరకు కొన్ని క్రీస్తుపూర్వము మొదటి శతాబ్దమునకు చెందినవి యెన్నో కనబడినవి. అజాతశత్రువు నిర్మించిన నగరముకూడ నిందు బయల్పడినది. ఒక రా

డత్యున్నత దశనొంది కళలకు కాణాచియై పరమ పవిత్రస్థలమై నిరుపమఖ్యాతినందిన దీ రాజగృహము. పౌరాణికముగగూడ నిది మిక్కిలి ప్రాముఖ్యతచెంది, మిక్కిలి ప్రఖ్యాతిచెందిన దీ రాజనగరము. ఇది యనేక ప్రాచీన స్థూపములకు పౌరాణిక చారిత్రాత్మక సంస్కృతులకు ప్రతిబింబముగా నున్నది.



# మిథిల

పౌరాణికముగ చారిత్రాత్మకముగ నైతిహాసికముగఁ ప్రసిద్ధిగన్న పురాతన నగరములలో మిథిల యొకటి. ఇది విదేహ రాజ్యమునకు ముఖ్యపట్టణమై యుండెడిది. ఇప్పుడు జానక్‌పూర్ కే పూర్వము మిథిల యనెడి నామముండెడిది. ఇది నేపాలులోని జయానగరుకు పదునెనిమిదిమైళ్ళ దూరమున గలదు. మిథిల దేశము చంపారణ్యమునుండి గండకీనదీ తీరమువరకు వ్యాపించియుండెడిది. ఇక్ష్వాకు మహారాజు గౌతమాశ్రమ సమీపమున నొక జయంతమను పట్టణమును నిర్మించెను. దీనిని రాజధానిగ చేసికొని యా రాజు పరిపాలింప దొడంగెను. ఈ చక్రవర్తి తరువాత నాతని పుత్రుండగు నిమియను నతఁడు రాజ్యమునకు వచ్చెను. నిమిచక్రవర్తి యొకనాఁడు గొప్ప యాగమును గావింపఁదలచి, హోతగా నుండమని వసిష్ఠమహర్షిని కోరెను. అప్పుడు వసిష్ఠుడింద్రుని చే యాగమును చేయింపుచుండెను. అది పూర్తియయిన నట్లంగీకరింతునని వసిష్ఠుండు పలికెను కాని నిమి చక్రవర్తి యాగక గౌతముని హోతగా నియమించెను. అందులకు వసిష్ఠునకు గోపమువచ్చి 'నీవు విదేహుఁడవై మృతిఁజెందుదు వని శపించెను. అందులకు నిమి చక్రవర్తికూడ వసిష్ఠునకు ప్రతిశాపమొసంగెను. ఉభయుల యాత్మలుకూడ బ్రహ్మ కడకు చేరెను. అప్పు డా సృష్టికర్త వసిష్ఠుని దిరిగి భూలోకమున మైత్రావరుణుడుగా జన్మింపుమని కోరెను. వసిష్ఠ

మహర్షి యటులగావించెను. నిమి చక్రవర్తి మాత్రము తిరిగి భూలోకమున జన్మింపనని పలికెను. గౌతమమహర్షి యాగము పూర్తియగుటకు నిమి మృతకళేబరమును మథించెను.

అప్పుడతని భుజములనుండి యొక బాలుఁడు జన్మించెను. మథించఁగా నతడు జన్మించుటచే మిథియని పేరొందెను. మిథిచే పరిపాలితమైన దేశమునకు మిథిలానగరమని పేరు గలిగెను. తండ్రి లేక జన్మించినవాడు జనకుఁడని, మృతదేహమునుండి పుట్టినవాఁడు కాన విదేహుడని నామములను పొందెను.

ఈ మిథిలానగరము వేదాంతవిదులగు రాజులకు కీర్తి గనినది. దీనిని జనక వంశీయులు పరిపాలించిరి. ఆ వంశీయుడే జనక మహారాజు మహాలక్ష్మియైన సీతాదేవికిఁ బెంపుడు తండ్రి, లోకకళ్యాణమూర్తి, శ్రీ విష్ణుమూర్తి అవతారమగు శ్రీరామచంద్రమూర్తి మామ-

జనకమహారాజు కాలములో నీ మిథిలానగర మైకు మైళ్ళ వైశాల్యమునగలదు. దీనిని ద్వాపరయుగమున బహులాశ్వుడు, శతధృతుండు పరిపాలింపుచుండెడివారు. అందుచే రామాయణ భారతకాలములందు నీ మిథిలి మిక్కిలి కీర్తి గాంచినది.

ఆ కాలమున మిథిలి విశాలముగలిగిన వీధులు, అందమైన మేడలు, సుందరమైన ఉద్యానవనములుండెడివి. కులాలువారిగా వీధులుండెడివి. పట్టణమధ్యన విశాలస్థలములలో

సరస్సులుండెడివి. అందు తెల్లని హంసలు నడయాడుచు, చూచుటకింపుగ సొంపుగ నుండెడివి. క్రీ॥ శ॥ 1203 వ సంవత్సరమున విక్రమశిలా విశ్వవిద్యాలయము విధ్వంసమైన పిదప ప్రాముఖ్యములోనికి వచ్చినది. దాదాపీ విశ్వవిద్యాలయమున నాలుగువందల సంవత్సరములు మహోన్నతదశ నందినది. ఇచ్చట క్రీ॥ శ॥ పం(డెండవ శతాబ్దములో గంగేశోపాధ్యాయులు, నవ్యన్యాయ పాఠశాలను సంస్థాపించిరి. మిథిల విశ్వవిద్యాలయము స్మృతిధర్మ శాస్త్రములకు సంబంధించిన వాఙ్మయమును నపారముగ సృష్టించినదనుటలో సందేహము లేదు.

ఈ విశ్వవిద్యాలయము నందలి పండితులెల్ల రుద్దండులు. అందుచేత నీ విశ్వవిద్యాలయము విదేశీయులనుగూడ నాకర్షించినది. ఇందు లలితకళలు, శిల్పసంస్కృతి విద్యాప్రచారమున కానాడు, మిథిల మిక్కిలి కీర్తికాంచినది.

క్రీ॥ శ॥ 14 వ శతాబ్దమునుండి 16 వ శతాబ్దంవరకు బ్రాహ్మణవంశ రాజులు దీనిని పరిపాలించిరి. భారతీయ ప్రాచీన విజ్ఞానమునకు న్యాయ ధర్మశాస్త్రములకు మిథిలా నగరము కాణాచినుండెడిది. ఇప్పటికి నిందు ప్రాచీన దేవాలయంబులయిన కపిలేశ్వర కూపేశ్వరాలయములు ముఖ్యములైనవి. మిథిలా నగరమున కతిసమీపమున శిలానాథ, కళ్యాణేశ్వర జపేశ్వర మున్నగు పవిత్ర దేవాలయములుకలవు. సీతారాముల దశరథు నాలయములు నిందు కలవు. మిథిలకు

తేరభుక్తియను పేరుకూడ కలదు. ప్రాచీన మిథిల యిప్పటి దర్భాంగా చంపారణ్యము. ఉత్తరము జఫర్ జిల్లాలు చేరి యుండినవి. వేదకాలము తరువాత నీ నగరంబు మిక్కిలి కీర్తి గనినది. నాటి ప్రజాస్వామిక రాజ్యములైన లిచ్ఛవి, విదేహ యను రెండును మిక్కిలి విఖ్యాతిని బొందిన రాజ్యములే క్రీ॥ శ॥ 16 వ శతాబ్దమున నవద్వీపములోని విద్యాలయము లభివృద్ధిలోనికి వచ్చినపిదప మిథిలా విశ్వవిద్యాలయ ప్రము ఖ్యత తగ్గినది. కాని యానాటి సుందరకళా విశిష్టత స్మరణీయ మైనది. శ్రీ వైకుంఠవాసులు, లోకరక్షకులయిన శ్రీ మహా విష్ణు లక్ష్మీదేవి సంచరించి విహరించిన పవిత్రదేశ మా మిథిల - ఆ పాదపద్మములు తాకుటచే నా స్థలమెల్ల నత్యంత పుణ్యవంతమైనదనుట నిస్సందేహము.



# సాంచి

హిందూదేశ చక్రవర్తులలో మిక్కిలి కీర్తిగాంచినవాడు అశోకచక్రవర్తి. అమ్మహారాజు కళింగయుద్ధానంతరము బౌద్ధమతమును స్వీకరించెను. ఆ మతము వ్యాప్తికై యా మహారాజు ఎంతయో కృషిచేసెను. అనేక ప్రదేశములందు స్థూపములు, విహారములను స్థాపించెను. అశోకుండు నిర్మించిన బౌద్ధస్థూపములలో సాంచి స్థూపము జగద్విఖ్యాతి నొందినది. ఈ సాంచీ గ్రామము మధ్యయిండియా భోపాలు సంస్థానమందు బీల్సాకును షుమారైదున్నర మైళ్ళదూరమందుండెను. ఒకప్పుడు సాంచీ పట్టణము చాల గొప్పదిగా నుండినటుల తెలియుచున్నది. సాంచీ పట్టణంబులో నిర్మింపబడుటవలన సాంచీ బౌద్ధస్థూపమని పేరు గలిగినది. ఈ సాంచీ స్థూపము భారతీయ శిల్పకళా ప్రావీణ్యతను వెల్లడియగుచున్నది. దీని సౌందర్య మితరస్థూపములకు గూడ లేదు. ఈ సాంచీ పట్టణమునకు (చైత్యగిరియను) పేరుగూడ కలదు. దీని చుట్టు కొండలు గుట్టలున్నవి. ఇచ్చట స్థూపశిథిలములను త్రవ్వుచుండగ గౌతమ శిష్యుండగు మౌద్గలాయనసారి పుత్రుని యస్థికలు గనబడినవి.

ఈ సాంచీ స్థూపము 50 అడుగులు. కైవారం 160 అడుగులు. స్థూపము పైభాగమంతయు శిల్పరచనతో ప్రకాశించు

పలకరాళ్ళతో స్థూపమునకుచుట్టు వలయాకారముగ సుమారు 140 అ. కై వారముగలిగిన రాతితో నిర్మించిన కంచెయొకటి ఉన్నది. దీనిచుట్టు నెడముగ అనేక శిలా స్తంభము లమర్చ బడినవి. కంచెకు 4 దిక్కులకు 4 తోరణద్వారములు నిర్మించిరి. ఈ తోరణములమీద బుద్ధుని జీవితవిశేషమును జాతక కథలను విపులముగ నిర్మింపబడినవి. ఉత్తర దిక్కునగల తోరణద్వారముమీద బుద్ధదేవుని జాతకము లిఖింపబడినది. కొన్ని ప్రదేశములందు బుద్ధభగవానుని అస్థికలకొరకు జరిగిన పోరాటములు దండయాత్రలు గూర్చిన శిల్పములు, శిల్ప కళా విశిష్టతగా చెక్కబడినవి. మరికొన్ని ప్రదేశములందు మోహనయుతులైన కాముకులతో విలాసినులైన కామినులు మరచి ఆడుచు పాడుచున్నట్లు అత్యంత మనోహరముగ చిత్ర విచిత్రముగ చిత్రింపబడినవి. ఈ స్థూపము అశోకచక్రవర్తి క్రీ॥ పూ॥ 274 వ సంవత్సరమున నిర్మింపబడినప్పటికి తోరణ ద్వారము లా తరువాత క్రీ॥ పూ॥ 1 వ శతాబ్దమునందు నిర్మితములైనటుల తెలియుచున్నది. సాంచీయొద్ద అశోకుడు నిర్మించిన శిలా స్తంభములుకూడ కలవు. దీని ఉత్తర ద్వారములయొద్ద 2 శిలా స్తంభము లతి మనోహరముగ నిర్మింపబడినవి. దక్షిణద్వారము శిలా స్తంభ మాకాశమంటుచు 145 అడుగుల యెత్తున ఉండును. దీనిపై భాగమున ఒక మానియున్నట్లు ఒక శిల్పము చెక్కబడినది. ఈ విగ్రహ మతి సుందరముగా ముద్దులమూట కట్టుచుండును. భారతీయ

శిల్పవిన్నాణము సంస్కృతి వెదజల్లుచుండును. ఇందుగల 2 వ స్తంభము చాల చిన్నది. సుమారు 12 అడుగుల యెత్తుండును. ఇందుగల యశోక స్తంభము పూర్వము చాల పొడవుగనుండి, యిప్పుడు శిథిలావస్థ యందున్నది. ఈ స్తంభము పై భాగమున 4 సింహముల విగ్రహములు చెక్క బడినది. ఇందు చక్రవర్తి శాసనమును చెక్కించినాడు. ఈ శాసనము 8 పంక్తులుగలిగియున్నది. అందిటుల వ్రాయ బడినది "సంఘమును విడదీయగూడదు. నా పుత్రపౌత్రు లున్నంతకాలము సూర్యచంద్రు లున్నంతకాలము సంపూ ర్ణముగ నిది యమలుపరుప బడవలయును. భిక్షువుగాని, భిక్షిణిగాని యిటుల గాంచిన మాష్యములైన శ్వేతవస్త్రము లను ధరింపచేయవలయును. బౌద్ధయుగమునందు బుద్ధభగ వానుని జనన మత ప్రచార నిర్వాణాదుల తెలియచేయుటకు ముఖ్యప్రదేశమునందు మనోజ్ఞంబుగ చైత్యంబులు విహార ములు నిర్మింపబడినవి. బుద్ధుని అస్థికలను నిక్షిప్తమునుచేసి వానిపై నెన్నియో స్థూపము లతి మనోహరముగ చిత్ర విచిత్రముగ శిల్పకళా విశిష్టత తెలియునటుల నిర్మింపబడినవి.

వీనిని చూచుటకెంతయో నేత్రపర్వముగ నుండును బౌద్ధమతమును స్వీకరించిన అశోకచక్రవర్తి తన రాజ్యము నందంతట బౌద్ధమతమును స్థాపించినాడు కాశ్మీర, కళింగ, ద్రావిడ దేశములందెన్నియో నిర్మించినాడు. నేటికిని కొన్ని

ప్రదేశములు చెక్కుచెదరకయున్నవి. కొన్ని ప్రదేశము లందు శిథిలావస్థయందున్నవి. ప్రసిద్ధ చీనా యాత్రికుడు హుయాన్ సాంగు మున్నగువారు వీనిని దర్శించి గొప్పదనమును ప్రపంచమునకు విశదము జేసినారు. వీనిని నేటికి బౌద్ధమతాభిమానులు దర్శించి పోవుచుందురు.



# త్రిపురాంతకము

భారతదేశమునందు శిల్పకళా విశిష్టతగ, అధ్యాత్మిక పరముగ సౌందర్యవంతముగ విలసిల్లిన ప్రదేశములెన్నియో కలవు. అందు ప్రసిద్ధికాంచిన త్రిపురాంతక మొకటి. ఇది చారిత్రాత్మకముగా గాకుండ పుణ్యక్షేత్రముగాకూడ విలసిల్లినది. ఇందు ప్రసిద్ధిచెందిన దేవాలయమునకు చెక్కబడిన శిల్ప మనల్పముగనుండును.

ఈ దేవాలయమునందు స్వామి త్రిపురాంతకేశ్వరుడు. ఇది ఆంధ్రప్రదేశ్ లోని శ్రీశైలమునకు తూర్పుగానున్నది. అనగా కర్నూలు జిల్లాలో మార్కాపురమునకు పాతిక మైళ్ళ దూరమున కలదు. పూర్వము అందు భయంకరమైన అరణ్యములుండెడివి. నాగార్జునాచార్యుడు త్రిపురాంతకముకూడ వచ్చి అచ్చట బౌద్ధమతబోధనలను గావించినటుల తెలియుచున్నది. ఆయన అచ్చటకు వచ్చిన చిహ్నముగ నట పెద్ద వలయాకారము గలిగిన అరుగు నిర్మించిరట. అది నేటికి చాల శిథిలముగనున్నది.

ఈ త్రిపురాంతకేశ్వరుని దేవాలయము, దేవీ ఆలయము త్రిపురాంతక గ్రామమునకు పశ్చిమముగా నొక మైలు దూరమున నొక పెద్ద తిప్పమీద నిర్మింపబడినవి. రావిపాటి త్రిపురాంతకుడు రచించిన త్రిపురాంతకోదాహరణములో త్రిపురాంతక స్తుతి కలదు. ఒక శాసనములో త్రిపురాంత

కమే కుమారగిరి అని చెప్పబడినది. దీనిని క్రీ॥ శ॥ 1106 వ సంవత్సరమున నిర్మించినటుల తెలియుచున్నది. క్రీ॥ శ॥ 1254-55 సంవత్సరములలో కాకతీయ ప్రభువు గణపతి దేవు నిచే పునర్నిర్మింపబడినది. ఈ గణపతిదేవునకు ఒక భీకరమైన వ్యాధి వచ్చినదట. ఆయన కలలో స్వామి కనబడి "రాజా! నా దేవాలయము శిథిలావస్థయందున్నది. దానిని నీవు పున నిర్మించినచో నీకు వ్యాధి కుదరగలదని పలికినాడట" అప్పుడు రాజు మేల్కొని తన మంత్రులకు తన స్వప్నవృత్తాంతమును జెప్పి వెంటనే యా దేవాలయమును బాగుచేయింపుడని వారికాదేశించెను. వారు వెంటనే ఆ దేవాలయమును బాగు చేయించిరి. ఆ మహారాజునకు వ్యాధి కుదిరినది. ప్రస్తుతము ఆలయముచుట్టుఉన్న ప్రాకారము చాల శిథిలావస్థలోకలదు. నాలుగువైపుల సుందరమైన గోడలున్నవి. వానిమీాద చిత్రించిన చిత్రము లత్యంతమనోహరముగ నుండెడివి. దేవాలయము వెలుపల గోడలవైపునవున్న గూళ్ళలో నృత్య గణపతి,దక్షిణామూర్తి లింగోద్భవమూర్తి, బ్రహ్మరుద్రదుర్గ శిల్పాలు అమోఘముగ చిత్రింపబడినవి.

ఈశ్వరుడిక్కడ లింగాకారములో కలడు. ఈ దేవాల యము ఉత్తరదిక్కున దేవీ ఆలయముకలదు. ఆలయము లోపల నైరుతిమూలగా చీకటిబెళం చీకటిమిద్దె అనబడు చిన్న గుడిఉన్నది. పూర్వకాలములో దీని లోపలినైపునుండి శ్రీశైలానికి సొరంగమార్గముండెననియు, దీనిగుండా ప్రజలు రాకపోకలు సాగించెడివారనియు తెల్పెడివారు.

క్రీ॥ శ॥ 1502 సంవత్సరమున విజయనగర రాజులు ఈ దేవాలయమునకు వసతులేర్పరిచినటుల తెలియుచున్నది. శ్రీకృష్ణదేవరాయలు ఆనందగజపతిని పాఱద్రోలుచు ఇచ్చట రెండు దినములుండి స్వామిని సేవించినాడని అచ్చటగల శాసనమువలన తెలియుచున్నది.

త్రిపుర సుందరదేవికి త్రిపురాంత కేశ్వరునకు నొక సందర్భమున భేదాభిప్రాయములు వచ్చెనట. దేవి పరమేశ్వరునిమీద యలిగి అచ్చటకు సమీపముగనున్న యొక పెద్ద చెఱువులో దుమికి వెలసెనట. అక్కడి ప్రజలు మరునాడు చూచి పెద్ద దేవాలయమును నిర్మించిరట.

క్రీ॥ శ॥ 1409 సంవత్సరమున ఆంధ్రరాజులు ఈ దేవాలయమునకు బహువిధ సంపదల నొసంగిరట—

త్రిపురసుందరీదేవి ఆలయమునకు మూఁడువైపుల నీరు వెనుకవైపున కొండకలదు. ఈ కొండమీద సాయంకాల సమయమున దేవతలు సంచరించుచుందురని తెలుపుదురు. గర్భగృహము లోతైన యొకగుంట ఎప్పుడూ నీటితో నిండి యుండెడిది. ఇందువల్ల గర్భాలయము ముందున్న మంటపములోని వేదికపై ఉన్న దేవి పాదములకు మాత్రమే భక్తులు పూజింతురు.

క్రీ॥ శ॥ 1605 సంవత్సరమున ఒక మహా ధనవంతుడు తనకు గలిగిన విపత్తు దేవివలన తొలగిపోవుటచే ననేకములగు కానుకలను సమర్పించినటుల తెలియుచున్నది. ఈ దేవాల

యము ముందు ఒక వరుసలో వీరగల్లులు అనబడు రాతి విగ్రహములు గలవు.

పూర్వకాలమున గాజుల వ్యాపారము చేసికొనువారు ఈ దేవాలయముమీదుగా పోవువారని, వారిని ఆమె బలి తీసుకొనేదని, అందుకు ప్రజలు ఆ దేవాలయముమీద శిల్ప కళా విశిష్టతగా, చిత్ర విచిత్రముగా, బొమ్మలు చెక్కినారు. ప్రతి సంవత్సరము శివరాత్రికి ఇచ్చట మహావైభవముగా జరుగుచుండెడిది. ఆంధ్రుల కళావైభవము, ఆంధ్రుల ఆధ్యాత్మికశక్తి ప్రతిబింబముగా నేటికి ఈ త్రిపురాంతకము వెలయుచున్నది—

# కాళహస్తి

మన భారతదేశమునందు చారిత్రకముగ పౌరాణిక ముగ ప్రసిద్ధిచెందిన పవిత్రప్రదేశము లెన్నోకలవు. వానిలో మిక్కిలి కీర్తిగాంచినది కాళహస్తి. ఇది ఆంధ్రప్రదేశ్ లో చిత్తూరుజిల్లాలో కలదు. ప్రసిద్ధ పుణ్యక్షేత్రమైన తిరుపతికి షుమారు 20 మైళ్ళ దూరమునగలదు. దీనికి దక్షిణకైలాస మని ప్రసిద్ధికలదు. పూర్వము బ్రహ్మ కైలాస పర్వతశృంగ మును తెచ్చి యిచ్చట లోకానుగ్రహార్థము శివుఁడు నివ శించుటకు నేర్పాటుచేసెను. పూర్వము వసిష్ఠుఁడను మహర్షి పుత్రశోకమును భరింపజాలక యిచ్చట మహేశ్వరునిగూర్చి తపస్సుచేసెను. అప్పుడు శివుడు ప్రత్యక్షమై మహర్షి దుఃఖ మును బాపెను. తరువాత కొంతకాలమునకు సాలెపురు గొక్కటియు, నొక నాగుఁబాము, నొక్క యేనుఁగు నొక్క టిగా పెక్కు వేలసంవత్సరములు మిక్కిలి భక్తితో శివునిఁ గూర్చి యిచ్చట తపస్సు చేసినవి. అంత శంకరుండు వాని భక్తికి మెచ్చి ప్రత్యక్షమై మీకేదికావలయునని కోరగా నవి మేము ముగ్గురము నొక్కటిగా నీ రూపమునుపొంద గోరెదమనెను. అందుకు శివుడట్లగుగాకయని ఆ మూవురకు ముక్తినిచ్చి శిలామయ లింగాకారము చెందినాడని స్థలపురా ణము చెప్పుచున్నది. దీనికి నిదర్శనముగ చివర పంచముఖము లున్నవి. వానిని సర్పరాజు పంచముఖములని యందురు.

కొననుండి అడుగుదాక లింగమునడుమ రెండు తెల్లపట్టెలు కానబడును. అవి యగజ గజరాజదంతములని పలుకుదురు. అడుగున సాలెపురుగుఁబోలిన రూపము కనబడును. ఈ కారణముననే యిక్కడి లింగమునకు శ్రీ కాళహస్తీశ్వరుఁడని పేరుగలిగినది.

పూర్వకాలమున కన్నప్ప అను నెఱుక యీ ప్రదేశమున తిరుగుచు అనేక మృగముల గూల్చుచు, శ్రీ కాళహస్తీశ్వరలింగమును నొక పొదరింటినడుమను జూచి పూర్వజన్మపుణ్యమున నా శివునిపై భక్తిగలిగి తన చెప్పులచే నా శివుని శరీరమును దుడిచి, స్వర్ణముఖినదిలోని నీటిని దన పుడిసిట తెచ్చి దేవున కభిషేకమునుజేసి నాడుస్వీకరించిన పందిమాంసమును గాల్చి కొఱికి రుచిగలదౌట తెలిసికొని దానిని నా పరమేశ్వరునకు నివేదించి యొక ప్రమానినీడ నా ప్రొద్దుగడిపి మరునాడు పైవిధముగ నభిషేకనైవేద్యములను చేసెను. ఇట్లనుదినమును గడుప నారవనాడు శివుడా కిరాతుని చిత్తశుద్ధిని పరీక్షింపనెంచెను. మరునాడు తనకంట నొక్కంట నీరు గారునట్లుచేసెను. ఎప్పటియట్టులా కిరాతకుడు మాంసము బొసంగవచ్చునప్పటికి శివుని కంటిని నీరు వరదయై కారుటచూచి నా తండ్రికి కిట్టికష్టము గలిగెనే యని దుఃఖించి కన్నీరునించి యయిన నేమాయె నా కన్నయ్యకు కన్నైన నిచ్చెదగాకయని తలంచి, తన కంటి నొక్కింటన వింటికొపున పెకలించి యెత్తి శివుని కంటికి పూజలు సలిపెను. అప్పటికా కంటి నీరాగి మరల రెండవ కంటినుండి నీరు ప్రవహింపబూనెను. అప్పుడతడు చూచి

తన రెండవ కన్నునుగూడ బెఱికినపిదప దనకేశ్వరుని కన్నుండు చోటు తెలియుటకై చెప్పులనొప్పు తన పాదాగ్రమాతావున నూది తరువాత తన కన్ను బెఱికెను. అప్పుడీశ్వరు డతని ననుగ్రహించి ముక్తినొసంగెను. ఇందుండు శివునకు వాయు లింగమని యందురు. ఇక్కడ మహాశివరాత్రినాఁడు స్వామి వారికి బ్రహ్మోత్సవము గలదు. ఆనాడీ పుణ్యస్థలమున కనేక దేశములనుండి జనులువచ్చి యుదయము మొదలుకొని సాయంసమయమగుదాక సువర్ణముఖియందు స్నానమాడుచు, నీశ్వర దర్శనమును జేయుదురు.

ఈ దేవాలయమునకు నానుకొని స్వర్ణముఖీనది ప్రవ హించుచుండెను. దీనికి తెలుగున మొగలె అని పేరు. పూర్వ కాలమున నీ నదికి నిరుప్రక్కల మొగలుపొద లుండెడివట. అందుచేత దీని కీ పేరు గలిగినది. ఈ నది చంద్రగిరికి ఏడెని మిది క్రోసుల దూరమునగల కొండలలోబుట్టి తిరుచానూరు చేరువ ప్రవహించుచు చాలదూరము తిరుగుచు చివరకు సముద్రమునందు చేరును.

అగస్త్యమహర్షి మునీన్ద్ర పవిత్రక్షేత్రమునకు వచ్చి స్వామిని దర్శించి, యిందువచ్చు నశేషజనముల కుపయో గించుటకొక పవిత్రనది యుండవలెనని భావించెను. అప్పు డమ్మహాఋషి గంగానదినిగూర్చి యా పర్వతముమీద తపస్సుచేసెనఁట. అప్పుడు గంగాదేవి ప్రత్యక్షమై యా మునిపుంగవుని కోరికప్రకారము నిజప్రవాహమున నొక్కింత భాగమును భూమిపైవిడువ నది నదియైనదని చెప్పుదురు.

ఈ నది చూచుటకు నెంతయో రమణీయముగానుండును. ఇందు స్నానమును గావించిన వారి పాపములు పటాపంచ లగును. ఈ నదియొడ్డున నాలుగైదు రేవులు రాలచే గట్ట బడిన మెట్టులు గలిగియుండును. వీని యన్నింటను నీశ్వరాల యమునుండి నిర్మింపబడియుండు మెట్టులందముగా నుండును. ఈ మెట్లనడుమ నందమైన యొక్క చిన్న నూయి కలదు. ఆ నీటిని గైకొని బ్రాహ్మణు లా పార్వతీపరమేశ్వరుల కభి షేకమును జేతురు.

కాళహస్తి నైరుతిదిక్కున నీశ్వరాలయము చేరగానే మొదట బాలజ్ఞాన ప్రసూనాంబ సన్నిధియు, కొన్ని యడు గులు ముందటికి రిగిన పాతాళవిఘ్నేశ్వరుని సన్నిధియుకలదు. మొదటి ప్రాకారముదాటి లోన ప్రవేశించిన దక్షిణా మూర్తియు, మృత్యుంజయేశ్వరుడును సిద్ధి వినాయక స్వామియు గనబడుదురు.

శ్రీ కాళహస్తీశ్వర లింగము కడు దర్శనీయమై దర్శించువారి పాపమును నిర్మూలించును. గొప్ప మహిమ గలిగిన నీ లింగమును సర్చకులు తాకలేరు. జలాభిషేకములు పీఠంబులకు లింగమునకు చేయుదు. అర్చకు లీ లింగమును సుగంధ నిర్మలజలమును నించిన శంఖును చేబట్టి మీఁద నుండియే యభిషేకమొనరింతురు. స్నానాంతరమున తడి యొత్తుటలేదు. లింగమునకెదుట నొక దారమునకు వ్రేలగట్ట బడియుండు కవచమునకే చందనాదులర్పింతురు.

ఈ దేవాలయము వెలుపడ ధ్వజస్తంభమును జేర గానే అక్కడ, పంచలింగములు శనైశ్చరభవనము నటేశ్వర

సదనము పెద్ద మారేడుచెట్టుగలదు. ఈ దేవాలయమునకు దగ్గరగా వేంకటేశ్వర దేవాలయము గలదు. దానికి దగ్గరగా చండికేశ్వరాలయము గలదు. ఇది దాటగానే భైరవమూర్తి గుడి కలదు. కొండ మధ్యన కన్నప్పగుడియు కలదు.

ఈ దేవాలయమునకు దక్షిణముగా మణికంఠేశ్వరాలయము గలదు. దానికి దగ్గరగా బ్రహ్మాలయముకలదు. మణికంఠేశ్వరాలయమునకు దగ్గరగా భరద్వాజతీర్థం కలదు. అచ్చట భరద్వాజ మహర్షి యాశ్రమముండెడిది. ఈ తీర్థం నుండి కొంచెముదూరము పోయినచో అగస్త్యేశ్వరాలయము కలదు. ఇది దాటిపోగానే భైరవునికోన చూడదగును. దీనికి కొంచెం నడచిన మార్కండేయతీర్థము కన్నులపండువుగ నుండును. ఇందెల్లప్పుడు నీరు సమృద్ధిగానుండును. ఇందు వర్షాకాలమునందు నీరు పల్లములోనికి దుముకుచు చూచుటకు నాశ్చర్యముగ నుండును. దీని ఎదుటనే మార్కండేశ్వర లింగముగల యొక నిలయముగలదు. దీనిని దాటిన తరువాత కొండఎక్కి చూచినచో నొక చిన్న గోపురము గనబడును. ఇందుండి తూర్పుదిక్కునకు చూచినచో దట్టమైన పొదలతోగూడిన యొక కోనయు నొక గుడియు కనబడును. ఇది వేయిలింగాలకోన ప్రదేశమంతయు దూరుటకు సెడము లేక చెట్లచేమలచే తీగెలచే నిండియుండును.

ఈ కోనలో మధ్యన చిన్న గుట్టపై సహస్ర లింగేశ్వరు సదనము కలదు. ఇందొక యందమైన సరస్సుకలదు.

శ్రీ కాళహస్తీశ్వరు దేవాలయము చంద్రగిరిరాజులు నిర్మించిరి. క్రీ॥ శ॥ 1514 వ సంవత్సరమున శ్రీకృష్ణదేవరాయలు ఈ స్వామిని దర్శించి యనేకములగు కానుకలను సమర్పించిరి. చారిత్రకముగ పౌరాణికముగ ప్రసిద్ధిచెందిన దీ కాళహస్తి. నేటికిని కోట్లాది ప్రజ లీ క్షేత్రమును దర్శింపుచుందురు.

# నాగార్జునుని కొండ

భారతదేశమున అనల్ప శిల్పకళావిశిష్టతను వెల్లడించు వానిలో నాగార్జునుని కొండ మిక్కిలి పేరెన్నికగన్నది. ఇప్పటికి దాదాపేడు వందల సంవత్సరములనాడు బౌద్ధమత మంతరించినది. కానియది దేశీయుల గౌర వాదరములకు పాత్రమై, వారియభిమాన విశ్వాసములను జూఱగొనినది. నాడు దేశమున ఆ మతము వెలయింప జేసిన నిర్మాణములలో చాల భాగము నామమాత్రా వశిష్టములై కొన్ని మాత్రము కాలపురుషుని దౌష్ట్యమున కెదురొడ్డి కొనయూపిరితో నిలిచి యున్నవి. మఱికొన్ని యిండియా ప్రభుత్వపు పురాతత్త్వ శాఖ వారు చేయుచున్న కృషికి ఫలముగ ఏ శిథిలరూపము తోనో, భగ్నా కృతులతోనో బయట బడుచున్నవి. ఈ జీర్ణ బౌద్ధ నిర్మాణా వశేషములను శిథిలబౌద్ధ శిల్పకృతులను చూచినను బౌద్ధము జీవన్మృతమై విలసిల్లిననాటి యీ కళా విధానముల నిండారు ప్రశస్తి వైభవశోభలను వెల్లడింపుచునే యుండును.

గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలో కృష్ణానదీ దక్షిణ తీరముననున్న దీ నాగార్జునునికొండ. పల్నాడు తాలూకాలోని మాచెర్ల వఱకు రైలుకలదు. మాచెర్లకు నాగార్జునునికొండకూ పదిహేను మైళ్లదూరము. మాచెర్లనుండి పది మైళ్ల దూరముననున్న నాసలవరము వఱకు బండ్లుపోవును.

అచ్చటి నుండి కడపటి యైదుమైళ్ల దూరమును నడిచి పోవలసినదే—

నాగార్జుని కొండకు దగ్గరగానున్న గ్రామము పుల్లారెడ్డిగూడెము. అది చారిత్రక ప్రసిద్ధిగల ప్రాంతముననున్నను ఆ గ్రామమున చారిత్రక ప్రాముఖ్యముగల వస్తువిశేషము లేవియులేవు. నిజాం రాజ్యమును చెన్నరాజధానిని విడదీయుచు కృష్ణానది నాగార్జునుని కొండప్రక్కనే ప్రవహింపుచుండును. ఇది యంతయు కొండలమయమైనను ఎఱ్ఱనేల. ఇక్కడి కొండలు 800 అడుగుల యెత్తుండును. ఈ కొండలతోపాటు పెద్దపెద్ద దిబ్బలుకూడ కలవు. వీనిమీదకూడ నడవి బలసినది. ఈ దిబ్బలన్నియు ప్రాచీన బౌద్ధ నిర్మాణావశేషములు. నాగార్జునునికొండ యున్నది యీ ప్రాంతమునకు వాయవ్యదిశనున్న 200 ఎకరముల వైశాల్యముగలగుట్ట. చిత్ర విచిత్రాకృతులుగల శిఖరములతోడి యీ కొండలను జూచినచో నవి స్వాభావికముగ నేర్పడిన కోటలవలెదోచును. వీనికితోడు రక్షణనిమిత్తము మానవు డిటికలతోను, ఱాతితోను కట్టిన గోడలు మొదలయినవికూడ నున్నవి. వీని నన్నిటిబట్టి చూడగా నీ ప్రాంతపీఠభూమి ఒకప్పుడు ఒక దుర్గ నిర్మాణముగ నుండియుండవలెనని తోపకమానదు. ఈ ప్రదేశమున పాడువడిపోయిన మధ్యయుగమునాటి శివాలయముతక్క ప్రాచీన నిర్మాణ చిహ్నములేవియు కనిపింపవు. విడివిడిగా చెదరియున్న శిలాసమూహమును జూచినయడల ప్రాచీన కాలమున నిచట నేవో వెఱ్ఱిమొఱ్ఱిగా కట్టిన కొండలుండవలెనని తోచును. కోటగోడలు మొదలగువానిని కట్టుటలో

నుపయోగించినవానితో సమపరిమాణమును గలిగియున్నవి. మిక్కిలి ఎత్తుననుండును. అనగా పాటలీపుత్రములోని అశోక వర్ధన చక్రవర్తి రాజధానీస్థలమునైన బులందిబాఘ్‌లో గాన వచ్చిన వానియంత పరిమాణముగలవియే నైయుండును.

ఈ యిటికగోడలు ప్రాకారములు మొదలైనవి బౌద్ధులీ ప్రదేశమున నాక్రమించి యుండినప్పుడు కట్టినవే అయియుండవలెను. ఈ కొండ దిగువ ఉపత్యకముగలదు. అందు శిలాప్రాకారములును బురుజులును, ఇవి బౌద్ధయుగమునకు చాల తరువాతివి. విజయనగర రాధీశుల కాలమునాటివి కావచ్చును.

బౌద్ధావశేషములు లోయలో మాత్రమే కాన వచ్చును. పీఠభూమిమీద కొన్ని మైళ్లవఱకు త్రవ్వి చూచినారు. గృహ నిర్మాణములుండిన జాడలేవియు గానరాలేదు. ఇప్పుడిదియంతయు శిలాభూమి. చెట్లు చేమయులేవియు పెరగవు. నీరు దొరకదు. అందువలన మానవ నివాసమునకు యోగ్యముకాదు. గ్రామమునకు పడమట దిశననొక కొండ యున్నది. నాగార్జునుని కొండమీద వలెనే అక్కడ కూడా ఇటిక గోడలు మొదలైనవి కలవు. కాని గృహనిర్మాణాదుల చిహ్నము లక్కడ కూడా కనిపింపలేదు. ఇక్కడ నుండు పెద్ద దిబ్బలన్నియు బౌద్ధావశేషములే. వీనిలో గొన్నిసమ ప్రదేశపు మైదానముునను మఱికొన్ని కొండల మీందను నున్నవి. అక్కడక్కడ మొన్న మొన్నటి వఱకు నిలిచియున్న శిలాస్తంభమో, శిల్పాలంకృత ఫలకమో అది ప్రాచీన

నిర్మాణ స్థలమని సూచింపుచు వచ్చినవి. ఇట్టి శిథిలావశేష ములున్న ప్రదేశము అమరావతీ బౌద్ధారామ ప్రదేశము కంటె పెద్దది. ఈ లోయమధ్యనుండిన నగరము ఒక తట్టున నది వల్లను వేరొక తట్టున దుర్గ ప్రాకారాదుల వలనను, పశ్చిమో త్తరముల ఎత్తైన ప్రాకారములతో గూడిన కొండల చేతను పరిరక్షిత మైనదగుట వలన ప్రాచీన కాలమున నది శత్రుజన దుస్సాధ్యముగానుండి యుండ వలయును.

ఆ కాలమున సముద్రమునుండి ఓడలు సరాసరి నాగార్జునుని కొండ వఱకు వచ్చుట కనువుగ నుండునటుల, కృష్ణానది యిప్పటికన్న వెడల్పుగను, సముద్ర మిప్పటికన్న దగ్గరగ నుండి యుండవలయును. అదియునుగాక యీ పట్టణమునకు కృష్ణానదికిని దగ్గరగల ఇతర బౌద్ధాది నివేశముల గల చేజర్ల, అమరావతి, జగ్గయ్యపేట, ఘంటసాల, గుమ్మడిదుర్రు, బెజవాడ, భట్టిప్రోలు మొదలగు చోట్లకు సుకరముగ రాకపోకలు వ్యాపారము కూడా జరుగుచుండి యుండవలయును. ఈ లోయలో బయలుపడిన స్తంభములు, దూలములు, విగ్రహములు శిల్పఫలకములు చేయుటలో నుపయోగపడిన పాలరాతి బండలు స్థానికముగ త్రవ్వి ఎత్తినవియు కావు. కొండలమీంది నుండి తీసికొని పోయినవియుకావు. అవి నదివెంటనే వచ్చియుండ వలయును. క్రీ॥ శ॥ 1925 లో ఈ ప్రాంతమున శిథిలములైన బౌద్ధస్థూపపు దిబ్బయొద్ద ప్రాచీన బ్రాహ్మీశాసనములుగల కొన్ని స్తంభములు గనబడుట వలన స్థలము చాల ప్రాచీన మైనదయియుండునని

ఊహించి పురాతత్త్వ శాఖవారు ఇచట పరిశోధన లారంభించిరి.

ఆ పరిశోధనల ఫలితముగ ౧౭ ప్రాచీన శాసనములు, రెండు శిథిలాలయములు, అనేకములు, అమూల్యములగు శిల్పచిత్రములును బయటబడినవి. దానినిబట్టి యిది ప్రాచీన బౌద్ధాది నివేశమని బౌద్ధకళానిధానమని తేటపడినది. ఇచ్చట బయటపడిన శాసనములు ౧౮౮౮-౨ లో జగ్గయ్యపేటలో దొరికిన ప్రాచీన శాసనములుకూడ ఇక్ష్వాకువంశ భూవరులు వేయించినవే—

వీనినిబట్టి క్రీస్తుశకము మూఁడు నాలుఁగు శతాబ్దులలో కృష్ణానదీ ప్రాంతమున ఇక్ష్వాకువంశజులమని చెప్పుకున్నవారు పరిపాలింపుచుండిరని తెలియుచున్నది.

ఇక్కడ నల్లరాళ్ళ బోడను కొండమీఁదనున్న ఆలయము చప్టామీఁది శాసనమువలన సింహళద్వీపమున నుండి బౌద్ధభిక్షువులు వచ్చి యీ కొండమీఁద నివశించుచున్నట్లు వారచట నొక స్థూపమును సంఘారామమును నిర్మించినట్లును పడమటిదిశ పొరుగున విజయపురి పట్టణముండినటుల తెలియుచున్నది. నల్లరాళ్ళబోడుకు దగ్గరగా చాల చిన్న కొండయున్నది. వాని శిఖరాలమీఁద చిన్న స్థూపములు శిథిలములు చూపట్టును. మహాస్థూపమునకు తరువాత ముఖ్యమైన నిర్మాణములన్నియు నల్లరాళ్ళ బోడుమీఁదనే యున్నవి. దీనిమీఁద త్రవ్వగా 2 స్థూపములు ఒక చైత్యాలయమును సంఘారామములు దానికి సంబంధించి సున్నము

యిటికతో కట్టిన గృహములున్నవి. ఈ నల్లరాళ్ళబోడె శ్రీపర్వతము అనుపేర వెల్లడియయినట్లు శాసనములవలన తెలియుచున్నది. ఈ పర్వతసంఘారామమునే మహాయాన బౌద్ధ స్థాపకుడైన నాగర్జునాచార్యులవారు తమ చరమదశ గడిపినట్లు బౌద్ధగ్రంథములవలన తెలియుచున్నది. ఇచ్చట బుద్ధధాతువు నిక్షిప్తమై యిది పవిత్రక్షేత్రమగుటచే నాగార్జునాచార్యులవారి కిది నివాసస్థలమగుటచే దూరదేశీయులందుండిన ద్వీపములయం దిది యుండినట్టియు బౌద్ధులకు గొప్ప యాత్రాస్థలమయ్యెనని యూహింపదగియున్నది. నాగార్జునకొండ స్థూపము, ఇటికతోను, సున్నముతోను కట్టిన యొక మహానిర్మాణము.

శాసనములం దీ మహాచైత్యమనుపేర నొప్పుచున్నది. అండాకృతిగల స్థూపభాగము 5 అడుగులఎత్తు 102 అడుగుల వ్యాసముగల గుండ్రని వేదికమీఁద నిర్మితమైనది. నాశనము కాగా మిగిలినదెల్ల యీ వేదికచుట్టు ప్రదక్షిణాపదము దీనిని చుట్టిప్రాయికము 5౹౨ అడుగుల యెత్తుగల యిటికగోడ ప్రాకారముగలదు. ఈ ప్రాకారరేకలో నాలుగువైపుల ఒక్కొక్కటి 14 అడుగుల వెడల్పుగల 14 ద్వారములున్నవి. వీనికి పునాదులు మాత్రమే మిగిలియుండుటచేత ఎట్లుండెడివో తెలిసికొన సాధ్యముగాదు. మొత్తముమీఁద నీ నిర్మాణము బౌద్ధ ధర్మచక్రము, నమూనామీద కట్టబడినట్లు తోచుచున్నది. ప్రాకారరేకచక్రము ప్రదక్షిణీమార్గము, ఆకులవర్తినీవేదిక, చక్రపు నడిగుబ్బ యీ స్థూపము నుత్తరభాగమున త్రవ్వగా

పగిలిపోయిన యొక కొండలో రజితకరండమును బుద్ధధాతువు కనబడినది. ఇది బుద్ధునిదేయని తలచుచున్నారు.

ఇది బఠాణీ గింజంత పరిమాణము. ఒకచిన్న యెముకము దీనిని ముప్పాతిక అంగుళము వ్యాసముగల ఒక బంగారు భరిణలో పెట్టి మరల నాభరిణను బంగారు పువ్వులు ముత్యములు మొదలయిన వానితో కలిపి స్తూపాకారమున నున్న యొక రజితకరండమున నుంచి పదిల పరచినారు. కుండలో నున్నది యీ రజితకరండమే దానికి దెబ్బతగుల కుండునటుల కుండనిండ ఎఱ్ఱమట్టిపోసి గట్టిచేసి దాని మూతి దగ్గర స్ఫటికపు పూసలను గుచ్చినారు. ఈ విధముగ భద్ర పరచినను, కుండయు రజిత కరండము భగ్నమైనవి. కొంత కాలము క్రిందట పూర్వము మృగదానము విలసిల్లిన సారనాధ్ క్షేత్రమును నేటి బౌద్ధులు మూలగంధ కుటీవిహారము నిర్మించి ప్రవేశోత్సవము జరిపిరి. అచ్చట బౌద్ధభిక్షు సంఘమునకు హిందూదేశ ప్రభుత్వ పురాతత్త్వ శాఖవారు యీ నాగార్జునుని కొండ మహాచైత్యమున దొరికిన బుద్ధధాతువును దానము చేసినారు. ఈ విధమున ఇప్పటికి రమారమి 16 వందల సంవత్సరములకు పూర్వము ఇక్ష్వాకు వంశ్యభూపతుల రాజ్య కాలమున ఇచ్చటి మహాచైత్యమున నిక్షిప్తమైన బుద్ధ భగవానుని ధాతుశకలము నేటికిని సారనాధ్ మూల గంధ కుటీవిహారమున పదిలమునయుండి పూజలందుకొను చున్నది.

క్రీ॥ శ॥ 1927—28—29 సంవత్సరములలో నీ ప్రాంత మున జరిగిన త్రవ్వ పనివలన 3 సంఘారామములును 6చైత్యాలయములును, అనేక స్థూపములు బయట పడినవి. బౌద్ధభిక్షువులు నివశించు ప్రదేశమును సంఘారామ మందురు. సంఘారామములు 3 లో 2 నల్లరాళ్ల బోడిమీాదనున్నవి. మూడవది నల్లరాళ్ల బోడుకు పడమటగా దాదాపు మైలు దూరమున నదికెదురుగా నున్న కొండపైన నున్నది. ఇచ్చట స్థూపములన్నిటిని ఇటికలతో కట్టినారు. స్థూపవేదికల ముందు భాగమున వివిధములైన శిల్పచిత్రములు శిలాఫలక ములను చేర్చి సున్నముతో నతికినారు. సుందరములైన యిట్టి శిల్పఫలకము 100 కు పైగా దొరికినవి. ఈ ఫలకము మీాద శిల్పకళ అంతయు ఇదివరలో చెప్పినట్లు అమరావతీ కళా సాంప్రదాయము అనుసరించినదే. ఇట్టిశిల్ప ఫలకములే కాక గొప్ప చెక్కడపు పనిలో ముద్దుల మూటగట్టు శిలా స్తంభములు మొదలగునవి కూడ దొరికినవి. ఈ శిల్పసంపద నంతను అచ్చటనే యొక చిత్రవస్తు ప్రదర్శన శాలనుంచి భద్రపరిచినారు. సాధారణముగా స్థూపపు రాళ్లమీాద చెక్కు చిత్రములు బుద్ధుని జీవితమునకు సంబంధించిన గాధలో బుద్ధుని పూర్వ జన్మమునకు సంబంధించిన గాధలో నయి యుండును. బుద్ధుని పూర్వ జన్మమునకు సంబంధించిన గాధ లకు జాతక కథలందురు.

అమరావతీ నాగార్జునికొండపు స్థూపపు కళాసాంప్ర దాయమే - జావా, యవద్వీపమునందలి జగత్ప్రసిద్ధమైన

బోరాబోదూరు స్థూప శిల్ప కృతులలో కానవచ్చునని చెప్పుదురు.

అమరావతీ నాగార్జునునికొండ స్థూపములందలి బౌద్ధ కళ ప్రాబల్యముగ బర్మా జావా మొదలగు సమీప ప్రాగ్దేశ ద్వీపములందలి కళమీఁదనేకాక, చీనాదేశ కళమీద కూడ నుండినట్లు తెలియుచున్నది.



# విజయనగరము

ఏ నగరము స్వదేశస్థులకేకాక విదేశస్థులకు గూడ నబ్బురపాటు చెందించినదో, ఏది పండితులకు కవులకు, గాయకులకు, నర్తకురాండ్రకు, లలితకళలకు నాలవాలమై నిత్య కళ్యాణము పచ్చతోరణముగానున్నదో, ఏది సాటిలేని మేటి వీరులకు స్థానమై విస్తారము కీర్తిచెందినదో, ఏది పాడిపంటలకు సర్వసుఖములకు కాణాచియైనదో, ఏది మహారసజ్ఞులకు నిలయమైనదో, ఏది ఆంధ్రతేజము, ఆంధ్ర రక్తమున్నంతికాలము, ఆంధ్రభాష, ఉన్నంతకాలము స్మరణగలిగియుండునో; అదియే విజయనగర సామ్రాజ్యము. అదియే విద్యానగరము. సర్వసంపదలకాటపట్టు. ధర్మనీతివర్తనకు రాణ. నేడు విజయనగర జీర్ణశిథిలాలను జూచి నాడు దాని ప్రాభవమునుగాంచి కన్నీరు విడువని యాంధ్రుడుండడు—వాని శిల్పకళా వైభవము, పండిత కవిపోషణ చరిత్రలో బంగారుటక్షరములలో వ్రాయదగియున్నది. ఆ నాఁడాంధ్రుల ఉన్నతస్థితి, కళాపోషణ తలంచిన ప్రతి ఆంధ్రుడు హృదయముప్పొంగి గర్వింపక మానడు. నేటి యీ దౌర్భాగ్య కళావ్యాప్తినిగాంచి రసజ్ఞుడైన యాంధ్రుని కన్నీరు చిమ్మలై చిడుపలై తరంగములై ప్రవహింపకపోవు. ఆనాటి ఆంధ్రులయుగమే స్వర్ణయుగము. రత్నయుగము - వజ్రాలయుగము.

బళ్ళారిజిల్లా హోసపేటకు ఉత్తరమున తుంగభద్రా నదీతీరమున హంపియను గ్రామముకలదు. ఆ గ్రామమునకు

తూర్పు దక్షిణ పశ్చిమముల పెక్కు మైళ్ళవరకును గనబడు జీర్ణ విజయనగర చిహ్నములనుగాంచి విషాదము నొందని యాంధ్రుఁడుండఁడు. విజయనగర రాజ్యమును క్రీ॥ శ॥ 1336 వ సంవత్సరము హరిహరరాయలు బుక్కరాయలు అను నిరు పురు సోదరులు విద్యారణ్యుల యాదేశమున స్థాపించిరి. సమస్త విద్యలకు నిలయమగుటవలనను విద్యానగరమనియు నందలి ప్రభువులు సతతము విజయమునుగాంచి సామ్రాజ్య మును వృద్ధిగాంచుటచే దీనికి విజయనగరమని పేరుగాంచెను. విజయనగర సామ్రాజ్యమును మొదట సంగమ, నాళువ, తుళువ వంశపురాజులు రాజ్యమును 230 సంవత్సరములు పరిపాలించిరి. తుళువ వంశీయులలో ముఖ్యుడగు శ్రీకృష్ణ దేవరాయల కాలమున నీ విద్యానగరము మహోన్నతదశ నందెను. ఈ మహావీరుఁడు అసమాన వీరుఁడు. బాహు బల పరాక్రమోపేతుడు. పండితుడు. కవి. ఈ కాలముననే విజయనగరము విదేశస్థుల గౌరవాభిమానములను పొందినది. ఈ విజయనగరమున ప్రథమున హరిహరుడు బుక్కరాయలు వేటకుపోగా నచట వేటకుక్కలను కుందేళ్లు తరిమినవి. అది చూచి వారు ఆశ్చర్యమునుచెంది యా సమీపమున తపస్సు చేసికొను విద్యారణ్యస్వామివారి కీ విషయమును దెలుపగా, నచట మహాత్మ్యము గలదని, వెంటనే యా స్థలమున రాజధాని నగరమును నిర్మింపుమని యాదేశించెను. అంతట వారొక శుభముహూర్తమున రాజధాని నగరమును స్థాపించి పరిపాలించి యభివృద్ధిచేసిరి. విద్యారణ్యులపేరిట స్థాపింపబడిన దగుటచే విజయనగరమని విఖ్యాతినందినది.

విజయనగరమునకు ఉత్తరమున శరవేగముతో బారులు దీరియున్న పర్వతపంక్తుల నడుమ తుంగభద్రానది మెలికలు దిరిగి ప్రవహింపుచున్నది. దాని కుత్తర పర్వతపంక్తిలో రామాయణ కాలమునుండియు ప్రసిద్ధములగు ఋష్యమూకము మున్నగు నెత్తైన కొండలుకలవు. వానిని దాటిన పర్వతపంక్తుల నడుమ సంపాసరోవరముగలదు. దగ్గరన విజయనగరమును విస్మరింపజేయు చున్నదోయన శిథిలమగుచున్న కోటయు నానెగొందియను గ్రామముగలవు. తుంగభద్రానది దక్షిణతీరమున నొకదిశన హేమకూట పర్వతము, మరియొక వైపు మతంగమాల్యవంతములు కలవు. అచ్చట నుండి హోసపేట ప్రాంతమునకు సుమారిరువది మైళ్ళమేర నాగులపురము వఱకును వ్యాపించి యున్నవి.

నాసలా పురమును, శ్రీరాయలు తన యుంపుడుకత్తె పేర నిర్మించెనట. కాని యాపురమును తన తల్లియగు నాగాంబిక పేర నిర్మించెననుటయే సమంజసము. ఈ పురమునకు దక్షిణమున నెత్తైన పర్వత పంక్తులుగలవు. వానికడ్డముగ నొక దుర్లంఘ్యమగు నడ్డకట్టును శ్రీకృష్ణరాయులు కట్టించి దక్షిణమునుండి శత్రువులు వచ్చెడి మార్గమును గూడ నరికట్టెను. శ్రీకృష్ణరాయలకాలమునకు ముందే విదేశయాత్రీకులు, నికలస్ కొంటి, అబ్దుల్ రజాకు అను నిరువురు విదేశయాత్రీకులు విజయ నగరమునకు వచ్చి దాని వైభవమును గాంచి విస్మయపడిరి. అప్పటికి విజయనగరము సకల సంపదలతోను, సాటిలేని మేటి పట్టణముగ నున్నది.

శ్రీరాయల రాజ్యము త్తరమున కృష్ణానది మొదలు కన్యాకుమారి వఱకు వ్యాపించి యుండెను. జనసంఖ్య విస్తార ముగనుండెను. ఆపట్టణముచుట్టును ప్త ప్రాకారములును, దుర్గములును కలవు. ఆప్రాకారములు కనుమల కడ్డముగ కొండకొనల వరకు కృష్ణశిలలతో నిర్మించి యుండెను. అందు పర్వతాకారములు గలిగిన వేయి యేనుగులు, పదునొకండు లక్షల సైన్యముండెను. మొదటి దుర్గముచుట్టును నిలువెత్తుగలరాళ్లు గుఱ్ఱములుగాని భటులుగాని నడుచుటకు వీలు లేకుండునటుల భూమిలో సగమువఱకు పాత బడియున్నవి. అచ్చటి మూడవ దుర్గము వఱకు సాగుచేసిన పొలములును, గృహములు, ఉద్యానవనములు, ఫలవృక్షములతో నిండియుండెను. ఆ తరువాత యేడవ దుర్గమువఱకు నసంఖ్యానీకములగు జనసంఘములు గలిగిన బజారులతో నిండియుండెను. సప్తమ దుర్గమున రాజమందిరము లుండెను. దానికెదుట బారులుదీర్చి నాలుగు బజారులు ఉత్తరమున రాజమందిర ద్వార మంటపమును గలవు.

రాజమందిరము వెనుక దంత నాయకుని మందిరమును దాని కెడమ వైపున రాజసౌధమున కెడమ భాగమును దివానుఖానయు దాని కెదురుగ సభామండపమును గలవు. సభామండపమున మంత్రి లేక దండనాయకుడో ప్రజల విజ్ఞాపనములను దీర్పుల నిచ్చుచుండెను అతని నిర్ణయమునకు పై తీర్పులేదు. ఆ సభాగృహము చివర చోపుదారుల వరుస దీరియుండును. దండనాయకుడు తనతీర్పు నిచ్చిన [illegible] సప్తద్వారములను గడచి రాజ ప్రాసాదమునకు పోవు [illegible]

వృత్తాంతముల రాజునకు వినిపింపు చుండును. దివాన్‌ఖానకు ఎదుర నేనుగన కొక్క గదియుండు నటుల గజశాల నిర్మింప బడెను. టంకసాలకెదుట నగర పాలకుని గృహము గలదు. ఆ నగర పాలకునికి లోబడి 1½ వేల భటులుండిరి.

పట్టణమునగల వీథులన్నియు విశాలముగను పొడవుగ నుండును. అన్నిచోట్లను గులాబీపుష్పములు విరివిగ నమ్మ చుండిరి. ఆ దేశపు ప్రజ లా పుష్పములను వదలి బ్రతుక లేరు. అవి వారికి భోజనమువలె ప్రధానమైయుండెను. ఒకే వర్తక మొనరించువారి దుకాణము లొకదానికొకటి చేరువగ నుండెను. బజారులందు నగరవర్తకులు బహిరంగముగ ముత్య ములు, కెంపులు వజ్రములనుగూడ నమ్ముచుండిరి టంక శాలకు వెనుక పదునైదు గజముల వెడల్పును రెండువందల గజముల పొడవునుగల చిన్న బజారుండెను. దాని కిరువైపుల నిండ్లును, విశాలమగు ప్రాంగణమును యందమగు రాళ్ళతో నిర్మించిన ఉన్నతాసనములు గలవు. ఆ యా గృహకుడ్యము లపై చిత్రకళా నైపుణ్యమును దెలుపుచు సింహములు పులులు మున్నగు వన్యమృగములు చిత్రింపబడియున్నవి.

విజయనగరమున అనేక దేవాలయములు నిర్మింపబడి నవి. జైనదేవాలయములుకూడ కొన్ని కలవు. పంపావిరూపా క్షాలయము, హజారరామ కోదండరామాలయములు కృష్ణా లయము విఠలాలయము, మాల్యవంత రఘునాథాలయము ముఖ్యమైనవి. అందుగల శిల్పకళ యద్భుతమై యున్నది. రాజ ప్రాసాదములకు చేరువనున్న హజారరామాలయము,

రాజకుటుంబములవారికై నిర్మింపబడినది. ఈ దేవాలయము చిన్నదైనను కళానైపుణ్య మద్భుతమైనది. ప్రాకారపు గోడలపైన లోపలను బయటను రామాయణ భారతము లందలి ఘట్టములను రాతిపై చెక్కబడి హృదయాకర్షణ మొనర్చుచున్నవి. ముఖమంటపములోని నాలుగు స్తంభము లును స్నిగ్ధమగు నల్లరాతితో నిర్మింపబడియున్నవి. ఆల యము విష్ణ్వాలయమైనను శైవగాథలు విగ్రహములుగూడ చిత్రించబడియున్నవి. కళ్యాణ మంటపమున రామాయణ గాథలు నలుప్రక్కల గోడలపై చెక్కబడియున్నవి. కేవ లము హిందువుల పద్ధతినిగాక మహమ్మదీయుల శిల్పపద్ధతిని గల కట్టడము లనేకములు గలవు.

విరూపాక్షాలయ మార్గమున జూపరులకు భయంకర మైన 22 అడుగుల యెత్తుగల నరసింహవిగ్రహము దాని ప్రక్కన పదునాలుగడుగుల యెత్తునగల శివలింగమును గలవు. అవి యొకేరాతియందు చెక్కబడినవి. నరసింహ విగ్రహమును చెక్కిన దొక బ్రాహ్మణుడనియు నది క్రీ॥ శ॥ 1528 సంవత్సరమున పూర్తికాగా నతనికి కృష్ణరాయలు బహుమాన మొసంగిననియు కథగలదు.

ఆలయములలో పంపావిరూపాక్ష దేవాలయము ప్రాచీనమైనది. విద్యారణ్యస్వామి జ్ఞాపకార్థము హరిహర రాయ లా దేవాలయమును గట్టించెను. భువనేశ్వరీయాలయ మున చాళుక్య శిల్పములు గన్పట్టుటచే నది మిగుల ప్రాచీనమైనదని చెప్పుదురు. తుంగభద్రానదీ తీరమునగల

యాలయములలో వరాహాలయమున నొక మహావరాహ మును, అనంతశయనుని నాలయమున నొక యనంతశయనుని విగ్రహము నొక రాతియందే చెక్కబడియున్నవి. విఠల స్వామి యాలయము క్రీ॥ శ॥ 1513 ప్రాంతమున కృష్ణరాయ లచే ప్రారంభింపబడినది. రాయలు దాని నిర్మాణమునకు పోషణమునకు పెక్కు దానములనిచ్చెను. విఠలస్వామి దేవా లయమున శిల్పకళా నైపుణ్యము మెచ్చుకొనదగియున్నది. ఆ యాలయమందలి కళ్యాణమంటపము రాతిరథము మొదల లగువానియందు గనబడు కళానైపుణ్యము చాతుర్యము మరి నెచ్చటలేదు.

విజయనగర రాజులు జనుల సౌకర్యములకొరకై పెక్కు కాలవలు చెఱువులను త్రవ్వించిరి. కమలాపురము నాగులాపురము మొదలగు ప్రదేశముల పెద్ద తటాకములు త్రవ్వబడినవి. వరి, చెఱకు ఫలవృక్షములు ఉద్యానవనములు రమ్యమగునటుల చేయబడినది. నూతులనుండియు, నదుల నుండియు రాజప్రాసాదమునకు వలయు జలమెత్తుగనున్న రాతితో మలచబడిన కాలువలో ప్రవహించునటుల చేయం బడినది.

శ్రీకృష్ణదేవరాయలు మహావీరుడు, బాహుబల విక్ర మోపేతుడగుటయే కాక మహాకవి మహా పండితుఁడై యుండెను. ఆయన ఆస్థానమున అష్టదిగ్గజములను నెనిమిది మంది కవులుండిరి. రాయలు స్వయముగ ఆముక్తమాల్యద యను మహా ప్రబంధమును రచించెను. ఇదికాక మదాలస

చరిత్రము సత్యావధూ ప్రీణనము, సకల కథాసార సంగ్రహము, జ్ఞాన చింతామణి, రసమంజరియను యితర గ్రంథములను రచించెను. అల్లసానిపెద్దన, నందితిమ్మన, అయ్యలరామభద్రుడు, ధూర్జటి, మాదయగారి మల్లన, పింగళి సూరన, రామరాజ భూషణుడు, తెనాలి రామలింగకవి యను మహాకవులే అష్టదిగ్గజములు.

వీరుగాక రాయల యాస్థానమున నిరంకుశోపాఖ్యానమును రచించిన కందుకూరి రుద్రకవి, రాధా మాధవ కర్తయై కృష్ణరాయల వలన రాధామాధవ బిరుదము నందిన చింతలపాటి ఎల్లనార్యుడును, తాళ్లపాక పెదతిరుమలయ్యయు, చిన్నన్నయు నుండెడివారు. తాళ్లపాకవారు శ్రీ వేంకటేశ్వర స్వామి సన్నిధినుండెడి సుప్రసిద్ధకవి వంశజులై యుండిరి. అందు పెదతిరుమలయ్య నీతిసీస పద్యశతకమును ద్విపదహరివంశమును న్నగు సద్గ్రంథముల రచించెను. చిన్నన్న యనబడు తిరువెంగళ నాథుడును పరమయోగి విలాసము, అష్టమహిషీ కల్యాణము అను ద్విపదప్రబంధముల రచించెను.

అల్లసాని పెద్దనామాత్యుఁడు స్వారోచిష మనుచరిత్రమను మహాప్రబంధమును రచించెను ఈ మహాప్రబంధమును శ్రీకృష్ణదేవరాయలు నంకితమునుగొని ఆంధ్ర కవితా పితామహ అనుబిరుదునొసంగి, కోకటగ్రామా ద్యనేకాగ్రహారములమ్మహాకవి కిచ్చెను. అల్లసాని పెద్దనామాత్యుఁడు శ్రీకృష్ణదేవరాయల నిర్యాణానంతరముకూడ జీవించినటుల తెలియుచున్నది. 'కృష్ణరాయలతో దివికేగలేక బ్రతికియున్నాడ

జీవచ్ఛవంబనగుచు' అని చెప్పికొనినాఁడు. నంది తిమ్మనగారు పారిజాతాపహరణమను మహా ప్రబంధమును రచించినాఁడు. దీనిని రాయలువారు అంకితమునుగొని యమ్మహాకవిని సత్కరించెను. దీనినిగూర్చి యొక కథకలదు.

తిరుమలదేవి మీఁద రాయలవారికి కోపము వచ్చి ఆమె ప్రాసాదమునకు రాకమానివైచెను. అందుకామె దుర పిల్లుచు, తిమ్మనగారితో తన విషాదోదంతమును వెల్లడించెను. అప్పుడా కవిపుంగవుడు ఈ కావ్యమును రచించి రాయల వారికి చదివి వినిపించెనట. అప్పుడు రాయలవారు సిగ్గుపడి తిరుమల దేవికడకుపోయి యామె ననుగ్రహించెను.

తెనాలి రామకృష్ణకవి హాస్యకవి. ఈయనను గూర్చి యనేక చిత్ర విచిత్రములైన కథలు కలవు. ఈ కవిశ్రేష్ఠుడు రచించిన పాండురంగ మహాత్మ్యమురాయలవారికంకిత మొసగ లేదు. శ్రీకృష్ణ దేవరాయలకాలములో మహోన్నత దశనందిన విజయనగరము రామరాజు తల్లికోటయుద్ధా నంతరము పూర్తిగా విధ్వంసమయ్యెను. నేటిజీర్ణ విద్యానగరమున పరి శీలించినచో, ఆ స్నానశాలలు వానికుడ్యపు చిత్రాలు — ఆ శయన మందిరాలు — ఆ సభాభవనాలు నాటిమహా వైభవమునకు ప్రతి బింబములై యాంధ్రుల మనోవీధుల ధ్రువతారవలె వెలుగుచుండుట నిస్సందేహము. ఆనగొంది యొక్క పూర్వ చరిత్రగూడ మనము తెలిసికొందుము.

ఆనగొంది :- ఆనగొంది సంస్థానము తుంగభద్రానదికి ఉత్తరతీరమున నిర్మితమైయుండెను. ఈ రాజులే దక్షిణ తీర

మున వెలసిన విజయనగర నిర్మాణమునకు ముఖ్యకారకులై యుండిరి. విజయనగరము ప్రాముఖ్యమునకువచ్చి ప్రబలిన కొలది ఆనగొంది ప్రాముఖ్యము తగ్గసాగెను. ఆనగొంది యనగా ఏనుగులకోనయని యర్థము దీనినిబట్టి ఆ ప్రాంతము నిబిడారణ్యమనియు ఏనుగు లెక్కువయుండు ప్రాంతమనియు తెలియుచున్నది.

రామాయణ కాలములో నిది కిష్కింధాపుర మిదియే యనియు, శ్రీరామచంద్రుడు సుగ్రీవునితో మైత్రి చేసికొని వానరులను సీతాదేవిని వెదుకుటకొరకు నలుదిక్కులకు పంపినది ఇచ్చటనుండియేయని తెలియుచున్నది. హనుమంతుఁడు సీతాదేవి సందేశమును గొనివచ్చి శ్రీరామునకు వినిపించిన దిచ్చటనేయనియు ఋష్యమూకపర్వత మిచ్చట నుండినదని తెలియుచున్నది. ఈ ఆనగొందిలో దేశీయరాజులు ఏడు వందల సంవత్సరములవరకు రాజ్యము చేసియుండిరి. క్రీ॥ శ॥ 1014 వ సంవత్సరమున ఆనగొందిలో నందుడను రాజు రాజ్యమును జేయసాగెను. ఇతని తరువాత చాళుక్యరాజు 40 సంవత్సరములు పరిపాలించెను ఇతని కుమారుడు బిజ్జలుడు ఆనగొందికి రాజయ్యెను. ఈతని రెండవకుమారుడు విజయధ్వజుఁడు తరువాత రాజయ్యెను. విజయధ్వజుని తరువాత ఆ వంశీయులే పరిపాలించిరి. చివరివాడగు ప్రతాపరాయల కుమారుడగు జంబుకేశ్వరుడు క్రీ॥ శ॥ 1267 వ సంవత్సరములో సింహాసనమెక్కి 37 సంవత్సరములు మహాదక్షతతో పరిపాలించెను. ఇతడు పౌరుషశాలియగుటచే అప్పుడు

నేలుచుండిన మహమ్మదు తుఘుక్‌ను ధిక్కరించి వర్తించు చుండెను. మహమ్మద్ తుగ్లక్ సహింపజాలక ఆనగొందిపై దాడిసలిపి సేనలను పంపించెను. పండ్రెండు సంవత్సరములు ఘోరముగ యుద్ధముజరిగెను.

అయినను జంబుకేశ్వరుడు ఢిల్లీశ్వరునకు లోబడ డయ్యెను. ఇంతలో ఢిల్లీశ్వరుని మేనల్లుడొక ఘోరాపరాధ మునుచేసి మహమ్మదు తుగ్లక్ కోపానలమునబడి మ్రగ్గకుండ తప్పించుకొని జంబుకేశ్వరుని శరణుజొచ్చెను. జంబుకేశ్వ రుడు వాని కభయహస్తమిచ్చెను. జంబుకేశ్వరునిపై యిది వరకే క్రుద్ధుడై యుద్ధం సలుపుచుండిన ఢిల్లీ సుల్తాను ఈ మేన ల్లుని కారణమున మరింత ఆగ్రహావేశుడై ప్రచండ సైన్య మును గూర్చుకొని స్వయముగ నేతెంచి యుద్ధసంరంభమును నడుపనాగెను. కాని జంబుకేశ్వరుని జయించుట కష్టమని యే తలంచెను. అంత నతడు నా మేనల్లుని నా కప్పగించితివా యుద్ధమునుమాని వెడలిపోయెదనని సుల్తాను రాయబారము లను సాగించెను.

శరణాగతత్రాణ బిరుదాంకితుడగు జంబుకేశ్వరుఁడు సుల్తాను రాయబారములను దోసివేసి యుద్ధమును చేయ సాగెను. ప్రచండ సేనాబలముగల మొగల చక్రవర్తితో పోరుట దుర్ఘటమయ్యెను. అపజయము నిక్కమని తెలియ గనే జంబుకేశ్వరుడు తురుష్కుల వాతపడకుండ తన భార్యా పుత్రాదులను తన చేతిమీదుగా నఱికి, ఆ ఖడ్గసహాయముననే రణరంగమునకురికి ఘోరముగ పోరి, వీరశయనమునుపొందెను.

విజయుఁడయి సుల్తాను ఆనగొందిని సర్వనాశనమునుజేసి ఆరుగురను ఖైదీలుగా ఢిల్లీకి తీసికొనిపోయెను వారిలో మంత్రి, కోశాధ్యక్షుఁడు, నలుగురు సరదారులు. మంత్రిపేరు హరిహరరాయలు. కోశాధ్యక్షునిపేరు బుక్కరాయలు. వీరిద్దరు సోదరులు. ఓరుగల్లు కాకతీయ చక్రవర్తియొద్ద గొప్ప ఉద్యోగములోనుండిరి. కాకతీయ సామ్రాజ్య పతనానంతరము ఆనగొంది రాజుదగ్గర చేరిరి.

మహమ్మద్‌తుగ్లక్ ఆనగొందిలో మలిక్ సాహెబ్ అనువానిని పాలకునిగా నియమించి ఢిల్లీకి వెడలిపోయెను. ఆనగొంది రాజ్యప్రజలు జంబుకేశ్వరునియెడ భక్తిభావము గలిగి వానిని దేవునివలె గౌరవింపుచుండిరి. వారు తమ ప్రభువట్లు నాశనముకాగా ప్రతీకారభావముతో మలిక్‌కాఫర్‌పై తిరుగబడిరి. పారతంత్ర్యమునుసహింప లేకుండనున్న యాప్రజలయలజడిమల్లిక్‌ను గడగడ లాడించెను. తాను పెద్ద సంకటములోనున్నట్లు ఢిల్లీకి యతఁడు విన్నవించెను. ఢిల్లీసుల్తాన్ మిక్కిలి నష్టపడి యుండుటచేతను, అలసియుండుటచేతను తిరిగి యుద్ధప్రస్థావనకు భయపడి తన యొద్దచెరలోనున్న యారుగురను చెఱవదిలించి, ఆనగొంది రాజ్యమునకు మంత్రిగానున్న హరిహరరాయలను రాజుగాచేసి తనకు సామంతుడుగ నుండునట్టులనేర్పరచి, బుక్కరాయలను మంత్రిగ నియమించి మిగిలిన నలుగురను సేనాపతులుగనుంచి యచటకు పంపెను.

హరిహరరాయలు, బుక్కరాయలు అనువార లిద్దరు ఆనగొంది రాజ్యమునకు రాజు మంత్రియు నయిరి. ఈ సోద

రులే శ్రీమాధవ విద్యారణ్యస్వాముల వారి తపోబల సహాయముతో క్రీ॥ శ॥ 1336 లో విజయనగరమును స్థాపించిరి. విజయనగర సామ్రాజ్యము క్రీ॥ శ॥ 1565 లో తాళికోట యుద్ధమున నాశనము కాగానే విజయనగరమును కొల్లగొట్టుటయేకాక ఆనగొందినికూడ కొల్ల గొట్టిరి. మిక్కిలి విధ్వంసమును చేసిరి. అప్పుడు విజయనగరరాజ వంశీయుడగు రామరాయల తమ్ములు తిరుమలరాయడు, పెనుగొండలోను, వెంకటరాయలు చంద్రగిరిలోను రాజ్య స్థాపనమును జేసికొనిరి. చంద్రగిరి నేలుచుండిన చంద్రగిరిరాయల వారే క్రీ॥ శ॥ 1639 లో ఈస్టిండియా కంపెనీ వారికి మద్రాసు ప్రాంతమును ఇచ్చియుండిరి. క్రీ॥ శ॥ '653 లో చంద్రగిరిని గోలకొండ నవాబులు జయించిరి. ఇప్పుడీ రాజవంశీయునకు ఆనగొంది యొక్కటియే మిగిలిపోయెను. క్రీ॥ శ॥ 1688 లో గోలుకొండ మొగలుల స్వాధీనమైన తరువాత ఆనగొంది మొగలుల సామంతరాజ్యమయ్యెను. క్రీ॥ శ॥ 1776 లో టిప్పుసుల్తాను ఆనగొంది నాక్రమించినప్పుడు రాజ్యమును చేయుచున్న తిమ్మప్పరాజును సింహాసన భ్రష్టునిచేసెను. అంతటితో నాగక మందిరములను కూలదోసి పట్టణమును దగ్ధమును చేసెను. ఇట్టి దారుణకార్యముల మూలకముగ విజయనగర రాజవంశములకు సంబంధించిన అమూల్యలేఖనములు నశించిపోయెను. టిప్పుసుల్తాను యుద్ధమునందోడి మరణించిన తరువాత బ్రిటీషు ప్రభుత్వమువారు ఆనగొంది రాజవంశీయుని గద్దెపై నెక్కించి, ఆ రాజునకు 1500 రూపాయలు మాసిక

భృతిని నేర్పరిచిరి. ఇప్పుడు దీనికి శ్రీ రాజా శ్రీకృష్ణదేవ రాయలవారు ప్రకాశమానులుగానున్నారు. వీరు విజయ నగర సామ్రాజ్య కడపటి చక్రవర్తియగు రామరాయల వంశీయులయియున్నారు. ఆనగొంది నగరమును పదునారవ శతాబ్ద ప్రారంభములో నరసింగరాయలవారు పాలించు చుండిరి. నరసింగరాయలువారు పట్టణమునకు ప్రాకారకుడ్య ములు నిర్మించి దుర్గమును బలిష్ఠమొనరించిరి.

వాయవ్యదిశనుండు కోటగోడ ఒక మైలు పొడ వుండును. ఈ కోటగోడ నొరసికొనియే తుంగభద్రానది ప్రవహింపుచుండును. అయితే యీ కోటగోడ శిథిలావస్థ యందున్నది. ఒక విదేశయాత్రికుడు ఆనగొందిని చూచి యిటుల వర్ణించినాడు! రాజ్యము చిన్నదైనను పరిపాలన కట్టుదిట్టముగనున్నది. పట్టణవీధులు పరిశుభ్రముగా నున్నవి. ఇందు నిర్మింపబడిన సౌధములన్నియు నెత్తుగా నందముగా నున్నవి. పాడిపంటలు సమృద్ధిగానున్నవి. పాలకులుకూడ న్యాయమూర్తులై ప్రజలను కన్నబిడ్డలవలె చూచుచుండిరి. జంబుకేశ్వరుని పరిపాలననుచూచి యాత్రీకు లత్యంతాశ్చర్య మును పొందుచుండెడివారు. అతిథిఅభ్యాగతులకు వలయు సౌకర్యము లేర్పరుపబడియుండెడివి. రహదారి సౌకర్యము విషయములోను నీరు సరఫరాచేయుటకు కాలువలు త్రవ్వుట యందు మిక్కిలి శ్రద్ధవూనియుండెను. తరువాత హరిహర బుక్కరాయలు కాలమున అన్నివిధముల ఆనగొంది కీర్తి చెందినది.

156

# అ మ రా వ తి

క్రీస్తుశకము మొదటి శతాబ్దములో ఆంధ్రరాజులు రాజ్యము చేయుచుండిన కాలమున బౌద్ధమతము ఆంధ్రదేశమున విరివిగా వ్యాపించి యుండెను. దానంజేసి నాడు తెలుగు దేశమున బౌద్ధులు విరివిగా వ్యాపించి యుండిరి. అనేక సంఘారామములు, గుహాలయములు, స్థూపములు చాల వెలసియున్నవి. పురాతత్త్వ శాఖవారి కృషివలననే కృష్ణానదీతీర ప్రదేశమునందలి అమరావతి, జగ్గయ్యపేట, ఘంటసాల, గుమ్మడిదుర్రు, భట్టిప్రోలు మున్నగు స్థలము లన్నియును బౌద్ధమునకు సంబంధించిన నిర్మాణ శిల్పావశేషములు కలిగియున్నవని తెలియుచున్నది. పైనిచెప్పిన స్థలము లన్నిటిలో నొక్క యమరావతిలో మాత్రమే గొప్ప బౌద్ధస్థూప నిర్మాణావశేష సంపదలభించినది. దానిని బట్టియే బౌద్ధము వ్యాపించిననాడు ఆంధ్రులు శిల్పకళా రచనమున అసమానులని తెలియుచున్నది.

భారతీయ బౌద్ధకళా చరిత్రమున అమరావతి ది ఒక గొప్ప ప్రకరణము. బౌద్ధయుగమునాటి భక్తితత్పరులై బుద్ధభగవానుని కర్పించిన శిల్ప నీరాజనము అమరావతీ స్థూపము. బౌద్ధాంధ్రుల శిల్పచిత్ర రచనమున కొంత విశిష్టత చూపి అమరావతీ స్థూపమునకు కీర్తిదెచ్చిరి. బౌద్ధయుగమునందలి ఆంధ్ర సంస్కృతికి అమరావతి అపూర్వ మణి

దర్పణము. చిత్ర వ్యాఖ్యానము. ఆంధ్రశిల్పకళా కుశలతబట్టి భారతీయ బౌద్ధకళాసాంప్రదాయ మొకటి యేర్పడి కీర్తిగాంచినది. అంతియకాదు అది ఆనాడు వర్ధిల్లిన బౌద్ధకళా సాంప్రదాయములన్నిటిలో ఉత్తమ మైనది, ఉత్కృష్టమైనదని పేరు గాంచినది. వస్తువేది చిత్రింపవలసి వచ్చినను అందు బౌద్ధయుగమునాటి యాంధ్రశిల్పి అద్భుతప్రతిభ, అసమాన ప్రజ్ఞ చూపినాడన్న కీర్తి గడించినాడు.

బౌద్ధయుగమున కృష్ణానదీతీరమున పరివ్యాప్తమైన కళా సాంప్రదాయము అమరావతిదే. బౌద్ధాంధ్ర శిల్పులందరు అమరావతీ శిల్పరీతినే వరవడిగపెట్టుకొని తమ కళారచనము సాగించినారు. మొన్న మొన్నటివఱకు బౌద్ధకళకు ఆంధ్రులు చెప్పుకొని గర్వింపదగిన ఉదాహరణము ఒక్క అమరావతియే కనబడినది.

అమరావతి గుంటూరునకు సుమారు 20 మైళ్ళ దూరమున నుండును. ఇది పవిత్ర క్షేత్రముకూడ. ఇందు అమరేశ్వరస్వామి ఆలయముకలదు. ఈ దేవాలయమును రాజా వేంకటాద్రినాయుడు నిర్మించెను.

అమరేశ్వరస్వామిలింగము చాలఎత్తున నుండును. దేవాలయమందు శివలింగమింత యెత్తుననుండదు. ఈఅమరావతిని పాలించిన రాజా వేంకటాద్రినాయుడుగారు 999 గ్రామములను పరిపాలించెను. ఆకాలమున అమరావతీ సర్వకళలకు నిలయమై యుండెడిది. ఆయన ప్రజారంజకుడైన ప్రభువు. కవులను పోషించెను. పండితులకు అనేకాగ్రహారము లిచ్చెను. అనేక

గ్రామములందు దేవాలయములను నిర్మించెను. ఈ ప్రభువు ముఖ్యముగా బ్రహ్మాలయమును గుంటూరునకు 8 మైళ్ళ దూరమునగల చేబ్రోలు గ్రామమున స్థాపించెను. ఇందుల కొక కథ కలదు. ఆ గ్రామమున గల శిలాశాసనము నందిట్లు వ్రాయబడినది.

శ్రీ వెంకటాద్రి నాయుడుగారు రాజ్యము చేయు చున్నప్పుడు చెంచువాం డ్రనేకులు గ్రామముల మీదబడి దోచుకొన చొచ్చిరి. వారిబాధ ప్రజలకు కంటకముగా నుండెను. ప్రజలెల్లరు నాయుడుగారితో విన్నవించుకొనిరి. నాయుడుగా రప్పుడు వారి కభయమిచ్చి వారందరకు భోజన ములు ఏర్పాట్లు చేయుచున్నట్లు వారికి తెలియపరచెను. వారి నొక్కొక్కరిని బావిగలిగిన చీకటిగదిలోనికి పంపెను. వా రొక్కరొక్కరేపోయి యా నూతిలోబడి మరణించిరి.

నాయుడుగారు ప్రజలకా దుండగీండ్రబాధ తప్పెనని సంతశిల్లెను. పిదప నా ప్రభువు భోజనమునకు పోగానే అన్న మంతయు పురుగులుగామారెను. అందుల కతండు విచారించి పండితుల పిలిపించి యడిగెను. వారు చెంచులను చంపినందు లకు ఫలితముగా నట్లయ్యెనని తెలిపిరి. ఆ పాపము నశించు టకు 101 గుడి 101 బావి త్రవ్వించమని, బ్రహ్మాలయమును నిర్మించమని చెప్పిరి. వెంటనే నాయుడుగారు చేబ్రోలులోనే 101 గుడిని 101 బావిని బ్రహ్మాలయమును స్థాపించెను. ఇప్పటి కా గ్రామమునందు కొన్ని దేవాలయములుగలవు. అమరేశ్వరస్వామి ఆలయంగూడ నిర్మించిన దీయనయే.

ఈ పవిత్ర దేవాలయమునకు సమీపముననే కృష్ణ వేణీనది ప్రవహింపుచుండును. దేవాలయప్రాగణమున రాజా వేంకటాద్రినాయడుగారి శిలావిగ్రహము కలదు.

బౌద్ధస్తూప హర్మ్య నిర్మాణాదికముల ననుసరించినదే బౌద్ధ శిల్పకళ. ఆంధ్రదేశమున బౌద్ధ వర్ణికా చిత్రకళ కుదాహరణములు మృగ్యములైన స్థూపగుహాలయములు భగ్నావశేషములకు మాత్రము కొరతలేదు. బుద్ధుని సిద్ధాంతోపదేశమునకు బౌద్ధకళకునుగల సంబంధ మెంతవరకన్నది ఇంకను విమర్శనీయమే యయినను బుద్ధుని అహింసాతత్త్వమే, బుద్ధుని జీవకారుణ్యామే, బౌద్ధకళా నిష్ణాతలకు జీవగఱ్ఱయై వారి హృదయములను ద్రవింపచేసినది. ఆనాటి బౌద్ధశిల్పుల రస హృదయమే బౌద్ధకళగా జాలువారినది. బౌద్ధకళ యందలి ప్రత్యంశమును ఉదాత్తవస్తువుతో కూడినది. ప్రసన్నకథాలలితము, కరుణారసాత్మకము, త్యాగధన విశిష్టము. బుద్ధుడు మూర్తీభవించిన కరుణాంస స్వభావము. బుద్ధుని పురాతన, అధునాతన చరితము ప్రతి వస్తువునందు మిళితమైఉన్నది. బుద్ధునిబోధ దివ్యసందేశ గర్భితమైనది. దుఃఖానల సంతప్తమైన లోకమునకు అది చల్లని యమృత సేచనమయి దానికి సౌఖ్యానందప్రదమైనది.

బుద్ధుని జన్మము, బుద్ధుని విద్యాభ్యాసము, వివాహము, బుద్ధుని త్యాగము ఆ లోకములో, ఈ లోకములో అత్యద్భుతగాథలై శిల్పుల హృదయాలు ద్రవించిపోయినవి. చీకటిలో తడువులాడుకొనుచు యాతనానుభవించు అంధలోకము

హృదయమును బుద్ధుడు త్తేజపరచినటుల నెవ్వరు లేదన్న అది సత్యమారము కానేరదు—

కాని బౌద్ధము దేశమున బాగుగ వ్యాపించినది నిర్వాణమునొందిన తరువాతనే — మౌర్యవంశజుడైన అశోకవర్ధనుడు అభిమానాదరములవలన అంతవరకు మగధ హద్దుల దాటకుండ ఒక స్థానిక మతసాంప్రదాయముగనే ఉండిపోయిన బౌద్ధము అంతటనుండి ప్రపంచమతమైనది. బౌద్ధ మాంధ్ర దేశమున ప్రవేశించినదికూడ అశోకవర్ధనుని కాలముననే. మౌర్య అశోకవర్ధనుని మరణానంతరమున బౌద్ధమునకు మగధ రాజ్యమున ఆదరప్రాపకములు సన్నగిల్లినవి.

బౌద్ధమత చిహ్నములుగా వెలసిన శిల్పావశేషములు అమరావతి మున్నగు స్థలములందు భద్రముగానున్నవి.

అమరావతిలోనున్న అమరేశ్వరస్వామిని దర్శించుటకు దేవతలుకూడ వచ్చెడవారని ప్రతీతి. రాజా వేంకటాద్రి నాయడుగారు పరిపాలించుకాలములో నీ యమరావతి సకల సంపదలతోను వెలసియుండెడిది. నాయుడుగారు గొప్ప పరాక్రమశాలి క్రీ॥ శ॥ 1600 సంవత్సరమున చోళరాజు అరణ్యమునకు వేటాడుటకయి పోయెను. ఆ రాజచ్చట వేటాడి ఒక మారేడు చెట్టుక్రింద కూర్చుండెను. అతడు భూమిపైని కాలువేయుచుండగ నచ్చట శివలింగము కనబడెనట. అతడు వెంటనే యా లింగమును బయటకు దీయించి యొక మహా దేవాలయమును నిర్మించి యందు ప్రతిష్ఠించెను. పిదప నతడు తన రాజధానిని నచ్చటకుమార్చి కోటను నిర్మించుకొనెను.

అతనికి జయుడు, విజయుడు అను నిరువురు కుమారులు కలరు. వేంకటాద్రినాయుడుగారు ఆ రాజ్యమును స్వాధీనము చేసుకొన సేనను తరలించి ఆ కోటను ముట్టడించెను. ఉభయ సేనలకు ముమ్మరముగ యుద్ధము సాగెను. ఆ యుద్ధమునందు నాయుడు సంపూర్ణ విజయమును పొందెను. తన విజయ శాసనములను జయప్రోలున నాటెను. ఆయన పరిపాలించుకాలమున ప్రజలెట్టి కష్టములను పొందక సుఖములను పొందిరి. నాయుడుగారు విద్వాంసులను పోషించెను. కవులకు అగ్రహారములిచ్చెను—తన పాపపరిహారార్థమై కాశీ మున్నగు పవిత్ర క్షేత్రములందు శివాలయములను నిర్మించెను.

ఆధునిక కాలమున అమరావతీస్థూపము పేరు ప్రతిష్ఠలు అందలి శిల్పచిత్రములవలన దిగంత విశ్రాంతము లయినవి. ఆంధ్రులకు కీర్తి సముపార్జించిపెట్టిన యీ స్థూపము వ్యాకృతినిగూర్చి తెలిసికొన వలయును. ఇంచుమించుగ వృత్తాకారముగల పెద్దవేదిక తదుపరితలమున అర్ధగోళాకారముగల యండము, దానిమీాద హర్మిక, దానిపైని కేతన విరాజితమైన దండాంచిత ఛత్రము—ఈ యంగములతో గూడిన సంపూర్ణ నిర్మాణమే ధాన్యకటక చైత్యమని అమరావతీ స్థూపమని కీర్తి చెందినది.

వేదికమీాద అండనిర్మాణమునకు నాలుగువైపుల యందును 'ఆయక' స్తంభములనుపేర అయిదేసి స్తంభము లుండును. ఈ స్తంభములమీాద వెలుపటివైపు దిగువ భాగమున పద్మ అశ్వ బోధివృక్ష ధర్మచక్ర స్థూపచిత్రములుండును.

అమరావతి భట్టిప్రోలు, జగ్గయ్యపేట, ఘంటసాల స్థూపము లందు మాత్రమేకాని ఉత్తర హిందూస్థానమందలి ఏ స్థూపములందును ఇవి కానరాకపోవుటచేత 'ఆయక' స్తంభ ప్రతిష్ఠాపనము ఆంధ్రదేశమునందలి బౌద్ధస్థూపముల విశిష్ఠ లక్షణమని సిద్ధాంతమైనది.

వేదికను చుట్టును భక్తులు ప్రదక్షిణమును చేయుటకు శ్రీ నిధియనుపేర ప్రదక్షిణవీధి యుండును. ఈ వీధి నావరించి నిలువురాతి కంబములతోను, వీనిలోని కెడనెడ నడ్డముగ జొనిపిన అడ్డకమ్ములతోను నిర్మించిన శిలాప్రాకారము గలదు. ఆర్యనాగార్జున నిర్మితమని కీర్తిచెందిన ప్రాకారరేఖ యిదియే. ప్రాకారరేఖయందలి శిలాస్తంభోపరితలమున అడ్డ దూలములో నుదురువలె నేర్పడిన భాగమునకు 'ఉష్ణిష' మని పేరు. సూచీస్తంభోష్ణీవములు అతి మనోహరమైన దివ్య చిత్ర సంపదతో నొప్పారినవి. ప్రాకారరేఖయందు నాలుగు దిక్కుల నాలుగు ద్వారములు కలవు. మాయాదేవి స్వప్నము బుద్ధుని జననము, మహాభినిష్క్రమణము, మృగదావమందలి బుద్ధుని మొదటి ధర్మబోధ, మారప్రలోభము, బుద్ధధాత్వా రాధనము లనెడి బుద్ధవృత్తములు బౌద్ధులకు ప్రియతమము లగుటనేమోయని అమరావతీ చైత్య శిలాఫలకముల పలు మారు చిత్రితములైనవి.

చలువరాతిమీద చిత్రింపబడిన యీ శిల్పసంపదను సూక్ష్మముగ పరిశీలించినచో బౌద్ధయుగమునాటి చతురు లయిన యాంధ్ర శిల్పకళావిశారదులచేతిలో ఆ చలువరాయి

తన కాఠిన్యమంతయు వీడి తీర్చిదిద్దినటుల చక్కనగు మయి నపుముద్దగా మారినదని తోపకమానదు. ఆంధ్రుల ఆచార వ్యవహారములు, దుస్తులు, ఆభరణములు మున్నగువాని గూర్చి సవిస్తరముగ తెలిసికొనుటకు అమరావతి పెన్నిధి వంటిది.



# ఆ లం పు ర ము

ఆంధ్రదేశమునందు చారిత్రకముగ, మత విషయకముగ మిన్నయైన కీర్తినిఁగన్న వైభవ సంపన్నములైన పురములెన్నో యున్నవి. అందు అలంపుర మొకటి. ఇది రాయచూరు జిల్లాలోఁగలదు. తుంగభద్రా నదీతీరముననున్నది. ఈ పురము పవిత్రక్షేత్రమయిన శ్రీశైలమునకుఁ బశ్చిమద్వారముగ నుండును. ఈ పురము దాదాపు రెండు మూఁడువేల సంవత్సరములకు ముందు నిర్మించి యుండవచ్చును. ఇందు జోగులాంబయను దేవ్యాలయ మిప్పటి కతిప్రసిద్ధమైయున్నది. దీనినిఁ బ్రథమమున యల్లమ్మపురము అని పిలువఁబడుచుండెడిది. ఆ పేరు రానురాను ఆలంపురమైనదని వాదమున్నది. ఈ పుర మొకప్పుడతి విస్తారముగ నభివృద్ధిఁజెందుట చూచి యొక మునీశ్వరుడు 'ఆలంపురీ' అన్నాడట. అనగాపురమా! యికవద్దు. అనగానిక ప్రవృద్ధి వద్దు అని యర్థము అమ్మాటతో నప్పురమభివృద్ధి యాగి పోయినదట. ఇందు బ్రహ్మాలయము గలదు. అందుచే బ్రహ్మపురియని కూడ నామాంతరము కలదు.

ఇన్నగర మిప్పుడు శిథిలమై తొంటి వైభవమును కోల్పోయి కనబడుచుండును. చాళుక్యచక్రవర్తుల సామంతులు అలంపురమును రాజధానిగాఁ జేసికొని పరిపాలింపుచుండిరి. ఈ సామంతరాజులు ఆంధ్రచోడులుగా ఉన్నారు.

చాళుక్యచక్రవర్తి ఆరవ విక్రమాదిత్యుని రాజ్యారంభ కాల మగు క్రీ॥ శ॥ 1026 న పరిపాలించెను. వీరి తరువాత కాక తీయులు, రెడ్లు యీ పురమునకుఁ బాలకులుగ నున్నట్టులుఁ దెలియుచున్నది. క్రీ॥ శ॥ 16 వ శతాబ్దములో బిజ్జలతిమ్మ భూపాలుఁడు ఆలంపురి రాజుగానుండెను. ఈ రాజన్యుఁడు సంస్కృతములో మురారికవి రచించిన అనర్ఘరాఘవ నాటక మును పద్యప్రబంధముగ రచించి ఆంధ్రభాషా చరిత్రలోఁ గీర్తిఁగాంచెను.

ఇందు శిథిలావస్థలోనున్న చారిత్రికాంశములు చిహ్నములనుబట్టి మత విషయకములను గొప్పగా వెల్లడి జేయఁగలవు. ఇచ్చట సుమారొక చదరపు మైలు వైశాల్య ముగల యొక కోటగలదు. ఇట శివునకు బ్రహ్మేశ్వరుడను నామము గలదు. ఇట్టి నామముగల శివాలయములు మరె చ్చటను అంతగా కనబడవు. ఈ కోటలో, దుంగభద్రకు దగ్గరగా నుత్తర దక్షిణపు వరుసగా బాల, కుమార, వీర, విశ్వ తారక, గరుడ, అర్క, స్వర్ణ, పద్మ, బ్రహ్మేశ్వరు లనబడు నవ బ్రహ్మేశ్వరుల దేవాలయము లోకరీతి నత్యంత శిల్పకళా వైభవముతో నొప్పుచుండును. కొంచెమేని సున్నమునుపయో గించక రాలనుమలచి తొలిచి యీ యాలయములను గట్టి యుండిరి. వీనిపై శిల్ప విన్యాసములను గలుగుచుండెడి లతలు, పుష్పములు, విగ్రహములు, కన్నులపండువగా చెక్క బడి నవి. వీనిని నెవరో దుర్మార్గులు నాశనము చేసిరి. ఈ దేవా లయ శిఖరములు పిరమిడులవలె జతురాకారముగ వెలసి,

ఘనమైన వేరువిధమైన శిల్ప చాతుర్యముగల శిఖరములతో బరివృతమై యొప్పుచుండును. నవ బ్రహ్మేశ్వరులలో బాల బ్రహ్మేశ్వరుఁడు మాత్రము కళావంతుఁడై, యాత్రికుల కిప్పటికి దర్శన యోగ్యుఁడుగ నున్నాడు. ఈ లింగము శిలగాదు. లక్క రుద్రాక్ష మున్నగు వానితోఁ గప్పఁబడియున్నట్లు తోచుచున్నది. ఇది జ్యోతిర్లింగమని కీర్తి చెందియున్నది. ఇందొక విచిత్రముగలదు. ఇందెన్ని వేలకడవలతో నభిషేకము చేసినను, నొక్క చుక్క అయినను బయటకు రాదు. ఎక్కడికిఁబోవునో తెలియదు. బాలబ్రహ్మేశ్వరుల క్షే తపు ప్రధానదైవము. ఈ దేవాలయ సింహద్వారము ముందటి సోపానముల మీఁదినుండియే తుంగభద్రానది ప్రవహింపుచు బాల బ్రహ్మేశ్వరులకుఁ బాదాభివందన మొనరించినటు లుండును.

భారతదేశము నందత్యంత ప్రసిద్ధక్షేత్రమైన కాశీలో వలెనే యిచ్చటను మణికర్ణికా ఘట్టము, పాపనాశన ఘట్టము హరిశ్చంద్ర ఘట్టము. మున్నగు నరువదినాలుగు ఘట్టములు కలవు. ఇట కోటిలింగము లున్నవట. ఇప్పటి దాదాపు 100 దేవాలయములు కలవు కాశీలో మరణము దుర్లభము. కాని యిచ్చట నివాసము దుర్లభము. హతంపురమను నామమునుబట్టి యీ పురము శాపగ్రస్తమయి యుండవచ్చును. శివభక్తు లెచ్చటెచ్చటనుండియో యిచ్చటికివచ్చి దేవుని సేవించుకొని పోవుచుందురు.

ఆలంపురములోని దేవాలయములలో జోగులాంబ యాలయము పేరొందఁదగియున్నది. ఈ దేవతనే పురాతన

కాలమునందు 'యల్లమ్మ' అనుచుండిరట. ఈమె ఆదిశక్తి. శ్రీ ఆదిశంకరులు చెప్పిన పదునెనిమిది శక్తిపీఠములలో నిది యొకటియైయున్నది. కంచికామాక్షి మధురమీనాక్షి, కాశీవిశాలక్షి మున్నగు శక్తి స్వరూపిణులతో సమానమైనట్టి దీ జోగులాంబ. ఈ పరాశక్తి విగ్రహము మిక్కిలి భయంకరమైనది. నగ్నత్వమున శిరోవిహీనముగ రేణుకాదేవి విగ్రహము కలదు.

ఈ యాలయముల నొక రససిద్ధుఁడు నిర్మించెననియు, శిల్పులకుఁ బనివాం(డకు నొసగవలసిన భృతికిఁ దుంగభద్ర లోని యిసుకను బ్రోవుచేసికొమ్మని, యా కుప్పలపయిఁ బసరును బిందువాఁడనియు అటులఁజేయఁగా నెవ్వ రెవ్వ రెంత శ్రమయొనర్చిరో యందులకుం దగినటులఁ గాంచనము లభించెడిదట. అతఁ డీ విధముగ దేవాలయములను గట్టించి, ప్రతిష్ఠసలిపి, తన పేరితో నొక విగ్రహమును చేయించి యుంచినాఁడని, యందొక విగ్రహమును చూపించుచున్నారు. ప్రదక్షిణ మొనర్చుటకు అనువైన ఆలయాంతర్భాగమున గర్భాలయపు గోడలో రససిద్ధనాయకుడని గణపతి విగ్రహము కలదు. దీని నాలయము గట్టించి నరసస్థిద్ధు డిసుకతోఁబసరుల బలమున నిర్మించెనని తెలియుచున్నది. స్పృశించిన మాత్ర మున నిసుకగరాలు నీ విగ్రహము స్వయం వ్యక్తమని తోఁచును.

గ్రామమునకు మధ్యభాగమున సూర్యనారాయణ దేవాలయముకలదు. ఆలయ పై భాగమున అష్టదిక్పాలులు

వాహనారూఢుడయి యున్నటులఁ దోచును. దీని ప్రక్కన దశావతారములు చిత్రింపఁబడి యున్నవి. వాని క్రింద వృక్షముక్రింద గౌతమబుద్ధుడు కాబోలు బోధింపుచున్నట్లు చిత్రింపబడినది.

దక్షిణము వైపున నరసింహాలయముకలదు. ఇందలి ఉత్సవ విగ్రహములును నరసింహ విగ్రహమును దివ్య సుందరాతి సుందరములైనవి ఇచ్చట కోటగోడలోనుండి 4-5 మోటల నీటిప్రవాహ మొకటి తూర్పుగా తుంగభద్రలోఁ బడుచున్నది. ఇది యెచ్చటఁబుట్టినదో గ్రహించుటకు వీలు లేదు. ఇందలి నీరు కొబ్బరి పాలనుబోలి నిర్మలముగ నుండును.

కోటకు నుత్తరముగ మూఁడు నాలుగుమైళ్ళ వరకు తుంగభద్ర నదియొడ్డునఁ బెద్ద గ్రామముగానుండి శిథిలమైన చిహ్నములు కనఁబడుచుండును. అందందు నాలయపు టడుగు ప్రదేశములు, ఆలయశల్యములు, నందులు, లింగములు కనఁబడుచుండును. బ్రహ్మేశ్వరాలయమునకు మైలు దూరమున దక్షిణముగ వివిధ విగ్రహముల మధ్య రాక్షసముఖముతో నొక విగ్రహము నిలిచియున్నది. దీనిని గురివింజ మాధవుఁడని యందురు. ఈ స్వామి యొకచేత వడ్లుల్లును బట్టికొని కాలి క్రింద నొక యగ్నిగుండమును గలిగియున్నాఁడు. కాశీ క్షేత్రముకన్న వడ్లుల్లంతఁ దక్కువ ప్రభావముగల దీ ప్రదేశమనువారిని నగ్నిగుండమున పడద్రోసి త్రొక్కెదనని చూపింపుచున్నాఁడఁట. గ్రామ మధ్యమందు బాలబ్రహ్మేశ్వరుని

ఆలయమునను రెండు పెద్ద సాలంకాయనలింగములు 196 లింగములతో నొప్పుచున్నవి. మహిషాసుర మర్దనీ యాలయము, వేంకటేశ్వరాలయము, కామాక్షి ఆలయము, వీరభద్రస్వామి ఆలయము, జోగులాంబ దేవి ఆలయము, వీరభద్రస్వామి యాలయము, అనునవి పూజాదులను గలిగియున్నవి. కోటగోడ కుపయోగించిన రాళ్లలో ననేకములు బౌద్ధ, జైన చిహ్నములుగలిగియున్నవి. సూర్యనారాయణాలయ సమీపమున నొకరు వృక్షము క్రింద బోధింపు చుండినటుల నున్నది. ఆ బోధింపుచుండినది బుద్ధదేవుఁడేమోయను నటులఁగనబడును. ఇట పెక్కు వీరగల్లులు కలవు. వీరగల్లులనగా వీరుల స్వరూపములు చెక్కిన శిలలు వీనిపైఁ గొన్ని యక్షరములు చెక్కబడియున్నవి. ఈ వీరులు రణరంగమున వీరశయనము నొందినవారుగా నున్నారు. ఇప్పురమునఁ బెక్కు శాసనములు గలవు. ఈ యలంపురము మన పూర్వుల ధర్మచింతన విస్తారమునకు, వితరణశీల ప్రదర్శనమునకును, కళాసౌందర్య లాలసత్వము నకు నిదర్శనముగా నున్నదనుట నిస్సందేహము.

# గోలకొండ

ఏది ఆంధ్రమంత్రుల కాలవాలమై వారి రాజనీతి దురంధరత్వము దశదిశల బ్రకాసిల్లి, రాజ్యచక్రమును వక్రముగా నడుపగల్గినదో, ఏది ఆంధ్రకవులకు గాణాచియై వారి కవితా గానమున నుప్పొంగిపోయినదో, ఏది యాంధ్రభక్తులకు స్థానమై వారి భక్తిపారవశ్యమున నుప్పొంగిపోయినదో, ఏది ఆంధ్రభూమి గర్భస్తమణి గోలకొండ వజ్రముగా ప్రసిద్ధికెక్కి విరాజిల్లినదో యదియే గోలకొండ పట్టణము. ఇది హైదరాబాదునకు ఎనిమిదిమైళ్ళ దూరమున నున్నది. ఇందు గల కోటను ఓరుగల్లు రాజగు కన్నయ్యనాయుఁడనువాడు క్రీ॥ శ॥ 1364 లో బహుమనీ రాజుల కైవశమును చేసెను. బహుమనీ రాజ్యపు సుబేదారుగ 1417 లో నీ ప్రాంతమంతయు స్వాతంత్రమును ప్రకటించిన సుల్తాన్ కులీకుతుబ్ షాకు నిది వశమయ్యెను. (క్రీ॥ శ॥ 14[illegible]2) కుతుబ్ షాలలో నైదవవాఁడగు మహమ్మద్ కులీకుతుబ్ షాహ తన భోగకాంత పేర భాగ్యనగరమును మూసీనది యొడ్డున క్రీ॥ శ॥ 1589 సంవత్సరమున గట్టించెను. ఆనాటినుండి దీని ప్రాభవము తగ్గసాగెను.

కుతుబ్ షాహి వంశములో ఏడవవాఁడైన అబుల్ హాసన్ తానీషా 1687 లో పదభ్రష్టుడయి ఔరంగజేబుచేత చెరబట్టబడగానే గోలకొండదుర్గము దుర్గతిని జెందెను. తరు

వాత నిది మొగలుచక్రవర్తి ప్రతినిధిగా నిచ్చటికివచ్చి స్వతంత్రుడయిన అసఫ్‌జా నిజాముల్కు స్వాధీనమయ్యెను.

రాజుగానుండి కొలువుదీర్చెడి కోటకు గోలకొండ యనిపేరు. రాజ్యమునకిదియే పేరుకలదు. ప్రథమ కుతుబ్ షాహ దానికాపేరుపెట్టెను. తాను స్వతంత్రుడయిన తరువాత బలీయమైన దుర్గము నొకదానిని నిర్మింపవలెనని యోగ్యప్రదేశమును పరిశోధింపు చుండగా నిప్పుడు కోటయున్న ప్రదేశమును నొకగొల్లవాఁడు తెలిపియుండెను. ఈగొల్లవాడాయనను అరణ్యముగుండ నొకగుట్టయొద్దకు గొనిపోయెను. ఇటనే యిప్పుడు రాజప్రాసాదమున్నది. తన మనోవాంఛితమునకు నా ప్రదేశము చాల యోగ్యమయినదిగా కనబడినందున అచ్చట కోటగట్టి దానికి గోలకొండయని పేరుపెట్టెను. దీనినిబట్టి యీ దుర్గమునకు గొల్లవానికిగల సంబంధము విశదమగుచున్నది. తరువాత కథాంశమునుబట్టి యూహించినచో నాగొల్లవాని కోరికప్రకారము సుల్తాన్ కులీ కుతుబ్ షాహ గొల్లకొండ అని పేరుపెట్టి యుండవచ్చును. ఆ గొల్లకొండయే అపభ్రంశముగా గోలకొండగా మారి యుండవచ్చును. క్రీ॥ శ॥ 1517 సంవత్సర ప్రాంతములో నిది జరిగి యుండవచ్చును. ఈ గొల్లవాఁడు సామాన్యుడు గాక మహాత్ముఁడని మనము భావింపవలసి యున్నది. ఇట్టి వానికి కులీకుతుబ్ షాహ గోలకొండకు మహమ్మదు నగరమని పేరు పెట్టినాఁడు. ఆ నామ మంతగా నిలువకపోయినను నప చారమే జరిగినది. ఆ అపచార ఫలితముగా సుల్తాన్ గోల

కొండలోని మసీదులో వంగి నమాజు చేయుచుండఁగా, కుమారుడగు జెంషడ్ కులీకుతుబుషాహ ప్రోత్సాహమువ దుర్గపాలకునిచే క్రీ॥ శ॥ 1543 సంవత్సరమున వధింపఁబడెను.

గోలుకొండకు మానుగల్లు అను పేరుండెను. కుతుబ్ షాహి రాజ్యకాలములో హిందూస్థాన పరిస్థితులు చాల వల్ల కల్లోలముగా నుండెను. యుద్ధభయము మెండుగానుండెను. అందుచే నతఁడు గోలుకొండ కోటకు ఉత్తరమందున్న సీన కమ్మల గుట్టలయొద్ద కోటనుగట్టి గోలుకొండ కోటకుఁ గల్పు టకు సంకల్పించి క్రీ॥ శ॥ 1557 లో ప్రయత్నించెను. కాని విఫలుడయ్యెను. తరువాత మహమ్మదు కులీకుతుబ్ షాహ అబ్దుల్లా కుతుబ్ షాహ ప్రయత్నించిరి. కాని గొల్లవానికి జేసిన యపచారము ఫలితముగా విఫలులైరి.

అబ్దుల్లా కుతుబ్ షాహ నిరాశచెంది తన ధార్మిక గురు వైన సయ్యదుషా ముక్తసాహెబ్ కాదరిగారితో చెప్పు కొనెను. అంత నతని యాదేశప్రకారముగా ధనగురు కొండ య్యను పిలిపించి యతని పూజించి "మహాశయా! మేము ఖిల్లాను నిర్మించుట కెంత ప్రయత్నించినను బూడిద బోయు పన్నీరగుచున్నది. మీ వంశీకులు భోనగిరిఖిల్లా, వరంగల్ ఖిల్లా కట్టియున్నారు. అందుచేత మీకుఁ గూడ నందుఁ బ్రతిభ యుండి యుండును. కాన మాకు నిర్మించుటకుఁ దోడ్పడఁ గోరెద" నని కోరెను.

అందుల కతఁడు సమ్మతించి కొండయ్యపేరుతో ఖర నామ సంవత్సర భాద్రపద శు ౫ శుక్రవారము ౧౩ రాత్రికి ప్రారంభించి (1651) వ సంవత్సరమునాటికి యావత్తు కిల్లాను నిర్మించినాడు. ఇదియే కొత్తకోట ఇది గోలకొండకు నీశాన్య భాగమున ఠ340 గజముల పొడవు గలిగి కీలక ప్రదేశమగు గుట్టకు నానుకొని యున్నది.

కోట నిర్మాణమునకు నవసరమగు ధనమును సమకూర్చిన యీ దౌలతునుగూర్చికూడ విచిత్రమైన కథగలదు. గోకులదాసు అనునామముగల యొక సాధువరణ్యములో దపము చేసి కొనుచుండెను. అయ్యరణ్యములో మేకలను మేపుకొనుచున్న యొక గొల్లవాఁడు భక్తిభావముతో నతనికిఁ బాలనర్పించి సేవించుచుండెను. ఆ గొల్లవానికిఁ దనయందు భక్తిభావము బాగుగాఁ గుదిరినదని గాఢముగ గ్రహించిన తరువాత గోకులదాసు ఒక పెద్దకళాయిలో నూనె పోసి, బాగుగాఁగాగబెట్టి, గొల్లవానిని దానిచుట్టు ముమ్మారులు ప్రదిక్షణము చేయు మనెనట. గొల్లవాఁడా సాధువు చెప్పినటుల గావింపుచుండగా నాత డీతని బట్టికొని సలసల గాగుచున్న నూనెలో బడవేయుటకు బ్రయత్నించెను. గొల్లవాడది గ్రహించి కోపించి యాసాధువును బట్టుకొని నూనెలో బడవేసెను. అంత నాశ్చర్యముగ సాధు గోకులదాసు బంగారు విగ్రహమై కాగులో నిలిచియుండెనట. గొల్లవాఁడు భయాక్రాంతచిత్తుఁడై యావిగ్రహమును సమీపమందున్న నూతిలో బడవేసెనట. ఇది గోలకొండ జిల్లాలో నున్నది. ఎంతో

కాలముక్రింద జరిగిన యీబంగారువిగ్రహ గాథను కొండయ్య తెలిసికొనియుండెను. అంత అబ్దుల్లా కుతుబ్ షా ఆ బంగారు విగ్రహమును బావిలోనుండి బయటకు దీయించి, తద్ధనమును గోట నిర్మాణమునకు వ్యయించినాడు. భోనగిరికోట విషయములో భోనయ్య అను గొల్లవాని పేరుతో నిది నిర్మింపబడినది. గొల్లకొండ అనగా గొల్లవాడు చూపిన కొండయని యర్థము.

అబ్దుల్లా కుతుబ్ షాహ ధనగరు కొండయ్య చేసిన మహోపకారమునకు సంతశించి వీరులక్ష్మీ సంపన్నులు కాన మనకోరిక లీడేర్చి మనల గృతార్థులం జేసినారు. వీరితోనే మన గద్దెయున్నది. అనికృతజ్ఞతా సూచకముగాబలికి యతనిని గొల్లలకు గురువుగా నేర్పాటుజేసి పెక్కుహక్కులను, ఇనాములనునిచ్చి యతనిని సంతృప్తి బరచెను. గోలకొండ సింహాసన మేసుల్తాను పరిపాలించి నప్పటికి మా వారి యాశీర్వాచనము పొందవలయును అటుల 'బొందనిచో సర్వనాశనము గాగల'రని కొండయ్య శాసించెను.

గోలకొండ మూడు కోటలును నొకదాని కొకటి చుట్టుకొని యొకటి కట్టబడినది. ఈ కోటను బెంపుచేయుటలో బలపరుచటలో, కుతుబ్ సాహి సుల్తానులు మిక్కిలి పాటుబడిరి. దీనిచుట్టుగల గోడను మొదటి నిజాము నిర్మించెను. దీనిచుట్టును పెట్టని కోటగోడలవలె గుట్టల వరుసగలదు. వీని మధ్యన 400 అడుగుల యెత్తునగల కొండ గలదు. ఈ

పర్వతోపరి భాగముననే రాజసౌధములుండెను. దీని ఆకారము వంకర టింకరుగా నుండును. కోటగోడల కైవారము 3 మైళ్ళ కంటె నెక్కువగా నుండును. 3 అడుగుల పొడవు నంతియే వెడల్పునుగల నల్లరాతితో గోడలుగట్ట బడినవి. దీనికి 87 బురుజులుగలవు. దీనికెనిమిది ద్వారములు గలవు. బంజారా, నయాఖిల్లా, జామాలియను మూడును వాయవ్యదిశయం దున్నవి. ఫత్తే, మోతేయను రెండును తూర్పుదిశయందు న్నవి. బామ్నియనునది దక్షిణ దిశయందున్నది. వీనిలో జుమాలీ, దర్వాజా యను నాలుగు మాత్రమే నాడుకలో నున్నవి. పర్వత శిఖరముననున్న రాజభవనమునకు బాలా హిస్సారు అను పేరు. దీని వైపు పోవు విశాలమార్గమున కిరు దిశల యుద్ధమునం దుపయోగించిన ఫిరంగిగుండ్లు వందల కొలఁది కనబడును. మేడలు, దేవాలయములు, మసీదులు, మందుకొట్లుల సేనానివాసములు, అంగళ్లు అన్నియుఁ గనబడు చుండును.

ఫత్తేదర్వాజాకు షుమారు 1/4 మైలు దూరమున దక్షిణ దిక్కునకుఁబోవు నొకరాచబాట గలదు. ఈ మార్గము లందలి యుద్యానవనములను దాటినచో నవమహలు అను పేరంబరగు కొన్ని మందిరములు గనబడును. బాలాహిస్సా రునకుఁబోవు దర్వాజాకు కుడివైపున గొంచెము దూరమున జామా మసీదు కలదు.

కోట యున్నత ప్రదేశమంతయు శిథిలములైన ఆ..ముధ శాలలు, మందుకొట్లు, మసీదులు, రాణివాసములు, ..హార

ములు, జలాశయములు, ధాన్యపుగదులు, సభామందిరములు మున్నగువానితో నిండియున్నది. బాలాహిస్సారుకుఁబోవు ద్వారముమీాద గరుడపక్షి సింహము మున్నగు మృగముల చిత్రములు కలవు. దీని యెడమ వైపున మూడంతస్థుల మేడ గలదు. ఇది సీలాఖానాయను పేరుగల ఆయుధాగారము. ఇందు బూర్వము వాడిన తుపాకులు గలవు. సిలాఖానాకు దక్షిణముగా సుదూరమున దారామతి, భాగమతి యను నామములుగల హిందూరాణివాస స్త్రీల భవన శిధిలములు గలవు. శైలముపైకి నెక్కుచుండగా నెడమవైపు నొకపెద్ద బావి గలదు. దీనినే గోకులదాసు బావి యనెదరు. ఆ కాలమున నీ బావియే పానోదకమును లభింపజేయుచుండెను.

ఇంకముందు పోగా అంబరుఖానాయను ధనాగారము కనబడును. దీనికి పైన నొక చిన్న మసీదు, దానికి సమీాపమున హిందువుల దేవాలయ మొక గుహాలోగలదు. ఇందే మాదన్న మంత్రి దేవతాపూజ చేయుచుండెడివాడట—

ఇచ్చటకు దాపుగా నొక కారాగారము గలదు. ఇందే పరమభక్తాగ్రగణ్యుడగు భద్రాచల రామదాసును బంధించిన పరమపవిత్ర ప్రదేశము. బాలాహిస్సారు ప్రాకారము ద్వారము దాటఁగానే యంగణమున్నది. దీనికి నెడమ వైపున న్యాయశాల గలదు. దీని యందొక మూలలో జిన్నద్వారము గలదు. ఇది 5 మైళ్ళ దూరమునందున్న గోషామహాలునకు బోవు సొరంగమార్గము. దీనికి రెండు దిశల మెట్లుగలవు. వాని సధి

రోహించి డాబామీఁదికి పోయినచో నటనుండి చుట్టును 30 మైళ్ళ దూరము వరకును కంటికి గనబడును. పడమట దిక్కున క్రిందికి దిగగా రాజవంశీయుల రాజకీయోద్యోగుల పరివారపు శిథిలములు, గోలకొండ నవాబుల సమాధులు గలవు.

ఒకనాడిది వర్తక వ్యాపారములకు, విద్యావిలాసములకు, వైభవములకు, వీరవిహారములకు, పెండ్లి పేరంటములకు స్థానమై యుండెడిది. కాని యవి యన్నియు గాలగర్భమున నణగిపోయి యీ కోట ప్రస్తుతము నామమాత్రావశిష్టమై మిగిలియున్నది.



# ఢిల్లీ

భారతదేశమునందు మిక్కిలి పురాతనమైన చారిత్రిక ప్రసిద్ధమైన గొప్పపట్టణములలో పేరెన్నికగన్నది ఢిల్లీ. ఇది యనేకవేల సంవత్సరములనుండి భారతదేశమునకు రాజధానిగ నున్నది. ద్వాపరయుగాంతమువరకు దీనికి హస్తినాపురమను పేరుతో నుండెడిది. శకుంతలా దుష్యంతులకు జన్మించిన భరతచక్రవర్తి నిర్మించిన దీ నగరము. ఆ భరతచక్రవర్తి ఏకచ్ఛత్రాధిపత్యముగ నీ దేశమును బరిపాలించెను. అందుచేత దీనికి భారతదేశమని పేరుగలిగినది. తరువాత నాతని వంశీయులు హస్తినాపురమునే రాజధానిగనుంచి యీ దేశమును బరిపాలించిరి. భారత ప్రసిద్ధమూర్తులైన కౌరవ పాండవ వంశీయులకుకూడ నిదియే రాజధాని. రానురాను నిది ఢిల్లీగా మారి యాంగ్లేయులకాలమునుండి యిది భారతదేశమునకు రాజధానియైనది.

పాండవులకాలములో దీనికి ఇంద్రప్రస్థమని పేరుకూడ గలదు కాని నేడా యింద్రప్రస్థ చిహ్నములేమియు గనబడవు. కోట శిథిలములు మాత్రము కనబడును. కొందరు దీనిని పాండవులకోటయని చెప్పుదురు. మరికొందరు పృథ్వీరాజు కోటయని యందురు. పాండవుల కాలమునుండి నేటివరకు నీ నగర మనేకపర్యాయములు పతనమునొందియు, మరల నున్నతినొందుచు వచ్చెను. ప్రాచీన చిహ్నములుగ కుతుబ్

మీనారు లోహ స్తంభములు కలవు. ఇవి ప్రస్తుత నగరము నకు 12 మైళ్ళ దూరమునగలవు. ఇది ప్రాచీన భారతవర్ష మందలి కళాకౌశలములు దిఙ్మాత్రముగ బ్రదర్శించి, జనుల కాశ్చర్యమును గలుగజేయును. ఢిల్లీని పఠానులుకూడా బరి పాలించిరి. వారి స్మృతి చిహ్నములు ననేకంబులిందు గనబడు చున్నవి. తుగలకాబాద్ తుగ్లక్ సమాధి, బహలోర్‌లోలి సమాధి, ఫిరోజిషాహీ లోతలిక్ అల్లావుద్దీన్ ఖిల్జీ సమాధి, గయాసుద్దీన్ ఖిల్జీ, ఎర్రకోట సికిందర్ లోడీ సమాధియు గలవు. వీని యపురూప కళాసౌందర్యము లెన్నదగియున్నవి. ఇవి కేవలము స్మృతిచిహ్నల రూపములేకాక, భారతీయ శిల్పకళా నైపుణినిఁ బ్రకటింపుచున్నవి.

తరువాత మొగలు చక్రవర్తులయిన బేబరు, అక్బరు, జహంగీరు, ఔరంగజీబు, షాజహాను మున్నగువారు పరిపాలించిరి. ఆ కాలమున ఢిల్లీ అనన్యసాదృశ్యమగు నౌన్నత్యమున నుండెను. మొగలుల స్మృతిచిహ్నములుగ నేడు లాల్ ఖిల్లా జుమ్మామసీదు, హుమాయూన్ గోరి, నిజాముద్దీన్ గోరి, రోశనార్ గోరి, పతేనాపుర్ మసీదు, చూడఁదగినవి. ఇందు లాల్ ఖిల్లా, జుమ్మామసీదులను షాజహాను కట్టించెను. ఇంక షాజహాన్ నిర్మించిన సుందరతర సౌధములు, దర్బారుదీర్చెడి యందమైన మందిరములు. గోడలు, వానిమీఁద జిత్రింపఁబడిన తీగెలు. పుష్పము లిప్పటికిఁ గన్నుఁ పండువగా నుండు ననుట నిస్సందేహము. ఈ కోటలోపల రంగమహల్, ముత్యాలమసీదు, మొగల్ వస్తుప్రదర్శనశాలగా మార్చఁ

బడిన ముంతాజమహాల్ కళాసౌందర్య ప్రతిభా కాంతులు దిశ లందు వెదజల్లుచుండును.

ఢిల్లీ వైశాల్యము 578 చ. మైళ్ళు. జనాభా 17,43,992. దీని పరిసరములన్నియుఁ బ్రాచీన భారత సామ్రాజ్య శిధిలావశేషములతో నిండియున్నది. దీని దక్షిణభాగమంతయు నదీ మైదానము. ఉత్తరమున కాంగ్రా, కులూ లోయలు కలవు. యమునానది పశ్చిమముగ వీరగడ్డయయిన పంజాబు కలదు. ఈ నదికి తూర్పున, ఉత్తరమున సారవంతమైన మైదానములు కలవు. షాజహాను చక్రవర్తి నిర్మించిన తాజమహాలుగల ఆగ్రా నగరము దీనితీరముననే కలదు.

ఢిల్లీ, సుందరమైన విశాలనగరము ఇచట వీధులు చాల విశాలముగ నుండును. అందు చాందినీచౌకు మిక్కిలి యందముగా నుండును. ఇది భారతవర్షమునకుఁ బ్రధానమైన వ్యాపార కేంద్రము. ఇటు వ్యాపార మధికముగ జరుగుచుండును. వెండి బంగారు నగిషీపని మిక్కిలి మనోహరముగ జేయుదురు ఒకప్పుడిచ్చట రత్నములు, వజ్రములు, రాసిగఁ బోసి విక్రయించెడివారఁట ఢిల్లీకి దక్షిణమున నైఋతి మూలగా హుమాయూన్ సమాధి, తుగ్లకాబాద్ కలవు.

ఢిల్లీలో యమునానది యతి ముఖ్యమైనది. యాత్రీకు లీ నదియందు స్నానమును గావింతురు. ఇచట గౌరీశంకరుఁడు, దావూజీ, యోగమాయ, అంజనేయమందిరములు గలవు.

ఇట టిబ్బి కళాశాల గలదు. ఇందిగ్లీషు వైద్యముల నేర్పుదురు. ఈ కళాశాల అతి ప్రసిద్ధమైనది. నూతనముగ నిర్మించిన క్రొత్త ఢిల్లీలో భవనములు వరుసగా దీర్చిదిద్దిన

యాధునిక నగరనిర్మాణమునకు నిదర్శనములు. ఇందు మధ్య గుంభ్రడముగా నిర్మింపబడిన పార్లమెంటు భవనము, తరువాత నున్న కేంద్రప్రభుత్వ కార్యాలయము, రాష్ట్రపతి భవనము ఇటీవలనే నిర్మింపబడిన లక్ష్మీనారాయణ భవనము గాంధీ మహాత్ముని రాజఘాట్ చూడఁదగినవి. దీనికిఁ దాపుగానే చరిత్రప్రసిద్ధమైన కురుక్షేత్రము గలదు. మహాభారత యుద్ధ క్షేత్రమిదియే. పదునెనిమిది అక్షోణీల సైన్య రక్తనదులు ప్రవహించిన దీ ప్రదేశముననే. భారతవర్ష చరమహానత్య మునుదెల్పు భయంకరరంగ మిదియే - శూరాధిశూరులగు భీష్ముఁడు, కర్ణుడు, ద్రోణుడు మున్నగు వీరశిఖామణు లమరత్వమును బొందిన ప్రదేశమిదియే - ఆనాటి రక్తపాతముచే నేటికిని నీ భూమి ఎరుపెక్కియున్నది. కురుమహారాజు కీర్తి కిదియొక ప్రబలచిహ్నము: అమ్మహారాజర్షి లోక కళ్యాణార్థమై యిచ్చట నింద్రునిఁగూర్చి తపమును గావించెను.

ఇంద్రుఁ డా రాజర్షి తపమునకు మెచ్చి నీ కోరిక యేమని ప్రశ్నించెను. అందుల కా నృపుండు ఈ ప్రదేశమున మరణించినవారికి సద్గతి గలుగునటులఁ బ్రసాదింపుమని ప్రార్థించెను. అందులకా మహేంద్రుఁ డానందించి యటులఁ బ్రసాదించెను. నాటినుండి యీ క్షేత్రము పరమపవిత్రమయ్యెను. ఇందు 3550 అ. పొడవు. 1950 అ. వెడల్పుగల సూర్య కుండము కలదు. ఇందు సూర్యగ్రహణ సమయమున స్నానము గావించినచో ననంతమగు ఫలముగలుగగలదు. దీనిని గూర్చి మహాభారతమునందు సూర్యతీర్థమున స్నానముచేసి

యథావిధిగ దేవతలను బితృదేవతలను బూజించి యుపవాసమునుజేసిన అగ్నిష్టోమ యజ్ఞఫలము లభింపఁగలదు. మరియు మరణానంతరమున సూర్యలోకము పొందగలరని చెప్పఁబడినది. దీనికి సమీపమున గీతాభవనమను నొక ప్రాచీనగ్రంథాలయము గలదు. ఇందనేక పురాతన గ్రంథములుండును. దీనికిఁ బశ్చిమముగా భీష్ముని అంపశయ్య గలదు. ఇది మహావీరుఁడగు భీష్ముఁడు బాణములపై శయనించిన ప్రదేశము. దీనికి సమీపమున బాణగంగా సరోవరము గలదు. బాణములపై శయనించియున్న భీష్మునకు దాహము వేయఁగా నర్జునుని దిశఁజూచెను. అర్జునుఁడు పితామహుని భావమును గురుతించి గాండీవముఁ నెక్కు బెట్టి భీష్మునిశిరస్సునకుసమీపమునఁబృథ్విని భేదించెను. వెంటనే యచటనుండి యొక శీతలధార వెడలెను. భీష్ముఁడా నీరముతో దాహమును దీర్చుకొనెను. అదియే నేటి బాణగంగా సరోవరము.

బాణగంగ అవ్వలియొడ్డునఁ గొంతదూరము నడచిన గురునానక్ మఠముగలదు. దీనికి సమీపమున దృషత్వతీ సరస్వతీ నదులుగలవు. ఈ నది భారతదేశమునందు వివిధ ప్రదేశములందుఁ బ్రవహించి తుదకు పాటియాలా రాజ్యమున దృషత్వతీనదిలో గలియును. ఇచట దాపుగా నొక సరస్సుఁ గలదు. మహాభారతయుద్ధమునఁ గర్ణుఁడుకూడ మరణింపఁగనే దుర్యోధనునకు నిరాశఁగలిగి, యీ సరస్సునందు జలస్తంభన విద్యచే దాఁగికొనెను. పాండవులతని వెదకికొనుచు, వచ్చి దుర్యోధనుఁ డీ సరస్సునందున్నటుల గ్రహించి, యతఁడు

వినుసలుల నిందాలాపములాడఁ దొడఁగిరి. మానధనుఁడైన దుర్యోధనుఁడు వినజాలక బయటకువచ్చి గదాయుద్ధమునకు భీముని నెన్నుకొనెను.

గదాయుద్ధ కౌశలియైన దుర్యోధనునితో భీముకు తూఁగలేకపోయెను. అప్పుడు శ్రీకృష్ణుఁడది గ్రహించి తొడఁజూపెను. పాంచాలీ వస్త్రాపహరణ సందర్భమున దుర్యోధనుఁ డామెను తన తొడమీఁదవచ్చి కూర్చుండమని పలికెను. అదివిని భీముఁడు మండిపడి, కురుపాండవ యుద్ధములో దుర్యోధనుని తొడలు విరుగగొట్టెదనని నాఁడు ప్రతినబూనెను.

భీముఁడు శ్రీకృష్ణుని యాదేశమూలకంబుగఁ దన శపథమును గుర్తుకుఁదెచ్చుకొని యతనినిఁ గూల్చెను. ఆ ప్రదేశముకూడ నిందుఁగలదు. అస్త్రవిద్యాగురువైన ద్రోణుఁడు, ఘటోత్కచుఁడు మృతినొందిన ప్రదేశములిందుఁ గలవు. భారతదేశమందుఁ జారిత్రాత్మక ప్రదేశమిది.

కురుపాండవ యుద్ధారంభమునందు కౌరవ పాండవ సేనలోఁ దనవారినెల్లరఁగాంచి యుద్ధమొనరింపనంచును విల్లు క్రిందఁబెట్టిన పార్థుని, సారథియయిన శ్రీకృష్ణుఁ డతని యవివేకమునకు విస్మితుఁడై, జ్ఞానబోధను గావించి, విశ్వరూపమును దాల్చిన ప్రదేశములిందుఁగలవు. "కురుక్షేత్రం గయాం గంగాం ప్రభాస పుష్కరాణిచ ఏతాని మనసాధ్యాత్వా" అని కలదు.

# మధుర

పౌరాణికముగ, నైతిహాసికముగఁ బ్రసిద్ధిఁజెందిన నగరములలో మధుర మిక్కిలి ప్రసిద్ధమైనది. దీనినిఁగూర్చి స్కాందపురాణమునందు మధుర ధన్యమైనది. వైకుంఠము కన్న గొప్పది. పురుషార్థముచే మనుజుఁడు ప్రవేశించ వచ్చునుగాని శ్రీకృష్ణానుగ్రహము లేనిదే యీ నగరమున నొక్క క్షణమైన నుండజాలడని తెలుపఁబడినది. పూర్వమిట 'మధు' వను దైత్యుని క్రీడోద్యానముండెడిది. శ్రీరామ చంద్రుని సోదరుఁడగు శత్రుఘ్నుఁడు మధుదైత్యునిఁ గూల్చి యీ నగరమును బాలించుటకుఁ దన పుత్రుడయిన సుబాహుని నియోగించెను. కాలాంతమునం దీ నగరము చంద్ర వంశీయుల యధికారములోనికి వచ్చెను.

యదువంశాంతర్గతమగు భోజవంశమునఁ బుట్టిన వార లీ నగరమున చాలకాలము పాలించిరి. ఆ భోజవంశీయుఁడే యుగ్రసేనుఁడు. ఉగ్రసేనుని కుమారుఁడు మిక్కిలి క్రూరుడు. అతడు దన తండ్రిని బంధించి తానే రాజ్యమును జేకొనఁదొడం గెను దేవకీ వసుదేవులకు జన్మించి, యశోదా నందగోపుల యింటఁ బెరిగిన శ్రీకృష్ణుఁ డా కంసుని సంహరించి, ఉగ్ర సేనుని తిరిగి రాజుగఁ జేసెను. పిదప శ్రీకృష్ణుని మునిమనమఁడు మధురానగర సింహాసన మధిష్ఠించెను.

ఈ మధురా నగరమును క్రీ॥ శ॥ 1017 వ సంవత్సరమున మహమ్మద్ గజనీ నాశనమును గావించెను. అటుతర్వాత క్రీ॥ శ॥ 1500 వ సంవత్సరములో సికిందర్ లోడి దీనిని సర్వనాశమును జేసివైచెను. తరువాత క్రీ॥ శ॥ 1669 లో ఔరంగజేబు క్రీ॥ శ॥ 1757 సంవత్సరములో అహమ్మద్ షాహ్ అబ్దాలియును మఱల నీ మధురను బూ_త్తిగా విధ్వంసమును నొనరించిరి. యమునానదికిది దక్షిణతీరమ నఁగలదు. యమున కవ్వలియొడ్డునుండి యిన్నగరమందున్నత శిఖరములతోనొప్పు మందిరములశోభ, ప్రాసాదముల రమణీయత, క్షేత్రఘట్టముల సౌభాగ్యము వీక్షింపఁదగినవి. ఇన్నగరములోనికి వెడలుటకు నాలుగు ద్వారములుగలవు. ఇవి: 1. హోలి దర్వాజా, 2. బృందావనం దర్వాజా, 3. డీగ్ దర్వాజా, 4. భరత్ పూర్ దర్వాజా.

ఈ మధురా నగరమునకు నాలుగుదిక్కుల నాలుగు శైవక్షేత్రములు గలవు. తూర్పున పిప్పలేశ్వరుఁడు దక్షిణమున రంగేశ్వరుఁడు, పశ్చిమమున భూతలేశ్వరుఁడు, ఉత్తరమున గోకర్ణేశ్వరుఁడును గలరు మధురకు నాలుగు దిక్కుల మహదేవుఁడుండుటచే నాతనిని మధురాకాచౌకీదార్ యని అందురు. (మధురరక్షకుఁడు) యమునానదికిఁ జాలఘట్టములు గలవు. అన్నిటియందు విశ్రాంతఘాట్ మిక్కిలి ముఖ్యమైనది. ఇదికాక బంఘాలీఘట్, ధ్రువఘట్, కృష్ణాగంగా ఘట్, సోమతీర్థఘట్, అసీకుండఘట్ మున్నగు ఘట్టములు గలవు. శ్రీకృష్ణపరమాత్మ దుర్మార్గుండు దన మేనమామ

యయిన కంసునిఁగూర్చి యమునానదియొడ్డున నొకచో విశ్రాంతినిఁ దీసికొనెను. అందుచే దీనికి విశ్రాంతిఘాట్ యని పేరు గలిగినది. ఈ నదియొడ్డున ధ్రువుఁడు పినతల్లి యాదేశమున నొక ప్రదేశమునఁదపమాచరించెను. ఆ ప్రదేశమునకు ధ్రువఘాట్ యని పేరుగలిగెను.

మధురా నగరమందు సందుసందున శ్రీకృష్ణ మందిరములు గలవు. ఇందన్ని దేవాలయములందు ద్వారకాధీశు మందిరము మిక్కిలి విశాలమైనది. చాలఁబెద్దది. అతిసుందరమైనది. దీని పొడవు 103 అ. వెడల్పు 120 అ. దీనిని గ్వాలియరు రాజ్యకోశాధ్యక్షుఁడు సేరగోకులదాస్ క్రీ॥ శ॥ 1315 లో నిర్మించెను. దీనికిఁ గొలదిదూరమున గోవర్ధనాదజీ మందిరము కలదు. ఇదికూడ చాల విశాలమైనది. క్రీ॥ శ॥ 1830 లో సేనికా మదూన్ శాపూ నిర్మించెను.. ఇందలి యనల్పమైన శిలాశిల్పము సుందరాతిసుందరమైనది. దీనికి సమీపమున కేశవదేవజీ మందిరముకలదు ఇది చాలా పురాతనమైనది. శ్రీకృష్ణుని మనమఁడగు వజ్రుఁడు కేశవదేవుని స్థాపించెను. కాని ఔరంగజేబు దానిని సర్వనాశనమును గావించి, అందొక మసీదును నిర్మించెను. శ్రీకృష్ణుని జన్మస్థలముకూడ నిదియే. ఇమ్మందిరమునకు వెనుకభాగమునఁబోతే రాకుండముగలదు. శ్రీకృష్ణుఁడు జన్మించినప్పు డీ వస్త్రాదికములిం దుదకఁబడినవి. దీనికి దగ్గరగా శ్రీమన్నారాయణ మందిరముగలదు. ఇచట శ్రీకృష్ణుఁడు రాక్షస సంహారమువలనఁ గలిగిన శ్రమను దీర్చి కొనెను. ఇందు శ్రీకృష్ణవిగ్రహమున కిరువైపుల శ్రీ రాధా

దేవికుబ్జా విగ్రహములు గలవు. ఇవిగాక గోవిందదేవజీ మందిరము, వరాహమందిరములు కలవు.

ఇవికాక జామామసీదు, శివాశ్రమము మ్యూజియము, ఔరంగజేబు మసీదు మున్నగునవి కలవు. ఇవి కళాఖండం బులుగ నిర్మింపఁబడినవి. మధురానగరమునకు నుత్తర భాగ మున, యమునానదీ, దక్షిణతీరమున బృందావనము కలదు. మథురనుండి షుమారు 6 మైళ్ళ దూరమున నిది కలదు. శ్రీకృష్ణభగవానుని దివ్యలీలా విహారస్థాన మీ బృందా వనము. ఇచ్చటి వనములందు, మనోహర నికుంజములందు యమునా పులినతీరములందు గోపబాలురతోఁగూడి, యాతఁ డనేక దివ్యమధురలీలలను గావించెను.

ఆ కాలమున బృందావన మొక వనమాత్రముగ నుండెడిది. 'బృందా' శబ్దమునకు 'తులసి' యని యర్థము. అందుచేఁ బూర్వమిచట తులసి వనముండెడిదని తెలియు చున్నది. ఇట బృందాదేవి మందిరముకలదు. ఆమె తపము నకుఁ బ్రసన్నుఁడై భగవంతుఁ డీ స్థాన మామెపేరఁ జరుగు నటుల వరమిచ్చెనని చెప్పుదురు. బృందావనమునకు సమీప మున నొక బావికలదు. ఇది ఎఱ్ఱరాతితో నిర్మింపఁబడినది. దీనికి దక్షిణమున అక్రూరమందిరము కలదు. భగవానుఁడు మధురకు అక్రూరుని వెంట నరుదెంచుచు, నిట నతనికి విశ్వ రూపమును సందర్శింపఁజేసెను. దీనికి సమీపమున యజ్ఞ పత్నులు భగవంతునికి భోజనమును బెట్టిన స్థానముగలదు.

పూర్వమిందు నొక సుందరమందిరముండెడిది. దానిని ఔరంగ జేబు ధ్వంసమును జేసెను.

ప్రస్తుతము బృందావనము 25 వేల జనాభాగల పట్టణము. ఇందు యమునాస్నానము, తీర్థవిధి, దేవదర్శనము, ప్రదక్షిణము ముఖ్యమైనవి. ఇచట యమునకు 32 ఘట్టములు గలవు. అందు వస్త్రాపహరిణఘట్టము, కాళీయఘట్టము, కేశఘట్టము ముఖ్యములైనవి. బృందావన పరిక్రమణ నాలుగు మైళ్ళు. ఇందు గోవిందదేవజీ మందిరముగలదు. దీనిని మానసింహ మహారాజు క్రీ॥ శ॥ 1520 లో కట్టించెను. ఇది ఎఱ్ఱ రాతితో నిర్మింపఁబడెను. కళాకౌశలము ననుసరించి చూచిన యిట్టి మందిర ముత్తరభారతము నందెచ్చటలేదు. దీనికి శిఖరమునఁ బ్రతిదిన మొక మణుగు నేతితో దీపము వెలుగుచుండెడిది. ఈ దీపకాంతి ఢిల్లికి గనఁబడుచుండెడిది. దీనిఁ గాంచి ఔరంగజేబు కుమారై సైన్యసమేతమై, యిచ్చటకు వచ్చి మందిరమున బ్రవేశింపబోయెను. కాని పూజారు లను మతింపలేదు. అందుచేత నామె కోపించి, మందిరమును నాశనమును జేయించి యమూల్యములయిన వస్తువులను లూటీ చేయించెను. తర్వాత నామె యీ మందిరపు టయిదంతస్థులను గూలద్రోయించెను. దీని తరువాత జెప్పుకొనదగినది గోపీనాథుమందిరము, దీనిని నందకుమారబాబు అను నొక బెంగాలీయువకుఁడు కట్టించెను. దీనికి సమీపమున గల కిశోరమందిరము గలదు. ఇందు శ్రీకృష్ణ బలరాముల విగ్రహములు గలవు. క్రీ॥ శ॥ 1627 లో దీనిని చౌహాన్ వంశీయుఁడు నారకర్ నిర్మించెను.

బృందావనమందలి మందిరము లన్నిటికన్న పెద్దది రంగమందిరము. ఇది తూర్పునుండి పడమరకు 775 అ. పొడవును, ఉత్తరమునుండి దక్షిణమునకు 440 అ. వెడల్పును గలిగియున్నది. దీనికి 15,20 అ. ఎత్తుగల నాల్గు ప్రాకారములుగలవు. నాల్గవ ప్రాకారాంతరమున రాతి స్తంభముల మంటపమున భగవంతుని చతుర్భుజమూర్తి కలదు. క్రీ॥ శ॥ 1351 లో సేఠ్ రాధాకృష్ణ, గోవిందదాసు లనుసోదరులు నిర్మించిరి. తరువాత జెప్పుకొనఁదగినవి బాంకేబిహారి మందిరము, శాహాజీ మందిరము, గిరిధారీ మందిరము, శ్రీ రాధారమణ మందిరము, శ్రీ రాధావల్లభ మందిరము, గోపీశ్వర దేవ మందిరములు గలవు. ఇందు గురుకులము, శ్రీరామకృష్ణ సేవాశ్రమము, ప్రేమ మహావిద్యాలయము కలవు. సహాయతాఫండ్, శ్రీ రాధామాధవఫండ్ అను ప్రజాసేవామందిరములు కలవు. మధురయందును, బృందావనమందును, ననేకోత్సవములు జరుగును.

మధురకు దక్షిణముగా షుమారు 6 మైళ్ళ దూరమున గోకులముకలదు. ఇది యమునానదికి నెడమదిశన గలదు. ఇట నొక మైలుదూరమున యమునా తీరమున మహావనము కలదు. ఈ వనమే ప్రాచీన గోకులము. ఇప్పుడు గోకులమని పిలువబడు స్థానము వల్లభాచార్యునిచే నూతనమున నిర్మింపఁబడెను. మహావనమున నందుఁడు నివశించెను. వసుదేవుఁడు యముననుదాటి బాలకృష్ణు నిచ్చటనే కొనివచ్చెను. శ్రీకృష్ణుఁడు బాల్యమున పూతనాసంహారము, శకటాసురవధ,

తృణావర్త సంహారము, యములార్జునోద్ధరణము మున్నగు దివ్యలీలలను గావించిన దీ ప్రదేశముననే - నందవనమున యశోదానందుల విగ్రహములు, శ్రీకృష్ణుని యూయెల, గాతిపెరుగుకుండ, కవ్వముకాననగును. ఇదికాక శ్రీకృష్ణుడు గోవత్సములను మేపినప్రదేశము, నందుడు పలుదోమినమిట్ట, నందకూపము, పూతనచితి,. 84 స్తంభముల మందిరము, మధురాధిపతి శ్రీకృష్ణుని మందిరములుగలవు. ఇందు ప్రస్తుతము హిందూ మహమ్మదీయులు నివసింపుచుండిరి. గోస్వాముల పీఠము, గోకులనాథ్‌జీ మందిరము లిందుగలవు.

ఇచ్చట ప్రస్తుతము రెండు సంస్కృత పాఠశాలలు, అన్నసత్రము, పోస్టాఫీసు, తంతికార్యాలయములు మున్నగునవి కూడ గలవు.

మహావనమునకు షుమారు 6 మైళ్ళ దూరమున బలదేవపురముగలదు. ఇచ్చట దీనిని రీజా గ్రామమని కూడ బిలుతురు. ఈ గ్రామమతి సుందరమైనది. ఇందు బలరామ మందిరము క్షీరసాగరమున కెదురుగాగలదు. బలరామ విగ్రహము విశాలమైనది. ఈ విగ్రహము సుమారు 7, 8 అ. యెత్తుగలిగియున్నది. దీనికెదుట రేవతీదేవి విగ్రహము కలదు. ఈ రెండు విగ్రహములు రెండును నల్లనిరాతితో నిర్మింపబడినవి. ఇచ్చట పంచదార కలిపిన వెన్నను స్వామికి నివేదనజేయుదురు. శ్రీకృష్ణుడు ధేనుకాసురుని, ప్రలంబాసురుని గూల్చువేళన దన తేజస్సును బలరామునియందు ప్రవేశింపజేసెను. ఆ సమయమం దాయనశరీర మింద్రదనుస్సు...

వలెనయ్యెను. ఆ భావమే ప్రస్తుత విగ్రహమందు గూడ ద్యోతకమగుచుండెను.

ఈ మందిరమున కెదురుగా క్షీరసాగరకుండము గలదు. ఇందు బలదేవుని విగ్రహము వజ్రనాభుడు తయారుచేయించె నట. ఈ విగ్రహము చాలకాలము క్షీరసాగరమందుండెను. ఒక దినమున బలరాముడు కళ్యాణజీ అను బ్రాహ్మణునకు స్వప్నములో గనబడి, క్షీరసాగర కుండమందున్న తన్ను వెలికితీసి ప్రతిష్ఠించుమని చెప్పెను. ఆ బ్రాహ్మణుఁడీ విగ్రహమును వెలికి తీయించి యొక సామాన్యమందిరమును గట్టించెను.

మధురకు బదునారుమైళ్ళ దూరమున గోవర్ధనము గలదు. ఇది భరతపూరు రాజ్యములోనిది. ఇచ్చట గ్రామము గోవర్ధన పర్వతసమీపమున గలదు. ఇట అర్జునసింహ ధర్మశాల, తులారామ్ సాధురామ్ ధర్మశాలలు, కన్యాపాఠశాలగలవు. ఇది గోలోకమందుండి శ్రీకృష్ణు ననన్యభక్తితో సేవింపుచుండెను. త్రేతాయుగమున శ్రీరాముఁడవతరించు నని గ్రహించి, గోవర్ధనము ద్రోణాచలమున కొక శిఖరముగ జన్మించెను. సేతునిర్మాణ సమయమున హనుమంతుఁడీ శిఖరౌన్నత్యమునుగాంచి పెకలించుట కుద్యమించెను. కాని గోవర్ధనము సాలగ్రామమై, నారాయణ స్వరూపమై యుండు టచే గొంచమైనను గదలలేదు. వాయునందనుఁడు నిజమును గ్రహించి శ్రీరాముని పాదసన్నిధికి గొంపోయెను. అప్పు

డతని కటులఁగావించుటచే మిక్కిలి సులభమయ్యెను. శ్రీరామ చంద్రమూర్తి యీ విషయమును గురుతించి 'గోవర్ధనుఁడీఁట కేతెంచిన నా శ్రీకృష్ణ స్వరూపమును గాంచగోరెను. అతని కోర్కెదీర్చిన, మదవతార మర్యాద భంగమగును.' అని తలంచి వానరులతో సేతునిర్మాణము పూర్తియైనది. కావున బర్వతములింక నవసరములేదు. పర్వతములను దెచ్చుటకుఁ బోయిన వానరులతో బర్వతముల నెంతవరకుదెచ్చిన నఁటనే యుంచి తిరిగి రావలసినదిగా ఆజ్ఞాపించెను.

ఆ సమయమున ఆంజనేయుఁడు గోవర్ధనముతో మధురా సమీపమునకు వచ్చెను. ప్రభుని యానతిని విని మారుతి గోవర్ధనముతో మధురా సమీపంబున కరుదెంచెను. అంతట దానినిదించి శ్రీరాముని సన్నిధికివచ్చి గోవర్ధన పర్వతపు వాంఛ నెఱిఁగించెను.

అంతట 'శ్రీరామచంద్రుఁడు' మారుతీ! గోవర్ధనమునకు నా యీ రూపమిష్టముగాదు. ద్వాపరయుగమున నే నాతనికి దర్శన మొసంగుటయేకాక, నా చెలికాండ్రతోఁ గూడి దర్శనమిత్తును. ఏడహోరాత్రము లాతనిని వ్రేలితో ధరింతును. కాన నివ్విషయమాతనితోఁ దెలుపుమని చెప్పెను. వెంటనే ఆంజనేయుఁడీ వార్తను గోవర్ధనునకుఁ దెలిపెను. నాఁటినుండి గోవర్ధనుఁడా పవిత్రదినములు లెక్కించుచు ప్రభుదర్శనముకై యచ్చటనే వేచియుండెను. ద్వాపరయుగమున శ్రీకృష్ణభగవానుఁ డవతరించెను యాదవులు ప్రతి సంవత్సరము మహేంద్రునకు మహోత్సవంబులను గావించు

చుందురు. శ్రీకృష్ణుఁ డా సంవత్సరమున నింద్రునకుఁ బూజ మానిపించి, గోవర్ధన పర్వతమునకుఁ బూజ జేయించెను.

అందుల కింద్రుండు మిక్కిలి కోపగించి వలాహకాది మేఘములను రప్పించి వ్రేపల్లెకు రాళ్ళతోఁగూడిన వర్షమును గురిపింపుమని యాజ్ఞాపించెను. అంతట నమ్మేఘంబు లతిర యంబునఁబోయి భయంకరమైన శిలలతోఁగూడిన వర్షమును వ్రేపల్లెకుఁ గురిపింపఁజొచ్చెను. యావులు, గోపాలకగణము నిలువలేకపోయిరి. ఇండ్లన్నియు నీళ్ళమయమైపోయెను. వారందరు శ్రీకృష్ణభగవానునిఁజేరి తమ్ము గాపాడమని యభ్య ర్థించిరి. అంతట శ్రీకృష్ణుఁడు గోవర్ధనపర్వతమును మదగజము తామరతాడును పెళ్ళగించు విధముగాఁ బెళ్ళగించి తన చిటికెన వ్రేలిపై నిలబెట్టెను. ఏడుదినములు ఘోరముగ, భయంకర ముగ వాన గురిసెను. యాదవులు, గోవులు గోవర్ధన పర్వ తము క్రిందకుఁజేరెను. దేవేంద్రుఁడు గురిపించిన వర్షము వారలకేమాత్రము బాధగలుగకుండఁ జేసెను.

ఈ పరిస్థితినిఁజూచి దేవేంద్రుఁడు సిగ్గుపడి మేఘము లను దిరిగి పిలిపించి వర్షమును నాపెను. తరువాత శ్రీకృష్ణుని కడకుఁజేరి క్షమార్పణఁ గోరుకొనెను. అంతట దేవేంద్రుని శ్రీకృష్ణుఁ డనుగ్రహించి గోవర్ధన పర్వతమునకు శక్తిని బ్రసా దించెను. అప్పర్వతమును బ్రదక్షిణ మొనరించువారికి సర్వ పాపములు హరించుటయేకాక యుత్తమలోకములు లభింపఁ గలవని శ్రీకృష్ణభగవానుఁడు వరమొసంగెను.

అందుచే యాత్రీకులచ్చటకుఁజేరి భక్తితో మమ్మూర్లు ప్రదక్షిణమును గావించి భక్తితో స్తోత్రమును గావించుచుం దురు. అట్టి మహిమోపేతమైన దీ పర్వతము. ఆ కాలము నం దీ పర్వతము మిక్కిలి యెత్తుగా నుండెడిది. కలియుగము వృద్ధియైనకొలఁది యీ పర్వతము క్రమక్రమముగ భూమి లోనికి దిగిపోవుచున్నదని తెలిపెదరు. దీనియెత్తు 100 అడుగు లకు మించియుండదు. దీనినిఁ బూజ్యభావముగఁ జూచు చుండెదరు.

గోవర్ధన గ్రామమందు మానసీగంగయను సుందర సరోవరముగలదు. దీనికి మూఁడువైపుల సుందర మందిర ములు గలవు. ఇఁట గోవర్ధన దేవాలయముకలదు. ఇచ్చట లక్ష్మీనారాయణస్వామి మందిరము కలదు. మరియు నిఁట భరతపూరు రాజవారి మంటపములు ధర్మశాలలు గలవు.

గోవర్ధమునకు వృషభానుపురము షుమారు 7 క్రోసుల దూరమునఁగలదు. ఈ గ్రామ మొక మెట్టప్రదేశమునఁ గలదు. మార్గము చాల బాధాకరముగ నుండును. ఇది శ్రీకృష్ణుని యధ్యాత్మిక భక్తురాలగు రాధాదేవి జన్మ స్థానము. ఇఁట రాధాదేవి మందిరముకలదు.

రాధాదేవి జన్మవృత్తాంతము :-

గోలోకమునందు భగవదవతార మూర్తులయిన రాధా కృష్ణులు గలరు. వారి దాంపత్యమత్యంత ప్రశంసనీయమైనది. ఒకనాఁడు యమునయను రాధాదేవి సఖురాలు శ్రీకృష్ణుని సౌందర్యమునుజూచి విభ్రాంతిపడెను. రాధాదేవి అది

గ్రహించి యీర్ష్యగలిగి, కోపించి నీవు శ్రీకృష్ణుని ప్రేమదృక్కులతోఁ జూచితివికాన భూలోకమందు నదివై జన్మించుమని శపించెను. అంతట శ్రీకృష్ణుఁ డదివిని రాధాదేవితో నీ వేయీర్ష్యతో యమునను శపించినావో, దానితోనే భూలోకమందు జన్మింతువుకాక. అయినప్పటికి మీ రిరువురు నాకు నత్యంత ప్రేమపాత్రులగుదురుగాక'' అని రాధాదేవిని శపించెను. అంత నా రాధాదేవి భూలోకమున వృషభానునింట జన్మించెను. యమున భూలోకమున నదిగా జన్మించి పరమ పవిత్ర నదియయ్యెను.

ఈ పర్వతమునీఁదకు మందిరమువరకు సోపానము లున్నవి. ఈ పర్వతమును బ్రహ్మస్వరూపముగ భావింతురు. దీనికి నాలుగు శిఖరములున్నవి. దిగువభాగమున గ్రామము కలదు. ఇందు సరోవరములు, మందిరములు గలవు. ఇందు గహ్వారవనము గలదు. పూర్వము నారాయణదాసు అను బ్రాహ్మణుఁడు భజనఁజేయుచు నివశించెడివాఁడు. ఆయనకు శ్రీరాధాదేవి స్వప్నమునఁ గానఁబడి, యీ గహ్వారమునఁ ఫలానా ప్రదేశమున నా విగ్రహము భూమియందున్నది. దానిని వెలికితీసి ప్రతిష్ఠించుమని చెప్పెను. అంత నా బ్రాహ్మణుఁడు రాధాదేవి విగ్రహమును వెలికితీసి యొక కుటీరమును నిర్మించెను. ఇట మానగృహముగలదు. రాధిక కోపింపఁగా శ్రీకృష్ణుఁ డనునయించిన ప్రదేశమిదియేయని యందురు. వృషభానుపురమునకు నందగ్రామము సుమారు 3 మైళ్ళ దూరముగలదు. ఈ రెండు గ్రామములమధ్య ప్రేమసరోవర

మను సుందరమగు సరస్సుకలదు. ఇచట రాధాకృష్ణులు కలిసి కొనుచుండువారఁట. దీనికి సమీపముననే శ్రీ రాధా వినోద మందిరముకలదు. గోకులము నందుత్పాతములు జరిగిన కారణమున నందుఁ డీ గ్రామమున నివశించెను. దీనిని నంది గ్రామమని పిలుతురు. ఇదికూడఁ బరసానావలె నొక మిట్ట పైనఁగలదు. ఆ కొండను శివస్వరూపముగఁ దలంతురు. ఈ కొండపైని నందుని మందిరముకలదు. అందు బలరామ కృష్ణులయు, యశోదానందులయు విగ్రహములు కలవు. మూర్తు లతి మనోహరములుగ, వాత్సల్య రసోద్దీపికములై యున్నవి. ఇచ్చటఁ గడిమిచెట్టు లధికముగఁగలవు. ఇందుఁ బానసరోవరమను పేరుగల యొక కుండముగలదు. శ్రీకృష్ణుఁడు గోవులకు నీ సరస్సునందే నీళ్లుఁ ద్రాగించెడివాఁడు. మరియు లలితాకుండము, విశాఖకుండము మున్నగు సరస్సులు గలవు.

ఇట కోకిలవనము గలదు. ఇట శ్రీకృష్ణుడు కోకిలవలె బంచమస్వరమున మాటలాడెను. ఒకప్పుడు నారదుఁడిచ్చట వీణవాయించెను. ఒక కరఁగినరాతిపై శ్రీకృష్ణుని చరణ చిహ్నములు నేటికినిఁ గానవగును. ఇందు పూర్ణమాసి కుండముగలదు. పూర్ణమాసి యనునామె నందునియింట నాడ వారికిఁదగు నుపదేశముల నొసంగుచుఁ బురోహితునివలె నుండెడిది. ఆమెపేర నీ కుండము నిర్మింపఁబడెను ఇందు అంజనీశిలకలదు - ఇట శ్రీకృష్ణ భగవానుఁడు రాధాదేవి కన్నులకుఁ గాటుకఁబెట్టెడివాడట. అందుచే దీనిని నంజనీ

శిలయని యందురు. కొండమీఁద శ్రీకృష్ణుఁడు బంతియాడిన ప్రదేశమును కందుక క్రీడాస్థానమని యందురు.

మధుర కేంద్రముగాఁ గలిగిన, మధుర, బృందావనము, గోకులము, మహావనము, బలదేవపురము గోవర్ధనము, వృషభానుపురము, నందపురము మున్నగు పవిత్ర క్షేత్రములు. మొత్తము 80 క్రోసుల విస్తీర్ణముగలిగిన దివ్య మండలములు. వీనిఁదర్శించిన శ్రీకృష్ణకరుణఁ గలుగుననుట నిస్సందేహము.



# ఆగ్రా

ఆగ్రా చారిత్రక ప్రసిద్ధమైన పట్టణము. మొగలాయీ చక్రవర్తులకు నివసాస్థానమై యుండెడిది. ఇది చాల సుందరమైన పట్టణము. ప్రస్తుతము జనాభా ౬,75, 6600. క్రీ॥ శ॥ 1526 లో దీనిపై దండెత్తి బాబరు కోహినూరు వజ్రమును దరలించెను. అగ్బరు చక్రవర్తి దీనిని రాజధానిగ జేసికొని పరిపాలించెను. ఇందు బ్రహ్మాండమైన కోటను నిర్మించెను. పిమ్మట ఈ చక్రవర్తి మనమడైన షాజహాను తన ప్రియభార్యయైన ముంతాజమహాల్ స్మృతి చిహ్నముగ నిర్మించి యమరకీర్తిని నార్జించెను. తాజమహాల్ పాలరాతితో నిర్మింప బడెను. 22 వేలమంది పనివారు 18 సంవత్సరములలో దీనిని నిర్మించిరి. ఇందు షాజహాను, ఆయన సతిసమాధులు గలవు. దీనిలో పలరవ్వలు, వజ్రములు, వైఢూర్యములను పోలిన విలువైన రూపొందింప బడిన శిల్పము. ఇందపూర్వమైన యుద్యాన వనములు నిర్మింప బడినవి. దీని సౌందర్యము వెన్నెల రాత్రులలోఁ జూడఁదగినది. నా దేశవాసులు తాజమహాలు సౌందర్యాతిశయమును జూచి యబ్బుర పడుచుందురు. ఇందలి యనల్ప శిల్పకళా వైభవము చూచితీర వలయును.

అగ్బరు సార్వభౌముఁడు నిర్మించిన కోట డెబ్బ[illegible] యడుగులు ఎత్తు. కోట ప్రధాన ద్వారము లోపలి వా[illegible],

దర్బారులు, అగ్బరు నిర్మించినవి జహంగీరు భవనము షమల్ బురుజు, షాజహాను నిర్మించినవి మోతీమసీదు, అనల్పమైన సౌందర్యమును గలిగియున్నవి. ఎంతచూచినను సంతృప్తిఁదీర్చని సౌందర్యము గలిగినవి. యమునానది కవ్వలియొడ్డున నూర్జహాన్ రాణి తండ్రియగు ఇతిమత్ దాలా సమాధికలదు. ఇక్కడకు 5 మైళ్ళ దూరముననున్న సికింద్రాదగ్గర రమ్యోద్యానమున అగ్బరు సమాధికలదు. నిరాడంబరముగ గంభీరముగ నుండును. ఇట ధర్మశాలలు గలవు. పరశురాముఁడు జన్మించినదీ ప్రదేశమని యందురు.

షాజహాను కళాశాస్త్రజ్ఞునిచే తాజమహలు నిర్మింపఁజేసి బహుమానమునకై కోటకు రమ్మని యతని శిరము నరికించెను. తాజమహలు వంటిదికాని, యధికమైనదికాని యతడు నిర్మించిన తన కీర్తికి భంగము కలుగునని యిట్టి దుష్కార్యమును జేసెనని యందురు.

ఆగ్రా విశ్వవిద్యాలయము, అత్యంత సందర్శనీయమైనది. గ్వాలియరు, ఝాన్సీలకు ఆగ్రానుండికూడ బోవవచ్చును. ఆగ్రాకు షుమారు 6 మైళ్ళ దూరమున రాధాస్వామిచే నిర్మింపబడిన దయాలుబాగుగలదు.

ఆగ్రాకు 26 మైళ్ళ దూరమున ఫతేపూర్ సిక్రీ కలదు. ఇప్పటికిని ఆగ్రాకును ఢిల్లీకిని మైలుకొక గంటగలదు. సుల్తానులు ఢిల్లీలో నివశించుచున్నప్పుడు, ఆగ్రాలోని మంత్రులు ముఖ్యమైన వార్తలఁ దెలియఁజేసివచ్చినచో వాని మూలాన సుల్తానులకుఁ దెలియఁజేయుదురు.

ఆగ్రా విశ్వవిద్యాలయ భవనము, చూడఁదగినది. మొగలులు నిర్మించిన సుందరసౌధములు నేటికినిఁగలవు. వానిమీఁదగల శిల్పకళానైపుణ్యము. వాని నిర్మాణము మిక్కిలి ప్రశంసాపాత్రమైనది. అక్బరు కట్టించినకోట, షాజహాను నిర్మించిన తాజమహాలు చిరస్మరణీయములైనవి. షాజహాను తన పత్నికి స్మృతిచిహ్నముగ తాజమహాలును నుదయమునలేచి చూచుటకు వీలుగా తన సౌధమునందొక గవాక్షముగలదు. ఔరంగజీబు షాజహానును బందీచేసిన మందిరము నేటికిఁగలదు. చారిత్రాత్మకముగఁ బ్రసిద్ధిజెందిన దనుట నిస్సందేహము.



2202

# కాశ్మీరు

భూలోక సౌందర్యవంతమైనది, విదేశములందుఁ గూడ ప్రఖ్యాతిజెందినది కాశ్మీరు. దీని వైశాల్యము 92,780 చదరపుమైళ్ళు. జనాభా షుమారు 4,41,000. భారతదేశము లోని సంస్థానములన్నింటికన్న మిక్కిలి పెద్దది. ప్రాచీన కాలమునుండియుఁ గాశ్మీరులోయ సౌందర్యము జగత్ప్ర సిద్ధము. ప్రకృతిసంపదలకు గాణాచి. హిమాలయ వలయిత మైన యీ సుందరసీమ ప్రపంచములో నందమైన ప్రదేశంబు లన్నిటియందు మిక్కిలి యందమైనది. కాశ్మీరు సౌందర్య మును గాంచి విదేశ యాత్రీకులు, స్వదేశీయు లబ్బురపాటును జెందుచుందురు. కాశ్మీరును జూచి ముగ్ధులైన ప్రతివ్యక్తి తన యానంద వివేచనలో నెవరికివారు క్రొత్తక్రొత్త ప్రత్యే కకారణములను బేర్కొనుచుందురు. అచ్చటి స్వర్గమనోహర దృశ్యములును, నందన వనమును మరిపింపఁజేయు సుందరో ద్యానములను స్వచ్ఛజల పూరితములయి ప్రేక్షకులకు తన్మ యతను గలిగించు సరస్సులను, మంచుచేఁ గప్పఁబడి, సౌందర్య గంభీరములై మరులుగొల్పు మహోన్నత గిరిశ్రేణు లును, పచ్చని రత్నకంబళము పరచినట్లుండు రేఁబచ్చిక బయ ళ్లను నీహార సాంద్రములయిన నిబిడారణ్యములను వీక్షించి తన్మయు లగుదురు. మణికొండ అతిపురాతనము లయిన యచ్చటి శిథిలశిల్పాలను గాంచి వానిప్రాచీన వైభవమును మెచ్చుకొనకుండఁగ నుండలేరు. కాశ్మీరప్రజల యపూర్వ

కళలను, సౌందర్యోజ్వలమైన వారి సృష్టినిఁజూచి యెంతో సంతోషమును బొందుదురు.

ఇట్లా యీ వ్యక్తుల యనుభూతులు వారివారి సంస్కారమునుబట్టి మారుచున్నను కాశ్మీరులోయ నైసర్గిక రామణీయక మర్మము నిప్పటికిని నెవ్వరికినిఁ బట్టుఁబడనేలేదు. ఆ కారణము చేతనే నీనిని ఆసియాఖండపు క్రీడావిహారమని సుందరమాణిక్యక స్థగితమరకతమని మహాకవులు మధురాతి మధురమైన కంఠముతో గానము జేసిరి. ఈ లోకపు చీకాకులు మరుప జెందవలెనన్న, జల్లగా, మెల్లగానీచు పిల్లగాలులనడుమ మన సుందర స్వప్నకాలములో దేలియాడవలెనన్న, రమణీయ కాంతార సీమలో విహరింప వలెనన్న, జవలేటి బంగారు నీటస్నాన సుఖమును ననుభవములోనికి దెచ్చుకొన వలెనన్నది కాశ్మీరులోనే సాధ్యపడ గలదనుట నిస్సందేహము.

అందుఁగల ప్రతిశిల, ప్రతిలత, ప్రతి పరమాణువు మానవ నాగరికతకుఁ బ్రబల చిహ్నము. ఆటవికులకు, ఆధునికులకు నేకకాలములో నమేయ హర్షానుభూతిని నందరించఁగల ప్రదేశము కాశ్మీరుదేశము. వానకుఁదడవని వారు, కాశ్మీరు సౌందర్యమును కన్నుల విందుగాఁజూచి తన్మయులు కానివారు లేరు. అందు స్వాదుఫలములు అందాల భరిణలైన మందయానలు హృదయానందము నొందించు ననుట నిస్సందేహము.

నందనోద్యానమును దలపింపఁజేయు పర్వత సానువుల నైసర్గిక సౌందర్యము — అవ్యక్త మధురా లాపములతో నందరిమనమ్ములను నాకట్టు సెలయేరుల సంగీతము నాడులు కృశించిపోయిన నిర్భాగ్యులకు గూడ సంతశోత్తేజమును, నవనవోన్మేషమును గన్పింపఁగల సముద్రమట్టానికి 52 వేల అడుగుల యెత్తునగల యీసౌందర్య సీమకు మధ్యయింద్ర నీలమువలె సరస్సులు కన్పించు శోభ యసమానము. ఇది డాల్‌సరస్సుయొద్దున గలదు. ఇందు మొగలాయితోటలు, వల్‌నార్‌సరస్సు, దాని యొద్దున నాటస్థలములు, బాలసరస్సు కన్నులకు బంధువానందించును. జీలమ్‌నదిగుండా కొంత దూరము ప్రయాణముచేసిన యనంతనాగపట్టణము వచ్చును. దీనిని యిస్లామాబాగ్ యందురు. మరియు నడుగడుగున నంద మొలికించు మార్తాండ శిథిలములు పహాల్‌గామా ఆటస్థల ములు, సోనామార్గ్ పచ్చికబయళ్లు. అమర్‌నాథ్‌గుహాలు మిక్కిలి చూడఁదగినవి.

పఠానుకోటనుండి శ్రీనగరు 267 మైళ్లుండును. పఠాను కోటకు లఖాన్‌పూరు 11 మైళ్లుగలదు. ఇందొక యందమైన సకలసౌకర్యములుగలిగిన యొక విశ్రాంతి భవనముగలదు. ఇట ప్రకృతి నతిమనోహరముగ నుండును. లఖాన్‌పూరునుండి కను, హింనగరులమీదుగా సాంబా కలదు. ఇచట బ్రహ్మాం డమైన కోటకలదు. ఇది శత్రురాజుల కభేద్యముగా నిర్మింపఁ బడినది. లఖన్‌పూరుకు 56 మైళ్ళదూరమున జమ్మూకలదు. ఇది సముద్రమట్టమునకు 1000 అ.ఎత్తున నుండును. బంగారు

శిఖరములతో నిదిశోభిల్లుచుండును ఇట ప్రసిద్ధమగు వైష్ణవీ మందిరము కలదు. జమ్మూనుండి 41 మైళ్ళ దూరమున ఉదాంపూర్ కలదు. ఇది 2248అ. ఎత్తున గలదు. ఉదాంపూర్ నుండి కుడ్ కు 24 మైళ్ళదూరము గలదు. ఇట కుడ్ సీటిబుగ్గ చూడదగినవి. కుడ్ నుండి 4 మైళ్ళదూరమున పత్ని తాప్ యు నిటనుండి 8 మైళ్ళ దూరమున బటోడ్ యు, నిందుండియు 17 మైళ్ళదూరమున రాంబన్ యు గలదు. దీనికిసమీపమున బనిహారు కలదు. ఇది ఉన్నత పర్వతప్రదేశము. తరువాత అప్వరముండా, లోయరుముండా, గజ్ గుండ్ ఖాన్ బల్, అవంతిపూర్ వరుస గానబడుచుండును. వీనిని దాటగానే పాంపూర్ యొక్క చిన్నపట్టణము గనబడును. ఇటకు శ్రీనగర్ షుమారు తొమ్మిది మైళ్లుండును. ఇది 5250 అ. 11 చ. మైళ్ళ విస్తీర్ణముగలిగి జీలంనది కిరుదిశల మనోజ్ఞమై యుండును. జీలంనదిమీద నగరమున నదికిరుదిశల నుండు నగరఖండములను గలుపుచు 7 వంతెనలు గలవు. ఇక్కడ కొండమీద క్రీ॥ పూ 2000 సంవత్సరములకు పూర్వము కట్టబడిన శ్రీశంకరాచార్యుల మందిరము కలదు. అశోకచక్రవర్తి నిర్మించిన అసలు శ్రీనగరము అచటకు 3 మైళ్ళలోగలదు. ఇందు స్వర్గసౌఖ్యమును మరపించు నుద్యానవనములు కలవు. ఉన్నత పర్వతముల మధ్య మిక్కిలి చల్లగానుండుగుల్మార్గ, పహాల్ గాం ముఖ్యపట్టణములు. పహాల్ గాంపట్టణమందు సుందరదృశ్యములు, గొప్పవృక్షములు మనోహరముగనుండును. ఇది సముద్రమట్టమునకు 7200 అ. యెత్తున నున్నది. విద్దార్ లోయలోనున్న యీప్రాంతము, విశ్రాం

తికి, బర్వతారోహణకు నెన్నో యవకాశములున్నవి. ఇవి కాక కాశ్మీరు లోయలో సోనామార్గ్, గంధేరుబాల్, లోలబ్ లోయ గుర్తైనకూడ యాత్రికులకు జూడఁదగినది. గుల్మార్గా పూలమైదానము ప్రపంచము మొత్తమువిూద నత్యంత సుందరములయిన ప్రదేశములలో నిదియొకటి. ఖలీన్ మార్గ వివిధములయిన పూలమొక్కలు తోను, పూల తోను నేలంత తివాచీ పరచినట్లుండును.

శ్రీనగరునకు షుమారు 6 మైళ్ళదూరమున డాల్ సరస్సుగలదు. ఇది పద్మములతో నిండి 5 మైళ్ళ పొడవు, 2 మైళ్ళ వెడల్పుఁగలిగి నేత్రా నందకరముగ నుండును. కాశ్మీరులోని సరస్సులలోకెన్నఁ బెద్దది ఊలర్ సరస్సు. దీని విస్తీర్ణము 14 చ. మైళ్ళు. దీని పశ్చిమ తీరమున సరస్సులో నీటి బుగ్గకలదు. మానస్ బల్ సరస్సుకొండలచే నావరింపబడి జల పూరితమై యుండును. దీనికి బశ్చిమ దిశయందు శిథిలమైన మొగల్ తోట కలదు. అఫర్వత్ కలాడు 4000 అడుగుల యెత్తున నీలనీరముతో నిండి మనోహరముగ నుండును. గంగా బల్, కౌన్సర్ నాగులుకూడ నతిమనోహరములుగా నుండును.

శ్రీనగరమునకు 5 మైళ్ళ దూరమున చర్మాషాహి కలదు. ఇఁటకు రెండు మైళ్ళ దూరమున నిశాత్ అను సుంద రోద్యానము గలదు. ఇది 10 అంతస్థులుగా నిర్మింపబడి వివిధ పుష్పరాజితమై యుండును. ఇటనుండి 2 మైళ్ళదూరమున షాలిమార్ కలదు. జహంగీరు నూర్జహానుతో విహరించుటకు

దీనినిగిర్మించెను. శ్రీనగరుకు 20 మైళ్ళదూరమునగల అచ్ఛాబల్ చెప్పుకొన దగిన సుందరోద్యానము.

శ్రీనగరమునుండి షుమారు 34 మైళ్ళదూరములో మార్తాండమందిరము కలదు. కాశ్మీరప్రభువగు లలితాదిత్యుడు 8 వ శతాబ్దమున దీనిని నిర్మించెను.

కాశ్మీరుకుఁ దూర్పున సముద్రమునకు 15000 అడుగుల ఎత్తునగల పర్వతముమీద శ్రీ అమరనాథ మహాదేవుని గుహామందిరము కలదు. ఇదియే అమరేశ్వర జ్యోతిర్లింగమని చెప్పబడుచున్నది. ఇచ్చట శివలింగము, గుహయుకూడ మానవనిర్మితముకావు. ప్రకృతిసిద్ధమైనవి. గుహసమీపమందొక సరస్సుకలదు. ఇందు స్నానానంతరము శరీరమునగల నీరినుకుటతోడనే శరీరమునకు భస్మము పూసికొనినటుల తెల్లగానుండును.

అమరనాథ మహాదేవుని గుహామందిరమున 3 హిమలింగములున్నవి. ఇవి మూడును పార్వతీపరమేశ్వరులు, విఘ్నేశ్వరమూర్తులై యున్నవి. ఇవి స్వయముగా నుద్భవించినవి. గుహాలో పైనుండి తుంపర తుంపరులుగా జలమీ లింగముమీద బడుచుండును. ఈ లింగములు చంద్రు ననుసరించి వృద్ధిక్షయములొందుచుండును. అమావాస్యనా డీ గుహనుండి రెండు తెల్లని పావురము లెగురుచు బయటకు వచ్చును. ఇవి పార్వతీ పరమేశ్వరులని చెప్పబడును.

సహజ సౌందర్యమునకు, ప్రకృతిశోభకు, ననుపమాన వైభవమునకు సాటిలేని మేటి కీర్తిగాంచినదీ కాశ్మీరదేశము.

# లాహోరు

చారిత్రకప్రసిద్ధముగ, పౌరాణికముగ మిక్కిలి ప్రసిద్ధి జెందినదీ లాహోరు. అమృతసర్ కు పశ్చిమముగ 32 మైళ్ళ దూరమున నిది కలదు. ఈ పట్టణము మిక్కిలి సుందరము గను, విశాలముగ నుండును. శ్రీరామచంద్రుని కుమారుడగు లవుడు లాహోరునగరమును కుశుడు 'కసూర్' నగరమును నిర్మించిరి. ఈ పట్టణమున ప్రసిద్ధమైనది అనార్కలీ సమాధి. ఇది అనార్కలీ బజారునందు గలదు.

అక్బరుచక్రవర్తి కుమారుడు జహంగీరు. అతడొక నా డుద్యానవనమున విహరించు మిహిరలున్నీసా యను నాస్థానోద్యోగి కుమార్తెను జూచి ప్రేమించెను. ఆమెకూడ యువరాజును జూచి ప్రేమించెను. ఉభయులు వివాహమును గావించుకొనుటకు సమ్మతించుకొనిరి కాని మిహిరలున్నీసా తండ్రి జహంగీరునకు దనకుమార్తె నిచ్చుటకిష్టపడక, యతడు లేని తరుణమునుజూచి యొక పారశీక సైనికునకిచ్చి వివాహ మొనరించెను.

జహంగీరునకీ విషయము తెలిసి వెంటనే రాజధానికి వచ్చిచేరెను. అక్బరు వ్యాధిపీడితుడై మరణించెను. జహంగీరు పట్టాభిషేకమును గావించుకొని యా పారశీకుని గూల్చి యామెను తిరిగి తాను వివాహ మొనరించుకొనెను.

ఆమెకు నూర్జహాన్ అను బిరుదునిచ్చి రాజ్యాధికార మును గూడసంక్రమింపఁ జేసెను. జహంగీరు మరణానంతరము షాజహాను రాజ్యమునకు వచ్చెను. ఆమె మృతిఁజెందిన పిదప లాహోరు నందు బ్రహ్మాండముగ నామెకు సమాధి నిర్మింప బడినది. అందుఁ జెక్కఁబడిన శిల్ప మనల్పముగ నుండును. ఆ సమాధి పాలరాయితో నిర్మింపబడినదఁట. మరొక కథ కలదు—

జహంగీరు నదీరా యను సామాన్య కన్యను ప్రేమించెను. ఆమెకూడ జహంగీరును ప్రేమించెను. కాని అక్బరు చక్రవర్తి యీ విషయము నెఱింగి యామెను అనార్కలి యని నిందింప దొడంగెను. అక్బరు వీరి ప్రేమను చూడఁ జాలక అనార్కలిని జీవించియుండఁగనే లాహోరునందు నొక గోడలో బాతిపెట్టించెనఁట. అందువలననే యీ బజా రునకు అనార్కలీ బజారు అను పేరుగలిగెను.

లాహోరునకు 32 మైళ్ళదూరమున అమృతసర్ కలదు. దీనికి దక్షిణముగ 12 మైళ్ళలో వ్యాసనది, సత్ లజ్ నది సంగమస్థానమునకు నుత్తరముగ సిక్కుల పరమ పవిత్ర మైన 'తరన్ తారణ' కలదు. ఇచట నొక సరస్సు కలదు. దీనిలో నొక సుందర మందిరముకలదు. కుష్ఠురోగి ఎవరైన నీ సరస్సు నీది దాటిన కుష్ఠురోగము నశించునని యందురు అందుచే దీనికి 'తరణతారణి' యను పేరు గలిగెను. జలంధరు వ్యాసనదీతీరమున గలదు. ఇన్నది హిమాలయమునం దుద్భ

వించి దక్షిణ కాంగడజిల్లానుండి సతలజ్ నదియందు గలియు చున్నది.

పూర్వము వసిష్ఠుడు పుత్రశోకాకులుడై వ్యాసనది యందుఁ బడెనని మహాభారతారణ్య పర్వమందుఁ గలదు. ఇందు స్నానముచేసి మనుజుఁడు జన్మాంతర పాపవిముక్తుఁ డగునని మహాభారతానుశాసనిక పర్వమున గలదు. ఇది వ్యాస నది, రావి నదులమధ్యన గలదు. ఇట అమృతసరు అను నొక ప్రాచీన సరోవరముకలదు. ఇది సిక్కుల ప్రధాన పవిత్ర క్షేత్రము. ఈసరోవర మధ్యభాగమున సిక్కుల గురుద్వార కలదు. దీనిని సరుఅర్జునదేవుఁడు నిర్మించెను. రంజితసింగు మహారాజు యీ దేవాలయమునకు బంగారము పూయఁ బడిన రాగిరేకులను గప్పించెను. సిక్కుల నాలుగవ గురువైన రామదాసు యీ సుస్సును త్రవ్వించి, యీపట్టణమును నిర్మించెను.

ఈ దేవాలయమునందు శిక్కుల వేద గ్రంథము గలదు. ఇంకను నిట ననేక దేవాలయములు సుందర మంది రములు గలవు. ఇచట నింకను ననేక సరోవరములు, దేవా లయములు గలవు.

లాహోరుకు దాదాపుగా 90 మైళ్ళదూరమున జలం ధరుగలదు. ఇది పూర్వము జలంధరునిచే నిర్మింపఁబడినది. జలంధరుఁడు మహావీరుడు. అతని భార్య బృందాదేవి మహా పతివ్రత. జలంధరుఁడు క్రూరుఁడై లోకముల బాధపెట్టు చుండెను. బృంద పాతివ్రత్య ప్రభావముచే నతనిని జయించు

వారు లేకపోయిరి. విష్ణుమూర్తి మాయాజలంధరుఁడై బృందశీలమును జెడగొట్టెను. అప్పుడు శివుఁడా జలంధరుని గూల్చెను. బృంద తనభర్త మరణించుటచే వియోగము భరింపజాలక బృందావనమున దపస్వినియై జీవితమును గడిపెను. అందువలననే యా ప్రదేశమునకు బృందావన మని పేరు గలిగెను.

జలంధరలో ప్రాచీన చిహ్నములుగల 2 చెఱువులు, శిథిలస్థానములు గలవు. ఇటకు దాదాపు 200 మైళ్ళదూరమున సిమ్లా కలదు. ఇట నెంతాకాలమున మిక్కిలి చల్లదనముగా నుండును. దీనికి దాపుగా హిమాలయ పర్వతములు గలవు. ఇవి 2000 మైళ్ళ పొడవున హిందూదేశపు టుత్తర యెల్లలుగా నున్నవి. జగన్మాతయగు పార్వతీదేవికి దండ్రి పరమేశ్వరుని నల్లునిగాఁ జేసికొనిన పరమపూజ్యుఁడు దేవతలకివి యాటపట్టు. పూర్వము హిమాలయ ప్రాంతమును 5 భాగములుగా వర్ణించిరి. 1. నేపాలు, 2. కూర్మాచల్, 3. కేదారు, 4. జలంధరు. 5. కాశ్మీరు. వీనిలో సిమ్లా ఒక భాగముగా నున్నది సిమ్లా హిమాచల ప్రదేశ్ కు పంజాబుకు రాజధాని. ఇది సముద్రపట్టమునకు 7000 అ. ఎత్తున గలదు. మిక్కిలి యందమైన పట్టణము. ఇందుఁ గల కేంద్రప్రభుత్వ కార్యాలయ భవనములు చూడదగినవి. దీనికి షుమారు 60 మైళ్ళ దూరమున కాలా కలదు. ఇచట నొక బ్రహ్మాండమైన విశ్రాంతి మందిరము కలదు సిమ్లాకు 30 మైళ్ళ దూరమున మహాసజిల్లా కలదు. ఇచట నెత్తుగల హట్టుశిఖరము చూడఁదగినది. ఇందు బురాతన శివాలయముకలదు.

# వరంగల్లు

ఒకనాఁడాంధ్రజాతి వికాసమునకు, లలితకళా వైభవమునకు నమృత పూరిత కవితా సంపదలకు గాణాచియై, దశదిశలఁ జేరొందిన దీ వరంగల్లు. పూర్వకాలమున ఓరుంగల్లు ఓరుగల్లు అను పేరులతో నుండెడిది. ఓరుగల్లు శబ్దభావమే వరంగల్లు. ఓరుగల్లును ఏకశిలానగరము, ఏకాశిలాపురి,ఏకోపం అని సంస్కృతీకరణముచేసికార్యములందును, శాసనములందును వాడబడియున్నది. ఇది కాకతీయాంధ్రసామ్రాజ్యమునకు రాజధాని.సకలవైభవములతో దులమూగినది. ఈవరంగల్లుహైదరాబాదు —విజయవాడ రైలుమార్గమున హైదరాబాదుకు 86 మైళ్ళదూరమున గలదు. ఇప్పుడిది హనుమకొండ, మఠేవాడ, వరంగల్ కోట, ఉర్సు, కరీమాబాదులు కలిసివరంగల్ పట్టణముగా నిప్పుడు వ్యవహరింపబడుచున్నది. దీనిని గూర్చి యొక కథగలదు. క్రీస్తుశకారంభమునుండి హనుమకొండ ఆంధ్రుల రాజధానిగా నుండినటులఁ దెలియుచున్నది. ఎఱుకదేవరాజు అనుశూరుడు వచ్చి హనుమాద్రి నాక్రమించి రాజ్యముసేయసాగెను. అతని పుత్రులగు అనుమడు, కొండడు అనువారిపేరున అనుమకొండ నిర్మితమైనది. చాళుక్యరాజొకడు నందగిరిలో బరిపాలింపుచుండెను. ఆతని మరణానంతరము తన యిద్దరుకుమారులు రాజ్యమును బంచికొని యొకఁడు హనుమకొండ యందును, మరియొకఁడు కందార

మునందును రాజ్యముల నేలుచుండిరి. బల్లహుడు అను కల్యాణీకటక పురాధీశ్వరుఁడు కందార రాజ్యపాలకుడయిన సోమదేవుని యుద్ధమునందు గూల్చినందున గర్భిణియగు నాతని వితంతుభార్య సిరియాలదేవి హనుమకొండకు బరుగులిడి, మాధవశర్మయను బ్రాహ్మణోత్తముని నాశ్రయించి బల్లహునిముప్పుఁ దప్పించుకొనెను. అచ్చట నారాణియొక పుత్రుని గనియెను. అతని పేరు మాధవవర్మ. క్రీ॥ శ. 3147. ఇతడే కాకతీయ వంశములో మొదటివాడయినటులను, నీవంశమువారు పద్మాక్షీదేవి వరప్రసాదమున 1000 సంవత్సరములు రాజ్యమును బరిపాలించినటుల దెలియుచున్నది.

క్రీ॥ శ॥ 1005—1158 లో ప్రోలరాజు రాజ్యము చేయుచుండగా అనుమకొండకు ధాన్యమును దెచ్చుబండ్లు ఒకరాత్రివేళ తలక్రిందయినవఁట. మరుదినమున బండ్లను లేవనెత్తుటకు కూలివాండ్రు పోవగా నినుప పట్టాలు బంగారు నుయమైయుండెనట. ఈసమాచారమును రాజుగారు విని స్వయముగావచ్చి చూచి యాశ్చర్యపడెను. తరువాత నితఁడు పండితులతో నాలోచించి యాప్రదేశమును ద్రవ్వించెనట. అప్పుడచట నొక జ్యోతిర్లింగము కనబడెనట. ఆలింగమును హనుమకొండకు దీసికొని రాదలంచెను. కాని దానిని గదలింపక పోయెను. అందుచే నచ్చటనే యాలింగమునకు నాలయము గట్టించెను. అప్పుడా ప్రదేశమునకు ఓరుగల్లు అను ఏకశిలానగరమును గట్టించెను. ఇది కరీమాబాదుకు మైలు దూరమున దూర్పు దిక్కుగను, మహేవాడకు మయిలు దూర

మున నాగ్నేయ దిక్కుగను నెలకొని యున్నది. ఇది హనుమ కొండకు నాలుగుమైళ్ళ దూరమున ఆగ్నేయ దిశనున్నది. ఇది సముదప్రమట్టమునకు 050 అడుగుల యెత్తుననుండి కృష్ణాగోదావరీ నదులమధ్యస్థమగు పల్లపు మాగాణమందు న్నది. ఇది మిక్కిలి పర్వతభూమియగుటచే శత్రువుల కభేద్య ముగా నుండును. క్రీ॥ శ॥ 1158—1196 సంవత్సరములలో బరిపాలించిన మొదటి ప్రతాపరుద్రుడు తన విరోధులధాటి నుండి యెట్టి ముప్పురాకుండుటకై, ఓరుగల్లునకు దనరాజ ధానిని అనుమకొండనుండి మార్చెను. తరువాత క్రీ॥ శ॥ 1260—295 లో బరిపాలించిన గణపతిదేవ చక్రవర్తి క్రీ॥ శ॥ 260—1295 లో పాలించిన రుద్రమదేవి యీకోటను బల పరచి యన్నివిధముల శోభనుగూర్చి, దిశలందు గీర్తిఖాందు నటుల జేసిరి.

ఇందుఁగలకోట శత్రువులకభేద్యమయి సాటిలేనిదై యుం డెను. ఇందుఁగంచుకోట, ఇటుకకోట, రాతికోట, పుట్ట కోట, భూమికోట, కంపకోట, గనినికోట యను నేడుకోట లిందుఁ గలవు. ఇందులో భూమికోట. రాతికోట అను రెండు మాత్రమే యిప్పుడు తెలియవచ్చునవి. లోపలి ప్రాకారము, రాతికోట, బహిఃప్రాకారము భూమికోట మట్టితో గట్టబడిన యీకోట కుడ్యములకు ఫిరంగిదుండు తగిలినను మొక్కవోని పటిమ గలదు. పుట్టకోట హనుమకొండకు దక్షిణమున ఆరు మైళ్ళమీద మిగులజీర్ణావస్థగ గనబడును. రాతికోట వల యము షుమారు ఎనిమిదిమైళ్ళుగల్గి నాలుగు సింహద్వార ములు గలిగియుండెను.

ఓరుగల్లుపట్టణము వైభవదశలోనున్నప్పుడు అత్యంత రమణీయముగా నుండెను భైరవాలయము చాముండేశ్వరీ మహాశక్తినగరు, వీరభద్రేశ్వరాగారము, బౌద్ధదేవువిహారము, మూసానమ్మ గుడి, కుమారస్వామి యాలయము, పాండవుల గుడి, కేశవస్వామి యాలయము, స్వయంభూదేవుని నికేతనము మున్నగునవి ప్రతాపరుద్రుని కాలములో గీర్తిఁజెందినవిగా నుండెను. మైలారదేవుని యుత్సవములు మహావైభముతో జరుగుచుండెను. జమదగ్ని మహాముని భార్యయు బరశురాముని తల్లియునైన రేణుకాదేవి యోరుగల్లులో ఏకవీరామహాదేవియను పేరుతో నాదిశక్తి అవతారముగా బూజలనందుచుండెను. ఉత్సవదినములలో ఏకవీరామహాదేవి యెదుట బలిసీలు పరశురాముని కథలఁ బాడుచుండిరి వీర పురుషారాధనముకూడ నాకాలములో నధికముగా నుండెను. పల్నాటి వీరుల యాలయము ఏకశిలానగరమున గీర్తిఁజెందినదిగా నుండెను. ఒకకాంత తాళకావ్యముల సహాయమున ద్విపద ప్రబంధమున వీరులచరితలు పాడునప్పుడు సభాసదులు తన్మయులయి, యాయా రసముల కనుగుణముగ నభినయించుచుండెడి వారట. ఘటికాయంత్రము కూడ నొకటి యుండెను. ఏకాంబ్రనాథుఁడు రచించిన ప్రతాపరుద్ర చరిత్రమును బట్టి చూడఁగా నిందు 500 పూటకూండ్లు యిండ్లుండెడి వఁట.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు, వివిధ వృత్తులవారు, వైశ్యాగృహములు, వీరభటులు, గజములు,

హయములు, పురమునంతటను గ్రిక్కిరిసియుండెను. కోట యందలి శిల్పచిత్రములు, నందులు, శంభుని గుడి, సింహ ద్వారములు, స్తంభములు, దేవాలయములు చూడఁదగినవి. విద్యారంగమునందును ఓరుగల్లు పురము కీర్తివహించి యున్నది. నృత్తరత్నాకరమును వ్రాసిన జాయపసేనాని ప్రతాపరుద్రయశోభూషణమును వ్రాసిన విద్యానాథ మహా కవి యిందు నివశించి ప్రఖ్యాతిగాంచినవారే. శ్రీమదాంధ్ర భాగవతకర్తయగు బమ్మెరపోతనామాత్యు డీ పురమునందే భాగవతరచనను గావించెను. మార్కండేయ పురాణమును రచించిన మారన నీతిసారమును వ్రాసిన రుద్రదేవచక్రవర్తి, పురుషార్థసారమును రచించిన మహాప్రధాని శివదేవయ్య, మున్నగుకవులు విద్వద్వర్యులు ఇందు నివశించినవారే — ఇందు శైవవాఙ్మయమునకుగూడ ప్రధానస్థాన మొసఁగబడి నది.

శిల్పసౌందర్యమునకు స్థానమై, వ్యాపార లక్ష్మీవిలా సములకు సంస్థానమై, విద్యావినోదాల కాటపట్టయి, యభి వర్ణనీయమై, యాకర్షణీయమై రాజిల్లిన యోరుగల్లు పట్టణ మును గాంచినంత గజపతులకు గుండ్లు గుట్టినవి. తత్ఫలితముగా మంటిదిబ్బలైనవెన్నో యందు దాఁగియున్నవి.

కాకతీయ వంశములోఁ జివరివాడగు వీరప్రతాప రుద్ర దేవ చక్రవర్తి యనంతరము ఓరుగల్లు వైభవము నశించినది. వీరి కాలములో మాడలు, మాడువులు బడిమాడవులు, చిరు లీక, గద్యాయనము, పగోడాలు, మాడబడి, పాతిక మున్నగు

పేరులుగల నాణెములు చలామణి యగుచుండెడివి. దీనిని స్వాధీన మొనరించుటకు క్రీ॥ శ॥ 1303 లో ఖరరాజుల ప్రయత్నము లారంభమయ్యెను. మహమ్మదీయ రాజులుకూడ ప్రయత్నించిరి. కాని వారి ప్రయత్నములు ప్రతాపరుద్ర చక్రవర్తి సాగనీయలేదు. అందుచే ఢిల్లీచక్రవర్తి అల్లావుద్దీన్ సేనానాయకుడగు మాలికాఫరు 1309 లో దిరిగి ప్రచండ సైన్యముతో వచ్చి పట్టణమున కొక మైలు దూరమున విడిసెను. అట రక్షణోద్యోగముననున్న మహమ్మదీయ సైనికులను నరకి రక్షణ శిబిరములను నిర్మించుకొనసాగిరి. విగ్రహారాధకుల పవిత్ర దేవాలయ వనవృక్షములను సమూలముగ నరికివేయుట పవిత్ర కార్యముగ మహమ్మదీయులు భావించిరి. కాని సంధిరాయబారమువలన నప్పటికి మహమ్మదీయులకు యుద్ధ మాగిపోయెను.

మహమ్మదీయరాజుల కుటవలనను పూర్తిగా మరల ఓరుగల్లు వారి స్వాధీనమయ్యెను. రాజును అతని కుటుంబమును, ఉన్నతోద్యోగులను చెఱబెట్టబడిరి. వీరినందరిని ఢిల్లీకి గొంపోయిరి.

ఓరుగంటికి సుల్తానుపూరు అని పేరుపెట్టి తురుష్కులు పరిపాలింపనాగిరి. తరువాత ప్రతాపరుద్రుని విడుదలచేసిరి. అతడు తిరిగి రాజ్యమునకు వచ్చెను. కాని యెక్కువకాలము జీవింపలేదు. అతనితరువాత రాజ్యమునకు వచ్చిన వీరభద్రుడు అయియున్నాడు. క్రీ॥ శ॥ 1422 లో మహమ్మనీ నవాబులు ఓరుగల్లును నాక్రమించి పట్టణమును విధ్వంసము చేసిరి.

ఓరుగల్లును దిరిగి స్వాధీనమును జేసికొన ప్రయత్నించిన వారిలో షితాబుఖాన్ బిరుదాంకితుడగు సీతాపతియను వాడు ఇతడు అసహాయశూరుడు. క్రీ॥ శ॥ 1504 లో నితడు స్వాతంత్ర్యమును ప్రకటించి కులీకుతుబుషాహను యుద్ధమున జయించి, యీ రాజధానిని దిరిగి స్వాధీన మొనరించుకొనెను. తిరిగి పురనిర్మాణమునకు బూనుకొనెను. ఇతడు పూర్వము హిందూరాజులవలె దేవప్రతిష్ఠలను జేసి దాన ధర్మములను నొనరించుటకుఁ బ్రయత్నించినాడు. దుర్మార్గులు బలాతిరేకమున బాంచాలరాయుని విగ్రహమును స్థానభ్రష్టమును చేయగా, చిత్తాపుఖానుడు ఆ విగ్రహమును తిరిగి ప్రతిష్ఠను చేయించెను. శుంభనిశుంభ దానవులను నిర్మూలమునుచేసిన లక్ష్మివిగ్రహమును తురుష్కులు పెఱికివేయగా నతడు ధర్మశాస్త్ర విధిపూర్వకముగ ఏకశిలాపురమున బునఃస్థానమును జేసెను.

క్రీ॥ శ॥ 1512 వ సంవత్సరమున కులీకుతుషాహ ఓరుగంటిపై బడి దాడిసలిపెను. ఆ యుద్ధమునందు వీరశిఖామణి యగు సీతాపతి మరణించెను. సుల్తానుసైనికులు ధనమును రత్నాభరణములను దోచుకొని కొల్లగొట్టిరట. దేవమందిరములు, సుందరసౌధము లన్నియు నిర్మూలము చేయబడినవి. వాని స్థలములందు ముసల్మానుల మసీదులును, ధార్మిక నివాసములు నిర్మింపబడినవి.

ఓరుగల్లు కుతుబ్‌షాహీల పతనానంతరము క్రీ॥ శ॥ 1687 లో మొగలుల వశమయ్యెను. మొదట మొగలు చక్ర

వర్తుల దిరస్కరించి స్వాతంత్రము ప్రకటించి మొదటి నిజాము క్రీ॥ శ॥ 1724 సంవత్సరములో నషిష్ఠితియయ్యెను. తర్వాత నతని వంశీయులు క్రీ॥ శ॥ 1646 వరకు పరిపాలించిరి. పిదప భారతదేశమునకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత దాని స్వాతంత్రము నశించినది. కాని యొకనాటి మహావైభవ ప్రతిపత్తులను, కళావిలాసములను బొందిన ఓరుగల్లు తిరిగి ఎన్నటికైన నాటి కీర్తిని బొందగలదని యాశింతిము.

---

పంచాయతీ
వేమన గ్రంథాలయం,
తేలప్రోలు :: కృష్ణా జిల్లా

# భోనగిరి

ఒకనాఁ డాంధ్రమహాసామ్రాజ్యమునకు రాజధానిగా నుండియు, నిఖిల వైభవములకు గాణాచియై, సంగీత సాహిత్యములకు నెలవై యున్న భోనగిరి నేడు సంపూర్ణ శిధిలావస్థ యందుండి, చూచువారికి గన్నీరు నింపుచుండును. ఒకనాఁడిది మహాసుందరతరమైన నగరముగ వెలుఁగొంది నేఁడిది చిన్న బస్తీగా నుండెను. దీనికి దగ్గరగా నొక పర్వతముగలదు. ఆ దుర్గమే భోనగిరిదుర్గము. ఈపర్వతము విశాలమైన మైదానమందున్నది. అది పల్లపు ప్రదేశముకాన దూరమునుండి చూచువారికి దగ్గరఁజూచి నటుల రెండింతల గనబడును. శత్రువుల కగమ్యమై యున్నది. ఉత్తరమునను, పశ్చిమమునను రాతికట్టడపు బలిష్ఠప్రాకార కుడ్యము లున్నవి. ఇవి చూచుటకు మిక్కిలి యబ్బురమును, భయమును గొలుపును. ఖమ్మముమెట్టు, కొండపల్లి, దేవరకొండ, జఫర్ గడ్, నల్లగొండలు భోనగిరికోట ముందర నల్పమైనవే — శత్రురాజులు దీనిని భేదింపజాలక వెనుకంజ వేసిన మధురకాలము కాలగర్భమునందిమిడి, యది యొక స్వప్నమాత్రావశిష్టమై ఉన్నది. కాని యిది చాలబురాతనమైన దుర్గమని ఘంటాపథముగ జెప్పఁదగును.

అతిప్రాచీనకాలమునందు హిందూప్రభువొకఁడు భోనగిరి కీశాన్యమున నున్న రాయగిరి గుట్టలమీద గోటకట్టుటకు

ప్రారంభించెను. కోట నిర్మాణము సాగుచుండఁగా నాగుట్ట లలో మేకలను మేపుకొనుచున్న యొకగొల్లవాఁడా హడావుడి యంతయుఁ జూచెను. ఆగొల్లవానిపేరు భోనయ్య. అంత నతఁడచ్చట నిర్మింపుచున్న యుద్యోగుల కడఁజేరి "యేమిటీ విశేషము. ఇచ్చట నేమి నిర్మింపుచున్నారు" అని ప్రశ్నించెను. అంత వారు "మారాజుగారి యాజ్ఞ ప్రకార మిచ్చట గోటను నిర్మింపుచున్నా" మని వారు ప్రత్యుత్తర మొసఁగిరి. అంత నాగొల్లడు పకపకనవ్వి "మీరాజుగారికి గోట లెట నిర్మింపవలెనో, యేమియు దెలియ" దని నిర్భయముగ బలికెను. అంతటితో నతఁడూరుకొనక "మీ రాజుగారికి జ్ఞానమే యున్నచో నిట్టిపనికిమాలిన గుట్టలను పసందుఁ జేసి యుండఁడు. ఎదురుగానున్న గుట్టలపై విరోధిరాజుసేనను విడిసి, మీకోటపై బస నెట్లుండునో భావించితిరా" యని తన ప్రతిభావిశేషములను నప్రతిమానముగఁ బ్రకటించెను. వార మ్మాటల కాశ్చర్యపడిరి. వెంటనే వారు రాజుకడకు వడిగ నడచి యాగొల్లవాని విషయమును నున్నదున్నట్లు స్వామిను విన్నవించిరి. అంత రాజది విని యాశ్చర్యచకితుఁడై యతనిని బిలిపించి గౌరవించి "ఓయీ బోయఁడా! మా నిర్మాణా లోచనంబులను విమర్శించుచున్నావు. నీ కన్నివిషయములు దెలిసినటులున్నవి. మరి కోట నెట నిర్మింపమందువో తెలుపుము. నీవు చెప్పినటులఁ జేసి నిన్నుగౌరవింపఁగల" మనెను.

అందుకాగొల్లడు "మహారాజా! తమ రాజ్ఞాపించి నటుల విన్నవించఁగలను. కాని నాకు రెండువరములను ప్రసా

దించినవో సాటిలేని గుట్టను జూపింపఁగలను. దానిని విరోధు లెవ్వరు సమీపించుట యసాధ్యము" అనెను. అందులకు రాజు "ఓయీ నీకోరిక లేవో తెలుపుము నిస్సందేహముగ దీర్చెదను. అనుమానపడక వేగిరముగఁ దెలుపు" మనెను.

అప్పుడా గొల్లడు "మహారాజా! పర్వతముపై కోట కట్టుటయేకాక గుట్ట దిగువనను నొక నగరముకూడ నిర్మింప వలయును. నా పేరు, నా భార్యపేరు కలిసివచ్చునటుల భోన గిరి (గిరి వాని భార్యపేరు) యని చేయవలయును. ఆ నగర మందు నా పేరుతో నొక దేవాలయము నిర్మింపవలయును. ఇటుల గావించిరేని నేను కోట విషయమున దోడ్పడ గలనని విన్నవించెను అందులకు రాజు సమ్మతించెను.

పర్వతము తరులతా గుల్మములతో నిండియుండుటచే గిరి స్వరూపమును దెలియకుండెను. దానిపై ప్రాకిన యొకా నొక తీగ పర్వత శిఖరమునుండి పర్వత పాదమువరకు నంత టను దట్టముగ వ్యాపించియుండెను ఆ తెగయొక్క తల్లివేరు ఎచ్చట నున్నదో భోన భోయనికే దెలిసియుండెను. ఆగుట్టకు బడమరగా నాలు గైదు మైళ్ళ దూరమున హనుమాపురి ములో దల్లి వేరుండెనఁట. కాబట్టి యతఁడా చెట్టువేరును గొట్టివేసెను. తత్ఫలితముగా గుట్టనావరించియున్న తావె యంతయు నెండిపోయెను. మూఁడవ దినము నుదయమున వాఁడా యెండిన తీగెనంతను దగులబెట్టెను. అంతట గుట్ట మీఁద చెట్టుచేమలన్నియు భస్మము కాగా గుట్టయొక అండా గారమున బయటపడెను.

అంతట వాఁడు రాజుగారిని బిలిచికొనివచ్చి గుట్టను జూపెను. అంతట నాప్రభువా గుట్టసౌందర్యము నీటి సౌకర్యమును జూచి యత్యంత విభ్రమ మనస్కుఁడయ్యెను. వెంటనే దానిమీద స్థలావరణమును గావించి కోటను నిర్మించెను. నగరమును గూడ నిర్మాణమును గావించెను. పూర్వోక్త వాగ్దానుసారము గొల్లదంపతులగు భోనయ్య గిరిమ్మల పేరుతో భోనగిరి అను పేరు పెట్టెను. గ్రామమున కాగ్నేయ మూలమున భోనయ్య పేరుతో దేవాలయమును నిర్మించెను. నాటి నుండి భోనగిరియని పిలువఁబడు చున్నది. ఆదేవాలయమునకు భోనేశ్వరాలయమని పేరు ఈదుర్గము, దేవాలయమాంధ్రుల ప్రతిభా విశేషములను వెల్లుగా వెల్లడింపు చున్నవి. కాని యాభోనేశ్వరాలయము నామమాత్రావశిష్టమైనది.

భోనగిరి కోటను సుమారు 700 సంవత్సరముల క్రిందట మహమ్మదీయులు జయించినటులఁ దోచుచున్నది. పర్వతాగ్రమున బెక్కు సుందరభవనంబులు గలవు. అఁటనఁట భిన్నాభిన్నములైన దేవమందిరములూ కలవు. అట నొక మిక్కిలి లోతైన బావిమాత్ర మిప్పటికిఁ గలదు. దానికి దగ్గరగా నొక కోనేరు గలదు. దానికిఁ తూర్పుదిక్కున రెండు మూఁడు గుహాలు కలవు. ఇందు మహాప్రభావముగల మహౌషధులు కలవట. ఈగుట్టమీఁద చిఱుతపులులు మున్నగు భయంకరమైన మృగములు తిరుగుచుండును. ఆంగ్లేయు

డైన సర్వాయి పాపరాయుని కథ చారిత్రాత్మకముగ మిక్కిలి కీర్తిఁజెందినది.

సర్వాయి పాపఁడు గౌండ్లవంశమునందు జన్మించిన వాడు. దీనికి సమీపమందున్న తాటికొండ యందు నివశింపుచుండెడివాఁడు ఆతఁడు చిన్నతనమున ఆవులఁగాయుచు గల్లుగీయుచు జీవింపుచుండెను. వీడు క్రమక్రమముగ నున్నతాశయములు గలవాఁడై, కొందర యనుచరులఁ బోగుఁజేసికొని దారిదోపుడులతో ద్రవ్యార్జన జేయసాఁగెను.

సర్వాయిపాపని పేరు ప్రజలకు సింహస్వప్నమయ్యెను. తరువాత నితఁడు సేనలను సమకూర్చుకొని యుద్ధసామాగ్రుల నమర్చుకొని రాజ్యములపై దండయాత్రల సాగించెను.

షాహాపురముల గొప్ప గోటను నిర్మించుకొని తన నివాసస్థానముగ జేసికొనెను. పాపని పరాక్రమాతిశయములు ఢిల్లీచక్రవర్తి యగు బహద్దరుషా తెలిసికొని వానిశిక్షించుటకు దన సేన కాజ్ఞాపించెను. గోలకొండ కుతుబ్‌షాహీలను జయించి యేడుగడియలు గోలకొండరాజ్యమును బరిపాలించి సంఘుసంస్కరణలను జేసినాఁడట—

సర్వాయిపాపఁడు దన యనక్ర పరాక్రమములతో ఓరుగల్లు కోటపై దాడిసలిపి దోచుకొనెను. దీనిని గూడ జయించి యందలి స్త్రీపురుషులను దాదాపు ౬వేలమంది ఖైదీలుగా గొంపోయినాఁడట.

సర్వాయిపాపనికి గాల్బలము గుఱ్ఱపుదళము వేలకొలఁదిగా నుండెను. మహమ్మదీయు లవ్వీరుని ధాటికాఁగఁజాలక పెక్కుసమరములు సలిపిరి. ఎట్టకేలకు వారు లీ యాంధ్రవీరుని క్రీ॥ శ॥ 1708 సంవత్సరములో నరికివైచిరి కాని యా ఆంధ్ర వీరుని కథను యక్షగానరూపమున నాంధ్రనాటను సంస్మరింపుచు నేయున్నారు.

# శ్రీశైలము

చారిత్రాత్మకముగఁ బౌరాణికముగఁ బ్రసిద్ధిగన్న క్షేత్రములలో శ్రీశైల మతిపవిత్ర మతిప్రాచీనమైనది. ఇది ఆంధ్రప్రదేశ్ లోని కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలూకాలో కర్నూలుకు దూర్పున షుమారు 72 మైళ్ళ దూరమున గలదు. ఈ క్షేత్రము భీకరమైన మహారణ్య మధ్యమునగలదు. దీనికి బశ్చిమమున నంద్యాలనుండియు, కర్నూలునుండియు, ఆత్మకూరు నాగలూటి పెచ్చెఱువుల మీదుగ జేరు మార్గమొకటి, షుమారు పెచ్చెరువునకు పదిమైళ్లు గలదు. తూర్పుదిక్కున వినుకొండ త్రిపురాంతకము, మార్కాపురములనుండియు, వినుకొండనుండియు బ్రస్తుతము బస్సు సౌకర్యము గలదు.

సృష్ట్యాదిలో శిలాదుఁడను మహర్షి పెక్కువేల సంవత్సరములు తపస్సు గావింపగా శివుడు మెచ్చి యతడు కోరినటుల బర్వతుఁడు నందీశ్వరుఁడను నిఱువురు కుమారులనయోనిసంభూతులుగా బ్రసాదించెను. వారిలో మహాభక్తుడైన పర్వతుడు పరమేశ్వరునిగూర్చి పరమనిష్ఠను దపస్సు గావించెను. అందు కప్పరమాత్మ మెచ్చి పర్వతునకు బ్రత్యక్షమై వలయు వరమును గోరుమని పలికెను. అందు కాత డెందమున సంతసించి లింగాకారముగ దన పేరిట దనశిరముపై బావిర్భవింపవలయుననియు, ముల్లోకములలోగల పుణ్యపర్వతములు,

పుణ్యతీర్థములు, పుణ్యనదులు, పుణ్యాశ్రమము లన్నియు నాతోడనే యుండవలెననియు దన శిఖర దర్శనమును గాంచు వారికి బునర్జన్మ లేకుండ మోక్షమును బ్రసాదింప వలెనని యభ్యర్థించెను. అందు కప్పరమేశ్వరుం డానందించి యప్పర్వతమున కట్లనుగ్రహించి యంతర్ధానమయ్యెను. అందుచేతనే 'శ్రీశైలం శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే' అను యశస్సు బొందగలిగెను. నందీశ్వరుండు తపస్సుచేసి యా పరమేశ్వరుని నిత్యమును మోయుచుండవలెనని వరమును గోరుకొని, తదనుగ్రహమున నందివాహనమై నిత్యసేవల గావించుచుండెను. ఆ నందీశ్వరుడు తపస్సుగావించిన స్థలమే నందిమండలమనుపేర బ్రఖ్యాతి జెందెను. ఈ ప్రదేశము శ్రీశైలమునకు నైఋతి దిగ్భాగమున నా కొండలలోకి 50 మైళ్ళ దూరమున గలదు.

ఈ పర్వతమునకు శ్రీశైలమను పేరు పూర్వము కృతయుగమునుండి వసుమతి యను మునికన్యవలన వచ్చినది. వసుమతి యీ పర్వతముమీద బ్రహ్మనుగూర్చి తీవ్రమైన తపమును గావింపగా బ్రహ్మమెచ్చి ప్రత్యక్షమై యామె కోరినటు లాపర్వతమున కామెపేరు పెట్టుట కొప్పుకొనియు, నామెకు శ్రీయను పేరుపెట్టి యా పర్వతమునకు శ్రీశైలమను పేరువచ్చునటుల ననుగ్రహించెను. అది మొదలుగ శ్రీశైలమనుపేర బ్రసిద్ధిగలిగెను. పర్వతుండు కోరినవిధముగ నిందు వెలసిన లింగము పర్వతలింగమనుపేర కీర్తిగలిగియుండగా, చంద్రవతియను నొక రాజపుత్రికవలన మల్లిఖార్జునలింగమను

పేరుగాంచెను. చంద్రవతి తెల్లని మల్లిఖాసుమములతో నీ లింగమును బూజసేయుచు, మల్లెపూవులతో లింగమునకు బూజగావింపుచు, మల్లెపూవుదండలను నర్పింపుచు నారాధించుచుండెను. అప్పుడు శివుఁ డామెయెడ బ్రసన్నుడై యామె కోరిక ప్రకారము మల్లికాసుమమాలను సతతము శిరమున ధరింపుచు మల్లికార్జుననామమును దాల్చెను.

శ్రీశైలము ముప్పది యామడల పొడవు, ముప్పది యామడల వెడల్పుగలిగి పెక్కు క్షేత్రములచే విరాజిల్లుచున్నది. ఈక్షేత్రమునకు నాలుగు ద్వారములుగలవు. తూర్పుద్వారము త్రిపురాంతకము, దక్షిణద్వారము సిద్ధివటము, పశ్చిమ ద్వారము ఆలంపూరు, ఉత్తరద్వారము ఉమామహేశ్వరము. ఈనాలుగు ద్వారములు మహాస్థలములై యున్నవి.

ఈ దేవస్థానమునకు నాల్గు మైళ్ళదూరమున భీముని కొలను గలదు. ఇదొక యగాధమైన లోయ. పూర్వము పాండవు లీమార్గమున వచ్చుచుండఁగ భీముని కచ్చటకు వచ్చునప్పటికి దప్పిక యయ్యెను. అందెచ్చట నీరతనికిఁ గనబడ లేదు. భీముఁడంతటఁగోపించి తనగదతో నిప్పుడుకొలనుగల ప్రదేశమున మోఁదెనట ఆదెబ్బకు చట్టాయి బ్రద్దలై మడుగేర్పడెను. అందుచేతనే దానికి భీమునికొల ననుపేరు గలిగినది. ఈ పర్వతముపై గామరూపమును గల్పించు నోషధులు, సంజీవి ప్రభృతి దివ్యౌషధములు, పర్వతవేదియుఁ గలవట. గంగాధ వాని పాపాత్ముల స్పర్శవలనఁ దనకుఁ గలిగిన పాపము

లను బరిహరించుకొనుటకు శ్రీశైలము దగ్గర కృష్ణానదిలో స్నానమొనరించెనఁట. అందుచే నీకృష్ణానది కమిత ప్రాశస్త్యము గలిగెను.

ఈ క్షేత్రమును ఓరుగంటి ప్రతాపరుద్ర మహారాజు క్రీ॥ శ। 1100 లోను నిర్మించెను పిదప క్రీ॥ శ॥ 16వ శతాబ్దమున శ్రీకృష్ణదేవరాయలు సోపానమార్గములు కల్పించి, కొన్ని నిర్మాణములను గావించి శాసనములను గావించి యున్నారు. హుబ్లీ ధార్వాడా ప్రాంతములు శ్రీశైల భ్రమరాంబకుఁ బుట్టినిల్లనియు, నాప్రాంతమువారు పుట్టింటి పసుపు కుంకుమ చెల్లింపవలెనని శివరాత్రుత్సవమున జను దెంతురు.

శ్రీశైలమున స్వామిసన్నిధిలో ప్రాకారమునకు లోపల ననేక పుష్కరిణులు కలవు. ఇవి యొకటి రెండు కోనేరులుగాను తక్కినవి బావులుగా నున్నవి. విజయనగర ప్రభువు శ్రీకృష్ణదేవరాయలు గజపతుల నోడించి శ్రీశైలక్షేత్రమునకు విచ్చేసి పూజనాదికమునుగావించి, యమూల్యమైన కానుకలను సమర్పించెను. ఇచ్చట ననేక పుష్కరిణులు కలవు. స్వామిసన్నిధికి సుమారు 2 మైళ్ళ దూరమునఁ బాతాళగంగకలదు. ఇటఁ గొండలమీఁదనుండి చూడఁగా కృష్ణానది ఎక్కడనో పాతాళలోకములోనున్నట్టులఁ గనఁబడును. అందుచేతనే దీనికిఁ పాతాళగంగయని పేరు గలిగినది శ్రీశైలమునకు సుమారు పది మైళ్ళదూరమునఁ అహోబిలక్షేత్రము గలదు. ఇదొక నృసింహక్షేత్రము. ఇందునానావిధ నృసింహ

మూర్తులుగలవు. ఎగువ అహోబిల మనుచోట హిరణ్యకశి పునిఁ గూల్చుటకు నరసింహమూర్తి యావిర్భవించిన ఉక్కు-స్తంభముకలదు. ఇటనే రక్తకుండము గలదు. దుర్మార్గుఁడైన హిరణ్యకశిపుడు హిరణ్యాక్షుని సోదరుఁడు. వీరిఱువురు శ్రీవిష్ణుమూర్తిద్వారపాలకులైన జయ విజయులు. ఒకనాఁడు మహాభక్తులైన సనకసనందనాదులు మహాభక్తవరదుఁడైన విష్ణుమూర్తి సందర్శనార్థమై వచ్చిరి. ఆసమయమున శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవితో ఏకాంతమున నుండెను. ఆవిషయమును జయవిజయులు వారికి నివేదించి యభ్యంతరమును దెలిపిరి. అందులకు నామహర్షి బాలకులు కోపించి వారిని భూలోకమందుఁ బుట్టునటుల శపించిరి. ఈవిషయమా హరియెరింగి బయటకువచ్చి మునిబాలకుల కోపోపశాంతులఁజేసి జయవిజయులయెడఁ బ్రసన్నుఁడై మిత్రత్వమున బదునాలుగు జన్మములలోఁ గలియునట్లుగాని, లేదా విరోధమున మూఁడుజన్మలలోఁగాని, కలియునటుల శాపోపశాంతినిఁ దెలియఁజేసెను. అందులకు జయవిజయులు విరోధమున మూఁడుజన్మలలోనే కలియునటులఁ గోరిరి. అప్పుడు శ్రీమహావిష్ణు వట్లనుగ్రహించెను.

అప్పుడు వారు భూలోకమునఁ బ్రథమజన్మగా హిరణ్యాక్ష హిరణ్యకశిపులై జన్మించిరి. హిరణ్యాక్షుఁడు బ్రహ్మనుగూర్చి తపస్సుచేసి గర్విష్ఠుఁడై భూమినిఁ జాపఁగాఁజుట్టి సముద్రమునఁ బడవేయుటకు సిద్ధుఁడైపోవుచుండ, భూదేవి యాక్రందనము జేసెను. అంత శ్రీమహావిష్ణువు వరాహావ

తారమున భూమి నుద్ధరించెను. అప్పుడు భూదేవి శ్రీమహా విష్ణువున కతిథిపూజలను గావించి సంతృప్తినిఁ గావించెను. అప్పుడే నరకాసురుఁడు జన్మించెను.

హరితన సోదరునిఁ జంపినాఁడనుకోపముచే బ్రహ్మదేవు నిఁగూర్చి తీవ్రమైన తపస్సును జేసి యనేకవరములను బొందెను. పిమ్మట నతఁడు మిక్కిలి గర్విష్ఠియై, సర్వలోకముల నివాసులను బీడింపఁజొచ్చెను. హిరణ్యకశిపుని పుత్రుఁడగు ప్రహ్లాదుఁడు విష్ణుభక్తుఁడు. హిరణ్యకశిపుఁడు దనపుత్రుని నెన్నివిధముల మానిపింపఁజూచినను, నాబాలుఁడు మానలేదు. అందుల కారాక్షసేశ్వరుఁడు కోపించి, తనకుమారుని ననేక హింసలపాలు జేసెను. అంత శ్రీమహావిష్ణువు నరసింహరూపమున ఉక్కు స్తంభమున జన్మించి యతనినిఁ గూల్చెను. ఆ స్తంభమిఁటఁ గలదు.

దిగువ అహోబిలమున ప్రసన్న నారసింహమూర్తి కలఁడు. ఈమందిరమునఁ గంచు స్తంభము గలదు. ఈక్షేత్రమునకు షుమారు 5 మైళ్ళదూరమున రామతీర్థమను తీర్థమును పుట్టలక్కయను నాలయము కలదు.

క్రీ॥ శ॥ 14 వ శతాబ్దమున ప్రతాపరుద్రచక్రవర్తి ఉత్సవ విగ్రహములను, శ్రీకృష్ణదేవరాయలు కొన్ని యమూల్యములైన యలంకారములను సమర్పించెను. అవి నేటికినిఁ గానఁదగును.

శ్రీశైలమునకు షుమారు 20 మైళ్ళదూరమున మహానంది కలదు. ఇచట మహానందీశ్వరాలయము కలదు. ఇంకు

నందీశ్వరుని నోటినుండి సంతతధారగా జలమువచ్చి మందిర మునకు ముందుఁగల తటాకమునఁ బడుచుండును. ఇది మహా శ్చర్యకరమైన విషయము. ఈప్రదేశం బతిమనోహరంబయి యుండును. ఇందు దేవతలుకూడా వచ్చి స్నానమును గావించి స్వామిని దర్శించిపోవుచుందురు. శ్రీశైలక్షేత్ర మతిపుణ్యా వంతమైన మహాక్షేత్రము. ఒక నాఁడీ క్షేత్రమును దర్శిం చుటకుఁ జాలఁ గష్టముగా నుండెడిది. కాని నేఁడు శ్రీశైల మునకు బోవుటకు మార్గము మిక్కిలి సులభతరమును జేసిరి. ఇట్టి మహాక్షేత్రమును సందర్శించి ప్రతిజీవి తరింపగలరని యాశింతుము.

# ఆంధ్రప్రదేశమునందలి చారిత్రక ప్రదేశములు

అద్దంకి:-ఇది గుంటూరుజిల్లాలోఁ గలదు. ప్రోలయ వేమారెడ్డి పాలించిన రెడ్డిరాజ్యమునకు రాజధాని. క్రీ॥ శ॥ 13 వ శతాబ్ది చివర మహాభారతాంధ్రీకర్త చదలవాడ ఎఱ్ఱా ప్రగ్గడ జీవించినకాలము.

అనుమకొండ:- ఇప్పుడు హనుమకొండయని పిలువఁబడుచున్నది. ఓరుగల్లునకు నాల్గుమైళ్ళదూరమున నున్నది. ఇది కాకతీయ ప్రభువులకు రాజధాని.

ఆలంపూరు:- సుప్రసిద్ధమైన ప్రాచీన శివక్షేత్రము. తుంగభద్రానదికి ఉత్తరతీరమందున్నది.

అల్లూరు:- కృష్ణాజిల్లాలోని నందిగామ తాలూకాలోని గ్రామము. దీనికి సమీపమునఁ బ్రాచీన బౌద్ధస్థూప మొకటి క్రీ॥ శ॥ 1926 సంవత్సరమున గుర్తింపఁబడినది.

ఎఱ్ఱగుడి:-కర్నూలు మండలములోని పత్తికొండ తాలూకా యందలి గ్రామము. ఇచ్చట 6 పెద్దరాతిబండలపై అశోకచక్రవర్తి శాసనములు చెక్కఁబడినవి. ఇది ప్రసిద్ధమైన చారిత్రక ప్రదేశము.

కంటకసెల (ఘంటసాల):- కంటకసాలయని నామములతో నిప్పటి ఘంటసాల గ్రామము పిలువఁబడుచుండెను.

ఇది కృష్ణామండలము లోని దివితాలూకాయందలి ప్రసిద్ధ గ్రామము. ప్రాచీనాంధ్రనౌకా జీవనమునకుఁ గూడలి స్థానము. ఈ రేవుపట్టణమునుండియే పూర్వము నేటి బర్మా, కాంబోదియా, జావా, సుమిత్రా ద్వీపములకు వర్తకము సాగుచుండెను.

కంబముమెట్టపురము:-ఇదియే నేటి వరంగల్లుజిల్లాలోని కమ్మముమెట్టుగ్రామము. శ్రీకృష్ణదేవరాయులు తెలంగాణములో సాధించిన దుర్గములలో నొకటి.

కల్యాణకటకము:-ఇది పూర్వము దక్షిణాపథము నేలిన పశ్చిమచాళుక్యులకు రాజధాని.

కుండినగరము:-ఇది కొండవీడునకుఁ బర్యాయ నామము.

కొండపల్లి:- కృష్ణామండలములోని బెజవాడ సీమకు తొమ్మిదిమైళ్ళదూరమున నున్న యొకగిరిదుర్గము. చాళుక్య చక్రవర్తి త్రిభువనమల్లదేవుని సామంతనాయకుఁడగు గోవిందరసు కొండపల్లి మూనూరును పాలించెను. తరువాత కాకతీయులు, గజపతులు, విజయనగరాధీశులు పరిపాలించిరి.

కొండవీడు:-ఇది గుంటూరుమండలములో నరసరావుపేటకు తూర్పునఁ బదమూడు మైళ్ళదూరమున గలదు. కొండపై రెండు కోటలును క్రిందను నొక కోటయుఁ గలవు. అనపోతారెడ్డి కొండవీటి దుర్గమును దనరాజధానిగఁ జేసికొనెను.

కొలనుపాక:- ఇది యాంధ్రప్రదేశములోని నల్గొండ జిల్లాలోని గ్రామము. పూర్వమొకప్పుడు జైనక్షేత్రమై, పిదప శైవక్షేత్రమయ్యెను. ఇది యొకనాడు చారిత్రక ప్రసిద్ధినొందిన గ్రామము.

గుంటుపల్లి:-పశ్చిమగోదావరిమండలములో ఏలూరు తాలూక కామవరపుకోట ప్రాంతమునఁ గలదు.

ద్రాక్షారామము:-తూర్పుగోదావరి మండలములోని రామచంద్రపురము తాలూకా యందలి సుప్రసిద్ధ శైవక్షేత్రము. దీనికిఁ ప్రాచీన నామము డాకరేమి క్రీ॥శ॥ 11 వ శతాబ్దము చివరకాలము నాటి శాసనములో నియ్యది దక్షపురియనియు, దాక్షారామమని వ్రాయఁబడెను. ఆంధ్రదేశమునందలి త్రిలింగములలో దాక్షారామమొకటి. శ్రీనాథకవిసార్వభౌముఁడు భీమేశ్వర పురాణమును రచించి, రాజమహేంద్రవరమును రాజధానిగఁ దెలుఁగుదేశమును బరిపాలించిన వేమారెడ్డి వీరభద్రా రెడ్ల మంత్రియగు బెండపూడి అన్నమంత్రి కంకితమొసంగెను. దక్షుని సవనాగారమగుటచే దీనికి దక్షారామమని పేరుగలిగెను. మహాకవి వేములవాడ భీమకవి యీ దక్షారామ భీమేశ్వరుని ప్రసాదమున జనించి మహామహిమోపేతుఁడయ్యెను. ఇది ప్రాచీన బౌద్ధరామములలో నొక్కటియై, యిందొక స్థూపమునిర్మింపఁబడి, బౌద్ధమతి మాంధ్రదేశమున నిర్మూలింపఁబడి, శైవమతము విజృంభించెడికాలమున నీ బౌద్ధస్థూపమొక శివాలయముగ మార్పుఁజెంది

యుండెననుట నీ భీమేశ్వరలింగమే ప్రబలసాక్ష్యముగానున్నది. ఇది ప్రసిద్ధపుణ్యక్షేత్రముగ నొప్పు చున్నది.

చేబ్రోలు :—ఇది గుంటూరుజిల్లాలో నున్నది. గుంటూరుకు షుమారు 8 మైళ్ళ దూరమున నున్నది. చోళరాజుల కిదొక నాఁడు రాజధానిగా నుండెడిది. రాజావాసిరెడ్డి వేంకటాద్రి నాయుఁడుగారు నిర్మించిన బ్రహ్మాలయము గలదు. ఈగ్రామమున 101 బావి 101 గుడియుండెడివని శాసనమూలమునఁ దెలియుచున్నది. కాని ప్రస్తుతమిందుఁ గొన్ని దేవాలయములే కలవు. కాశీనుండి వచ్చిన భీమేశ్వరాలయమిందుఁ గలదు. దీనినిఁ గూర్చి యొకచిత్రమైన కథకలదు. కాశీనుండి భీమేశ్వరుఁడు రథారూఢుండై యీ ప్రదేశమునకు రాత్రిసమయమున వచ్చెడివాఁడఁట. ఒకనాఁడు ముదుసలి స్త్రీకంటబడి యక్కడే నిలఁబడి పోయినదఁట యీరథము. దేవాలయము దిగువన నిప్పటికినొక గుహకలదు. అందుండి కాశీకిఁ బోవుటకు మార్గమదియని చెప్పుదురు. ఇప్పటికిఁ గుమ్మరివారా పురమున నుండరు ఇందుకు సంబంధించిన యొక కథ కలదు. జయుఁడు విజయుఁడను నిఱువురు చోళరాజు లిందు నివసించెడివారు. వీరిందు బలీయమైన కోటను నిర్మించుకొనిరి. ఆ ప్రదేశ మిప్పటికిఁ గలదు. ఆకాలమున వీరిపాలన సర్వతోముఖ వైభవముల మిన్నందినది. ఇదిచూచి రాజా వేంకటాద్రి నాయుఁడుగారు వారితో యుద్ధమునకు దలపడెను. జయునితో బోరుటకు నాయుడుగారి కసాధ్యమయ్యెను. అంతట జయుని సేనాధికారులతో లాలూచీపడి యర్ధరాత్రివేళ రాజసోదరు

లిఱువురఁగూల్చెను. కుమ్మరిసైనికులు కోటలో ప్రవేశించిరి. అప్పుడు రాజపత్ని గర్భవతి. ఆమె ఎంతవారింపుచున్నను, నాకుమ్మరి సైనికులు దారుణహింసా క్రీడకుఁ దలపడిరి. అంత నామె కోపించి యీప్రాంతమున నావంశీయులున్నచో శిరస్సుపగిలి మరణింతురని శపించి యాత్మహత్య చేసికొనెను. కాని యిందు సత్యమున్నను లేకపోయినను, కుమ్మరివారు మాత్రమందుండరు. బ్రహ్మాండమైన కోనేరు, అందు మధ్య చతుర్ముఖ బ్రహ్మాలయము కలవు. ఈస్వామి కెనిమిది దిశల దిక్పాలకుల దేవలయములు కలవు. దీనికి దక్షిణ కాశియని పిలువఁబడుచు యాత్రీకు లరుదెంతురు. ఈ విషయములు శాసనములందుఁ గలవని వానిఁ బరిశోధించి వెల్లడించిన వారు సంస్కృతాంధ్ర పండితులు కీ॥ శే॥ శ్రీమన్నవ వేంకటరత్నముగారు—దీనికి సంబంధించిన వివరాలు, ప్రస్తుత గ్రామమున్నబు—సంస్కృతాంధ్రజ్యోతిష ప్రవీణులయిన శ్రీమన్నవ వీరరాఘవరావుగారికడఁ గలవని తెలియుచున్నది. ఇందు చెన్నకేశవమందిరము, నాగేశమందిరము, వేణుగోపాలస్వామిమందిరము మిక్కిలి ప్రసిద్ధములైనవి. ఇందు గాలభైరవుని విగ్రహము కలదు. ఈస్వామి క్రింద బంగారపుటొడ్లు పాతరవేయఁబడియున్నవని వదంతికలదు. ఇట్టి ప్రాచీన చరిత్రఁగల గ్రామముల యుదంతము ముందు ముందు ప్రకటింపఁబడఁగలవని యాశింతును.

పల్లినాఁడు:- ఆంధ్రదేశ చరిత్రమున నత్యంత పురాతనమైన రాష్ట్రవిభాగములలో పల్లినాడు లేక పలనాడు

మిక్కిలి ప్రసిద్ధిఁ జెందినది. పల్నాటివీరులు బాలచంద్రుఁడు, నలగామరాజు మున్నగువారు చరిత్రప్రసిద్ధులు. దీనికి రాజధాని గురిజాల. ఇచ్చట నాగులేరు చంద్రవంక మున్నగు నదులు కలవు. మాచర్ల చెన్నకేశవ మందిరము ప్రసిద్ధమైనది.

పెనుగొండ:- అనంతపురము జిల్లాలోని పెనుగొండ తాలూకా కేంద్రప్రధాన నగరము. ఇందుండియే తిరుమల రాయలు కర్ణాటకసామ్రాజ్యమును బరిపాలించెను.

పొట్నూరు:- శ్రీకృష్ణదేవరాయలు పూర్వదిగ్విజయ యాత్రయందు రాయలు జయించిన సుప్రసిద్ధమైన గ్రామము. ఇచ్చట శ్రీరాయలు జయస్తంభములు నిర్మించెను. ఇది విశాఖపట్టణము జిల్లాలో భీమునిపట్నము తాలూకాలో గల చిట్టివలస నదీతీరమందున్నది.

బెల్లముకొండ:- శ్రీకృష్ణదేవరాయలు పూర్వదిగ్విజయ యాత్రలో సాధించిన కోటలలో నిదొకటి. ఇది గుంటూరు మండలములోని సత్తెనపల్లి తాలూకా యందలి బలిష్ఠమైన దుర్గము. తరువాత నీదుర్గము గజపతుల, చంద్రకేతనుల వశమైనటులఁ దెలియుచున్నది.

భట్టిప్రోలు;- ఆంధ్రప్రదేశమున బురాతన బౌద్ధక్షేత్రములలో నిది యొకటి. ఇది గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా యందుఁ గలదు. దీనికిఁ బ్రతిపాలపురమను నామాంతరము గలదు.

రాయచూరు:- పూర్వము తెలంగాణాలోని రాయచూరు జిల్లాకు ముఖ్యపట్టణము. శ్రీకృష్ణదేవరాయలు జయించిన సుప్రసిద్ధదుర్గములలో నిదియొకటి. రాయచూరు యుద్ధము క్రీ॥ శ॥ 19–5–1529 తేదీని జరిగెను.

వినుకొండ:- ఇది గుంటూరుజిల్లా వినుకొండ తాలూకాలోని గిరిదుర్గము. ఇయ్యది శుత్రపర్వత దుర్గమని క్రీడాభిరామమందుఁ బేర్కొనఁబడినది. శ్రీకృష్ణదేవరాయలు పూర్వ దిగ్విజయ యాత్రలలో దీనిని సాధించెను. కొంతకాలము గజపతుల వశమునను, కొంతకాలము విజయనగర రాజుల స్వాధీనములోను గలదు. దీనికి విన్నకొండ యను పేరుగూడఁ గలదనియు శ్రీరాముఁ డిచ్చటనే సీతాదేవిని రావణాసురుఁ డపహరించినాఁడను వార్త వినినాఁడనియు, నిందుకు నిది విన్నకొండయని పేరువచ్చినదని చెప్పుదురు.

వేములవాడ:-ఇది కరీంనగరం జిల్లాయందలి సిరిసిల్లా తాలూకాలోనున్న సుప్రసిద్ధమైన చారిత్రాత్మక స్థలము. షుమారు 300 సంవత్సరములు చాళుక్యులు వేములవాడలో రాజ్యపాలనమును గావించిరి.

అనంతగిరి:- ఇయ్యది తెలంగాణములోని గిరిదుర్గములలో నొకటి. ఇది నల్గొండజిల్లాలో హుజూరునగరు తాలూకాలో నున్నది. శ్రీకృష్ణదేవరాయలు పూర్వదిగ్విజయ యాత్రకుఁ బోయినపుడు వశపరచుకొనిన దుర్గము.

ఉండ్రికొండ:- శ్రీకృష్ణదేవరాయలు సాధించిన తెలంగాణ్యదుర్గములలో నొకటి.

జగ్గయ్యపేట:- ఇది కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలో నున్న ప్రాచీన బౌద్ధనిలయము. ఇచ్చటఁ బ్రాచీన బౌద్ధస్తూపములు, సంఘారామములు, చైత్యములు మున్నగునవి గ్రామసమీపమందున్న యొకకొండపైఁ గలవు. ఇది మౌర్యుల కాలమునాటిది.

ధరణికోట:- ఆంధ్రదేశమునందుఁ బ్రాచీన పట్టణములలో నత్యంత కీర్తిఁగాంచిన నగరములలో నిది యొకటి. దీనికిఁ బ్రాచీన ప్రాకృతశాసనములలో "ధణ్ణకడ-దణ్ణకట-దణ్ణకటకము అని పేర్లు గలవు" ఇయ్యది సారవంతమైన ప్రదేశము. పంటలు సమృద్ధిగాఁ బండును. పట్టణంబులు స్వల్పముగా నున్నవి. జనులు నల్లగానుందురు. ఇక్కడ బౌద్ధమఠములు పెక్కులు గలవు. ఇక్కడ నానావిధ మతస్థులు, దేవాలయములు కలవు. దీనికిఁ దూర్పునఁ బూర్వశైలసంఘారామము, పశ్చిమమున నపరశైల సంఘారామము కలవు. ఈదేశమునకు మహాంధ్రమని పేరు కలదని దీనినిఁ గూర్చి ప్రసిద్ధచీనాయాత్రికుఁడు హుయాన్‌స్సాంగు వ్రాసెను. ఇయ్యది నాగరాజులకును, శాలివాహనులకు రాజధాని. దీని తరువాత కాలమునాఁటి తెలుగు శాసనములలో ధాన్యవతీపురమనియు ధాన్యకటకమనియు ధాన్యాంక పురమనియుఁ బేరులు గలవు.

దేవరకొండ:- ఇది తెలంగాణములోని ప్రసిద్ధమైన గిరిదుర్గములలో నొకటి. నల్గొండజిల్లాలో దేవరకొండ తాలూ

కాకు నేటి ప్రధానగరము. రేచెర్ల వెలమప్రభువుల కాలములో నధిక ప్రాభవమును గాంచిన దీ చిన్నరాజ్యము. అనపోతానేడు, మాదానేడు సోదరులలో అనపోతానేడు రాచకొండ ప్రాంతమును, మాదానేడు దేవరకొండ ప్రాంతమును నేలిరి. ఇది యత్యున్నతమగు శిలాప్రాకారత్రయములచేఁ బరివృతమై, యతిదుర్గమమై మిక్కిలి శత్రురాజభయంకరమై యున్నది.

పానుగల్లు:- ఇది నల్లగొండజిల్లాలోఁ గలదు. దీనిని రుద్రమదేవి కాలమునఁ గల గండిపెండారజన్నిగ దేవరాజు రాజ్యము జేసెను.

పంచారామములు:-దాక్షారామము, చాళుక్యభీమవరము, పాలకొల్లు, గుణపూడి భీమవరము, అమరావతి.

# భువనేశ్వరము

అత్యంత ప్రాచీనప్రసిద్ధిఁజెందిన చారిత్రాత్మక పౌరాణిక స్థలములలోఁ బేర్కొనఁగన్నది భువనేశ్వరము. ఇదొక ప్రసిద్ధ శివక్షేత్రము. కాశీవలెఁ బ్రఖ్యాతిఁజెందిన క్షేత్రము. ఈ క్షేత్రము హౌరాకు దాదాపు 272 మైళ్ళన గలదు. ఇది ఒరిస్సాకు నూతన రాజధాని. ఇది నాలుగువేల జనాభాగల నగరము. ఇందుఁ బూర్వ మేడువేల దేవాలయములుండెడివఁట. కాని ప్రస్తుతమిందు శతదేవాలయములు కన్న లేవు. అద్భుతమైన శిల్పమునకు నివి నిదర్శనము. ఇందుఁగల దేవాలయములన్నిటియందు లింగరాజాలయ మతి ప్రధానమైనది. మఱియు భగవతి, పార్వతి, ముక్తీశ్వర, అనంతవాసు, దేవబ్రహ్మేశ్వర, భాస్కరేశ్వర, పరశురామేశ్వర దేవాలయంబులతి ముఖ్యంబులైనవి. ఇట సమీపంబునఁగల యుదయగిరి ఖండగిరి గుహాలలోఁ బూర్వమొకప్పుడు జైనసన్యాసులుండెడివారట. వీనిలోఁ గొన్ని క్రీ. పూ. 2 వ శతాబ్దమునాటివి. వీని శిల్పసంపద మిక్కిలి కీర్తిఁజెందినది. ఇఁట రాయబహదూరు దయాలవాసియా ధర్మశాల గలదు. ఇది శిల్పసంపదకుఁ బ్రకృతి సౌందర్యమునకు నాటపట్టువు. ఇచటఁ బంచశతాధికంబులగు దేవాలయములు పూర్వశిల్ప వైభవముతో జీర్ణావస్థయందున్నవి. ఆలయములు, కుండములు ప్రేక్షణీయమైనది. ఇందు బిందు సరోవరముగలదు.

ఈ సరోవరమున నింద్రద్యుమ్న మహారాజు స్నానము చేసి దివ్యజ్ఞానమును సంపాదించెను. అటు దర్వాత నా నృపాలకుఁడు దేవాదిదేవుఁ డగు జగన్నాథుని నిర్మించెను. మునీశ్వరులు క్షేత్రమున మహాను లనేకులు సర్వతీర్థముల సమకూర్పఁ దలఁచి సర్వతీర్థములనుండి జలబిందువులను గ్రహించి యిందులో నింపిరఁట. అందుచేతనే యీ సరోవరంబునకు బిందుసరస్సను పేరు వచ్చెను. ఇందు స్నాన మొనరించినవారికి సర్వతీర్థస్నానఫలము కలుఁగును. ఇచటఁ బరిశుద్ధముగ స్నాన మొనరించి భువనేశ్వరుని సందర్శింపవలెను. అమ్మహాదేవుఁడు హరిహరాత్మకుఁడనియు, నేకాభువనుఁడనియుఁ బిలుతురు. ఇమ్మందిరము 180 అడుగుల యెత్తుఁ గలిగి మిక్కిలి ప్రాచీనమైయుండెను. జగన్నాథమందిరముకన్న నిది చాలఁ బెద్దది. ఇచటఁ బరమేశ్వరుని నభిషేకించుటకు గంగాజలము నుపయోగింతురు. బిందుసరోవర జలముతోఁ గూడ మహాదేవుని నభిషేకింతురు. దీనినిఁ బూర్వము కోటిలింగక్షేత్ర మని పిలువఁబడుచుండెడిది. కాశీయందు జగన్నాథునివలె నీ మహాదేవునికిఁ గూడ నిత్య మనేక భోగోపహారము లర్పింపఁ బడుచుండును. ఉత్సవవేళలందు నుత్సవవిగ్రహంబులను నావయందుంచి, బిందుసరోవరమున జలవిహారమును జేయుచుందురు. ఇందు స్వామి విశ్రాంతిఁ దీసికొనుటకు నీటిమధ్యమున నొక మంటపము గలదు.

ఇచటఁ గుంజవన మను పేరుగల యొక వన మున్నది. ఇందుఁ జాల దేవాలయములు గలవు. ఇవి చాలఁ బురాత

సములైనవి. అందుచే నిందు శిథిలావస్థములైన భాగములు గలిగియున్నవి. పూర్వము వేయి శివాలయంబు లిందుండెడివి. ఇప్పుడు ఆరువందల మందిరములు గలవు. ఇచ్చట మందిరము లన్నియు నొకేవిధముగ నిర్మింపఁ బడెను. ఇచట పరశురామేశ్వరమందిరము గలదు. ఈ మందిరము 5 వ శతాబ్దియందు నిర్మింపఁబడెను. ఇచట దాక్షిణాత్య శిల్ప చాతుర్యమును జాటు శిల్పఖండము, భువనేశ్వరుని ప్రధాన మందిరము దాదాపు 1,100 వందల సంవత్సరములనాఁటిది. దీనిని ఉడిసా మహారాజు యయాతి కేసరి నిర్మించెను. దీని యందుఁగల శిల్పచాతుర్య మెంతో మెచ్చుకొనఁ దగి యున్నది. ఈ యాలయమునకు షుమారు అరమైలు దూరమున సిద్ధారామవనమున ముక్తేశ్వరుని మందిరము కలదు. ఇదొక ప్రసిద్ధ శిల్పకళాఖండము. ఇది సామాన్యముగ జగత్ప్రసిద్ధిఁ గాంచిన తాజమహాలుతో సమానమైనదిగ నుండును. భువనేశ్వరమందిరమునకుఁ బూర్వోత్తరకోణమున భాస్కరేశ్వరుని మందిరమున్నది. దానికిఁ బశ్చిమంబున నత్యంత సుందరం బగు రాజధానీమందిరము కలదు.

భువనేశ్వరంబునకు నాలుగు మైళ్ళ దూరంబున ఉదయగిరి యను రెండు కొండలు గలవు. ఇందు బుద్ధుని కాలమున నిర్మింపఁబడిన గుహాలు కలవు. గాని కెదుట ప్రాంగణముకూడ మలుపఁబడియున్నది. ఈ గుహాలయందు చాల గదులు కలవు. ఇందు సర్పగుహా, వ్యాఘ్రగుహా, రాణీనూర్ గుహా, గణేశ గుహా, వైకుంఠగుహా, హాథీగుహా ముఖ్యమైనవి.

భువనేశ్వరమునకు షుమారు 30 మైళ్ళదూరమునఁ గలదు. ఇది తూర్పుతీర సముద్రమునఁ గలదు. దీనిని క్రీ॥ శ॥ 1: వ శతాబ్దములో 92 అడుగుల యెత్తున నిర్మింపఁబడినది. దానిపై విష్ణు చక్రము ధ్వజము చెక్కఁబడినది. పంజాబును బరిపాలించిన రంజిత్ సింగ్ మహారాజు కోహినూరు వజ్రమును జగన్నాథస్వామి యాలయమునకుఁ గానుకగ వినిర్మించెను. జగన్నాథుని నస్పృశ్యులు దర్శింప నధికారము లేదు. అందుచే వారలకై సింహద్వారమున జగన్నాథుని విగ్రహము గలదు వారలీ విగ్రహమును గాంచిన జగన్నాథుని దర్శించిన ఫలితము లభించును. ఇట మార్కండేయ సరోవరము కలదు. ఈ ప్రదేశమందు మార్కండేయుఁడు చాలకాలము తపస్సుఁజేసి శంకరునిఁ బ్రసన్నునిఁ గావించుకొని దీర్ఘాయువును బొందెను.

జగన్నాథమందిరము నీలగిరిమీఁదఁ గలదు. దీని యెత్తు సుమారు 25 అ. లుండును. మందిరమునకుఁ బ్రాకారము గలదు. ఆ ప్రాకారమునకు నాలుగు దిక్కుల నాలుగు ద్వారములు గలవు. ఇందుఁ దూర్పుద్వారము చాలఁబెద్దది. ఈ ద్వారము ముందు రెండు సింహవిగ్రహములు కలవు. యాత్రికులీ ద్వారమునగుండా లోనికి బ్రవేశింతురు. ఈద్వారము ముందు నల్లరాతి అరుణ స్తంభము కలదు. దీనియెత్తు షుమారు నలువది యడుగులుండును. దీనిమీఁద సూర్యసారథియనూరుమూర్తి కలదు. మొదటి ప్రాకారము లోపల రెండవ ప్రకారముగలదు. మొదటిప్రాకారద్వారముల కెదుట

వనేక మందిరములు గలవు. అందుఁ బాతాళేశ్వరు మందిరము సుప్రసిద్ధమైనది. దీనికి ముందు గరుడ స్తంభము గలదు. దీనిని దాటిన తరువాత జగన్నాథుని మందిరముకలదు. ఈ మందిరము నాలుగు భాగములుగాఁ గలదు. 1. విమానమందిరము 2. సభామందిరము 3. నృత్యమందిరము 4. భోగమందిరము. విమానమందిరమున జగన్నాథుని విగ్రహము గలదు. దానికి ముందు సభామందిరము కలదు. దీనికిముందు భోగమందిరము కలదు. దీనికిముందు నృత్యమందిరము కలదు. నృత్యమందిరమందు, సముద్ర మథనమథనము, రాసక్రీడ, గోపీవస్త్రాపహరణము, క్షీరోదధిశాయియగు విష్ణుమూర్తి మున్నగు మనోహర చిత్రము లిందున్నవి.

ఈ మందిరము చాల చీకటిగానుండును. నిరంతర మొక ఘనదీపము వెలుగు చుండును. ఆ దీపపు వెలుగుననే జగన్నాథుని సందర్శింపవలయును. జగన్నాథుని విగ్రహము రత్నవేదిక మీఁదఁ గలదు. ఈ వేదిక షుమారు 1 1/2 గజము ఎత్తును, 5 గజముల పొడవును గలిగియున్నది. ఈ వేదికమీఁద నుత్తరముగ సువర్ణచక్రము గలదు. దానికి దక్షిణమున జగన్నాథస్వామి, సుభద్ర బలభద్రుల విగ్రహములు గలవు. జగన్నాథుని కొకదిశన లక్ష్మియు, రెండవదిశన సత్యభామయుఁగలదు. సత్యభామా విగ్రహమున కెదురు యింద్రద్యుమ్నుని విగ్రహముకలదు. బలభద్రుని విగ్రహము 6 అడుగులు. జగన్నాథుని విగ్రహము 5 అడుగులు. సుభద్రామూర్తి 4 అడుగుల యెత్తునఁ గలదు.

జగన్నాథుని ముఖ్యమందిరము 214 అ. ఎత్తు 80 అ. వెడల్పు అంతేపొడవును గలిగి యుండును. ఈ మందిరోపరి భాగమున వరాహనృసింహ వామనాది భగవన్మూర్తు లతి సౌందర్యవంతముగఁ జెక్కఁబడి యుండెను. విమాన మందిరమునకుఁ జేరియే సభామందిరము కలదు. ఇది 120 అ. ఎత్తు 80 అ. వెడల్పు అంతే పొడవును గలిగియున్నది. దీనికి జేరియే నృత్యమందిరము భోగమందిరము కలదు. జగన్నాథుని మందిరమునకుఁ బ్రదిక్షిణమును గావించునపు డక్షయ పటము గానవచ్చును. జగన్నాథ మందిరమునకు దక్షిణమున నొక యశ్వత్థవృక్షమును దానికి సమీపమున ముక్తి మంటపముగలదు. జగన్నాథ మందిరములోపల చిన్నచిన్న మందిరములు గలవు. అందు గణేశ మందిరము, దేవరాజుమందిరము మంగలాదేవి, లక్ష్మి, కర్మాబాయి మున్నగునవి ముఖ్యమైనవి.

జగన్నాథుమందిర మొకప్పు డరణ్యప్రాంతము. అందెవ్వరు నివశించెడివారు కారఁట. కాని విశ్వవసువను శంబరుఁ డొకఁ డచ్చట మృగములను వేటాడుచు నివశింపుచుండెడి వాఁడు. ఒకనాఁడు వాని కొక గుహయందు జగన్నాథుని విగ్రహము కనఁబడెను. ఆ విగ్రహమును సందర్శింపఁగనే యతనికి భక్తి మెండయ్యెను. అంతనాతఁడు కందమూలఫలములనుగొని తెచ్చి భగవంతునియందుంచి వీనిని నీవు స్వీకరించినఁగాని నే నేయాహారమును తీసికొనననని పట్టుఁబట్టి కూర్చుండెను. భక్తవత్సలుండగు భగవంతుఁడా మూఢభక్తుని భక్తికి

మెచ్చి ప్రసన్నుఁడై యా ఫలములఁ దినెను. ఇటులఁ జాల కాలము జరిగెను. క్రమముగ నీ విషయ మవంతీప్రభువగు నింద్రద్యుమ్నునకుఁ దెలియవచ్చెను. అంత నాతఁడు చతురంగసేనాపరివృతుఁడై వివిధ వాద్యములతో భగవంతుని సందర్శించుటకు గుహాయొద్దకుఁ జనుదెంచెను. కాని రాజునకు గుహ కనఁబడెనుగాని భగవంతుఁడు కనఁబడలేదు. అందు లకు నృపాలకుఁడు ఖిన్నుఁడై బ్రాహ్మణపండితులను బిలిపించి భగవంతుని సందర్శించు నుపాయ మునుఁ జెప్పుఁడని వేఁడెను. వా రందులకుఁ దీవ్రంబుగ నాలోచించి "నృపాలా! నీ విట దేవునకు రత్నఖచిత మందిరము నొకదానినిఁ గట్టించి యశ్వమేధయాగమును జేసిన భగవద్దర్శన మగునని తెలిపిరి. అంత నింద్రద్యుమ్న డీ మందిరంబును నిర్మించి యశ్వమేధయాగమును గావించెను. ఒకనాటిరాత్రి రాజునకు భగవంతుఁడు కలయందుఁ గనఁబడి 'రాజా! రేపు ప్రాతఃకాలమున సముద్ర తీరమునకుఁ బొమ్ము. అట నీ కొక దేవదారువృక్షము సముద్ర తీర తరంగములఁ దేలియాడుచుఁ గానఁదగును. నీవు దానితో నా మూర్తులను నిర్మించి యట స్థాపించుమని యాజ్ఞాపించెను.

అంత నా నృపాలుఁడు భగవంతుఁ డాదేశించినటులఁ బోయి యా వృక్షమూలములనుఁ గొనితెచ్చి యొక కీర్తిఁ జెందిన శిల్పి నొక్కని రావించి విగ్రహముల నిర్మించుమని యాదేశించెను. అంత నతఁడు 'రాజా! మీ రానతిచ్చి నటులఁ గావింపఁగలను. నేను నిర్మించుప్రదేశమునకు నెవ్వరు రాఁగూడదు. అటుల వచ్చిన నే నచ్చటినుండి నచ్చటనే

వెడలిపోవుదు"నని చెప్పెను. రాజందుల కంగీకరించి యాతని కొక సౌధము నేర్పరించెను.

అంతట నాశిల్పి ప్రవేశించి తలుపులు మూసికొనెను. ఆరునెలలు గడచితను శిల్ప తలుపులు తెరవలేదు. అది కాంచి రాజుతలుపులు బ్రద్దలగొట్టించి యందుం బ్రవేశించెను. అందున్న శిల్పి యంతర్ధానమయ్యెను. విగ్రహములు సగము సగము తయారై యుండెను. ఆ కారణముననే జగన్నాథుని మూర్తి సుందరముగలేదు. ఇందుంగల యుత్సవములలో రథోత్సవము మిక్కిలి ముఖ్యమైనది. చాలం బ్రసిద్ధమైనది. ప్రతిసంవత్సరము ఉత్సవమునకు మూడు పెద్ద రథములను నిర్మింతురు. రథోత్సవము పూర్తికాంగానే వానిని ఇఱుంగంగొట్టి భక్తులకు ముక్కలనొసంగుదురు. ఇట జగన్నాథుని దారు విగ్రహము తయారుచేయబడు జనకపురముకలదు. ఇటంగల మందిరములు చాలం బురాతనములైనవి. దీనికి నొక ½ మైలు దూరమున నింద్రద్యుమ్న సరోవరముగలదు. స్నానముచు గావించుటకు నందమైన సోపానములుగలవు జల మంత స్వచ్ఛముగనుండదు.

ఇందు ఇంద్రద్యుమ్న మహారాజు అశ్వమేధయాగము జేసి, దానికిం జిహ్నముగ దీనిని వినిర్మించెను. ఇటం మూడు మందిరములు గలవు. ఇందొకదానియందు ఇంద్రద్యుమ్న మహారాజు విగ్రహమును. రెండవదానియందు నీలకంఠమహాదేవుని విగ్రహమును, మూండవదానియందుం బద్మనాభుని విగ్రహమును గలవు. ఇందుంగల సరోవరము లన్నిటియందుం

జందనసరోవరము మిక్కిలి పెద్దది. ఇది షుమారు 225 గజముల వెడల్పును, నంతకుమించిన పొడవును గలిగియున్నది.

జగన్నాథదేవాలయమునకు 2 మైళ్ళ దూరమున లోకనాథ మహాదేవుని యాలయము కలదు. ఇందొక జలమందిరము కలదు. ఆ ప్రవాహ మధ్యమున నొక శివలింగము కలదు. ఇందుఁగల శివుని శ్రీరామచంద్రుఁడు ప్రతిష్ఠించెనని చెప్పుదురు. సముద్రతీరమునకు రెండుమైళ్ళ పొడవున స్వర్గ ద్వారముఁ గలదు. దీనికి సమీపమున అమృతకూపమున కలదు. ఇందు నీరు మధురముగ నుండును.

ఇవికాక కర్మాబాయికుటీరము, మలూకాదాశమము గోవర్ధనమఠము, శ్వేతగంగాసరోవరముఁ గలవు. వీనికి సమీపమున చక్రతీర్థము కలదు. ఒకప్పుడు శౌనకాది మహామునులు సూతుని నతి పవిత్రమైయున్న క్షేత్రమాహాత్మ్యమునుగూర్చి తెలుపుమని కోరిరి. అప్పుడు సూతుఁడు ఉడిసాప్రాంతమున పది యోజనముల పొడవును, ఐదు యోజనముల వెడల్పును గలిగియున్న పురుషోత్తమ క్షేత్రమున నీలగిరి పర్వతమున శ్రీమహావిష్ణువు జగన్నాథరూపమున నుండగలఁడని, యీ క్షేత్రము మిక్కిలి మాహాత్మ్యము కలదని పలికెను.

జగన్నాథుని దారురూపము బ్రహ్మ ప్రతిష్ఠించెను. ఇందు మరణించినవారికి ఉత్తమగతులు గలుగునని పద్మపురాణమునఁ గలదు. జగన్నాథక్షేత్రమున పితృశ్రాద్ధమును జేసిన పితృదేవతలు వైకుంఠమునకుఁ జనఁగలరు. [illegible]వారి కితర జన్మము లుండవు.

ఈ క్షేత్రమునఁ బొగడవృక్షము లధికముగఁ గలవు. వీనిమధ్యన రాధాకృష్ణుల మందిరం బతిమనోహరముగ నిర్మింపఁ బడినది ఈక్షేత్ర మనాదియైనది. ఇందు మహర్షులు నివశించెడివారు. దేవతలు స్వయముగవచ్చి జగన్నాథ స్వామిని దర్శించి పూజించెడి వారని ప్రతీతి గలదు.

శ్రీకృష్ణదేవరాయ లీ జగన్నాథుని సందర్శించి యనేకములగు కానుకలను సర్పించెను. ఆంధ్రమహారాణి రుద్రమదేవి జగన్నాథుని సందర్శించి యనేక గ్రామములను స్వామి నిత్యనైవేద్యములకై యర్పించెను.

ఇంతటి పవిత్రమైనది, మహిమోపేతమైనది, అయిన యీ జగన్నాథాలయమును గల ఆంధ్రప్రదేశ్ గాక భారత దేశము కూడ కర్మభూమియను విఖ్యాతిని ద్విగుణీకృతమును నొనర్చుకొనినది.

# మహాబలిపురము

ఏది నిరుపమాన కళాఖండాలకు, ననల్ప శిల్పాలకు స్థానమో, ఏది సుందరతరమై యానందకరమై కన్నులకు విందై పసందైన ప్రకృతికి సంస్థానమో, ఏది చారిత్రాత్మకముగాఁ బౌరాణికముగాఁ బ్రసిద్ధిఁ జెంది ప్రేక్షకుల కానంద సంధానమో, అయ్యదియే మహాబలిపురము.

ఇది మదరాసుకు దక్షిణముగ చెంగల్పట్టుజిల్లాలోఁ గలదు. ఇది పక్షితీర్థమునకుఁ బదిమైళ్ళదూరమునఁ గలదు. మహాబలిపురము సముద్రతీరమునఁ గలదు. ఇందుఁగల గుహామందిరము లనేకములు సముద్రమందు నిర్మింపఁబడినవి. ఇవి రాతితో నిర్మింపఁబడినవి. ఇందుఁ జిత్రింపఁబడిన శిల్పములు ప్రాచీన సంస్కృతికి ననల్ప సౌందర్యమును జాటుచున్నవి.

ఇందుఁగల గుహామందిరము లన్నియుఁ గొండల దొలిచి కట్టఁబడినవి. ఇవి చాలఁ బ్రాచీనములైనవి ఇవి "సలువన్‌కుప్పమ్" గ్రామమునుండి షుమారు నాల్గు మైళ్ళ దూరమువఱకు వ్యాపించియున్నవి. ఇందుఁగల రాతిరథములపైఁగల శిల్పము దాక్షిణాత్యమునకు మచ్చుతునకలు.

ఈ యనల్ప కళా సుందర శిల్పములుగూడిన విగ్రహము లనేకములు గలవు. ప్రాచీన శిల్పకళకు వన్నె తెచ్చు నీ గుహామందిరములు దాక్షిణాత్య శిల్పమునకు మచ్చుతున

కలు. ఇందుఁగల విగ్రహములందు గోవర్ధనధారి యగు శ్రీకృష్ణుఁడు, విష్ణుమూర్తి, దుర్గ, ద్రౌపది, ధర్మరాజు, భీముఁడు, అర్జునుఁడు, వరహావతారము, ఈశ్వరుఁడు మున్నగునవి మిక్కిలి సుందరతరములైన శిల్పములు.

ఇచటకు దాపునఁగల వేదగిరీశ్వరుని మందిరముకలదు. దీని క్రిందుగఁ దృణమంటపము కలదు. దీనికి సమీపమున 6 అ. ఎత్తున నొక పర్వతమునకుస మాస్థలముగు శిలాఖండము కలదు. ఈ శిలకు నిలుదిశల నూచల కటకటాలు కలవు. అటనుండి క్రిందకు దిగుటకు సోపానములు కలవు. ఇఁట నీరెల్లప్పుడుం డును. ఈ పర్వతమునఁ బ్రకృతి దృశ్యము చాల మనోహరముగ నుండును. పండ్రెండు గంటలకు రెండు శ్వేత గృధములాకాశమునందెగురుచుఁ గనఁబడును. కొలఁది నిముషములలో నా పక్షులు పూజారులయొద్దకుఁ జనుదెంచును. అవి ఆహారమును గైకొనును.

ఇందు శంఖశరోవరము గలదు. ఇది చాలఁ బెద్దది. ఇచ్చట శంఖముని వేలకొలఁది సంవత్సరములు తీవ్రముగఁ దపస్సుఁజేసి సిద్ధిజెందెనఁట. ఈ సరస్తీరమునఁ జాల సుందరమైన భవనములు కలవు. దీని దాపునఁ పంచదేవి మందిరము కలదు. దీని ప్రాకారమునకు నాలుగు ద్వారములు కలవు. ఇందు శివుఁడు, విష్ణువు దేవి, సూర్యుఁడు విఘ్నేశ్వరుఁడు మున్నగువారి విగ్రహములు కలవు ప్రాకార తీరమునఁ గొబ్బరిచెట్లధికముగఁ గలవు. వేదగిరీశ్వరుని దేవాలయము

కొండమీఁదఁ గలదు. దీనిని నల్లరాతితో నిర్మింపఁబడెను. ఇది మిక్కిలి సౌందర్యమైన శిల్పము.

మహాబలిపురమునకు శివకాంచి, విష్ణుకాంచి యను రెండు పట్టణములు కలవు. ఇందు గజేంద్రమోక్షము కథ జరిగెనని చెప్పుదురు. హుయాన్‌సాంగు అను ప్రసిద్ధ చీనా యాత్రీకుఁడు దీనిని సందర్శించి ఇది గౌతమ బుద్ధునికంటెఁ ప్రాచీనమైనదని ప్రకటించెను. ఇది బౌద్ధులకుఁ బరమపవిత్ర క్షేత్రము. అశోకుఁడు నిర్మించిన బౌద్ధస్తూపములు కలవు. వైష్ణవాళ్వారులలో పోగై ఆళ్వారును, చాణక్యుఁడును నిందు జన్మించిరి. ఇచట క్రీ॥ శ॥ 12 వ శతాబ్దమున నిర్మించిన గొప్ప జైనదేవాలయము కూడఁ గలదు.

శివకంచిని దక్షిణ కాశియందురు. ఇచట ఏకామ్రేశ్వర దేవాలయము కలదు. దీనిని ఆంధ్రసామ్రాట్ శ్రీకృష్ణదేవ రాయలు క్రీ॥ శ॥ 150 సంవత్సరమున నిర్మించెను. శ్రీకైలా సనాధాలయమును రాణీసింహమహారాజు కట్టించెను. పల్లవుల నాటి శిల్పమిచ్చటఁ జూడముచ్చటగా నుండును.

మహాబలిపురము చారిత్రక ప్రసిద్ధమైన ప్రదేశము. క్రీ॥ శ॥ 5–౦ శతాబ్దములలో పల్లవరాజులు, చోళరాజులు ఇందలి శిల్పములను జిత్రించిరని తెలియుచున్నది. దీనికి దాపుగా గల శివకంచిలో పార్వతి యిసుకమయమగు శివ లింగమును పూజించుచు వేలకొలఁది సం॥లు తపస్సు జేసెను. విష్ణు కంచి మిక్కిలి విశాలముగలిగి సుందరమైన విష్ణుమందిరము–

మందిర ప్రాకారమొక 1000 అ. పొడవును 600 అ. వెడల్పును గలిగి యున్నది. భగవద్విగ్రహము షుమారు 4 గ. పొడవు గలదు ఈ రెండు నగరములును భారత వీరుఁడైన యర్జునుని మనమడగు పరీక్షిత్తుని కొమరుఁడు జనమేజయుఁడు నిర్మించెను.

మహాపురము బలిచక్రవర్తిగాథకు సంబంధ మున్నదని వదంతి కలదు. ఏదియెట్లైనను చారిత్రాత్మకముగఁ గళావంతముగఁ బ్రసిద్ధిఁజెందినదీ పురము. ప్రతినిత్యము వేలకొలఁది యాత్రీకు లిచ్చటకు వచ్చి యీ విగ్రహ శిల్పవిన్నాణమున కబ్బురపడుచుందురు.

ప్రాచీన శిల్పుల శిల్పప్రావీణ్యమునకుఁ బ్రతిబింబముగా నున్నదీ మహాబలిపురము. మదరాసు వెళ్ళినప్పుడు మాత్రము తప్పక వెళ్ళి చూడఁదగిన శిల్పకళాఖండ మనుటలో సందేహ మిసుమంతలేదు.

257

# మ ధు ర

(దక్షిణభారతము)

దాక్షిణాత్య చారిత్రాత్మక ప్రదేశములలోను, పౌరాణేతిహాసక ప్రదేశములలోను మిక్కిలి ప్రఖ్యాతిగాంచినదీ మధురానగరము ఇది వైగై నదీతీరమునఁ గలదు. అనాదిగానీ పట్టణము సంస్కృత-సాహిత్యములకుఁ గాణాచిగాఁ నుండెడిది. పూర్వము పాండ్యరాజులు దీనిని ముఖ్యపట్టణముగాఁ జేసుకొని పాండ్యరాజులు పరిపాలించిరి. ఆ కాలమున జరిగిన కోవలెన్ కన్నకి చరిత్ర ప్రసిద్ధమైనది. కన్నకి మహా పతివ్రత. పాండ్యరాజు అకారణముగా కోవలెన్ను జంపుటతో కన్నకికి కోపముగలిగి. మధుర దరహాసముగునటుల శపించెను వెంటనే మధురాపట్టణ మంతయు దహనమయ్యెను. ఆ ప్రదేశ మిప్పటికిఁ గలదు. తరువాత క్రీ॥ శ॥ 17 వ శతాబ్దమున నాయక రాజులు దీనిని నిర్మించిరి.

ఈ మధురాపట్టణమున మీనాక్షీ సుందరేశ్వరుల మందిరము కలదు. ఇది చాల పెద్దమందిరము. ఇరువదిరెండెకరముల భూమియందు నిర్మింపఁబడినది. ఈ మందిరము పొడవు 850 అడుగులు. వెడల్పు 350 అడుగులు. ఈ దేవాలయమెల్ల యొకేరాతితో నిర్మించిరా యనునట్లుండును. ఈ మందిరము రెండు భాగములుగఁ గలదు. దక్షిణభాగమున మీనాక్షీదేవి, ఉత్తరభాగమున సుందరేశ్వరుని విగ్రహములు

కలవు. ఇమ్మందిరమునఁగల పాలరాతితనము చాలా సొంపుగ నుండును. బహిర్ద్వారమునుండి మందిరమువఱకు గల మంటప స్తంభములందు లక్ష్మీవిగ్రహము మలపఁబడియున్నది.

ఇవి మొత్తము 8 స్తంభములు. అందుచేతనే దీని కష్ట మంటపమని యందురు. మందిరము లోపలభాగమున స్వర్ణ పుష్కరిణి యను సరస్సు గలదు. ఈ సరస్సునకు నలువైపుల నొక మండపము కలదు ఉత్తర పశ్చిమ దిశలందు మనోహ రంబులగు విగ్రహములు మలఁచఁబడి యున్నవి. మీనాక్షీ దేవి విగ్రహము పాలరాతితో నిర్మింపఁబడి చాల నంద ముగ నుండును. ఈ విగ్రహము పూర్వముఖంబై యున్నది. ఇమ్మందిరంబునఁ జాల దేవతావిగ్రహంబులు గలవు. సర్వదా దీపంబులు వెలుగుచుండును.

మీనాక్షీ మందిరమున కెదుట స్వర్ణరంజితమగు నొక స్తంభము కలదు. ఇఁటకూడ ననేక దీపములు వెలుగు చుండును. మందిరద్వారమునం దొక స్వర్ణ స్తంభము కలదు. ఇమ్మందిరంబునకుఁ దూర్పున తిరుమలైనాయఁడు నిర్మించిన విశాల మందిరము కలదు. దీనిని నిర్మించుటకు కోటి షిల్లిం గులు వ్యయమయ్యెను. ఇచ్చట సహస్రమంటపముల స్తంభ ముల మంటపములో నొక్కొక్క దానికి యేకశిలా నిర్మితమై నటు లుండును. ఇచట తిరుమలనాయకుని భవనము కలదు. దక్షిణదేశపు మొత్తముమీఁద నింతటి యపూర్వమైనసౌధము లేదు.

మధురకు షుమారు 5 మైళ్ళ దూరమున సుబ్రహ్మణ్యేశ్వర గుహాలయము కలదు. మఱియు షుమారు 7 మైళ్ళ లోపున అలగారుకోయిల అను దేవాలయము కలదు. భారత రామాయణములలో నీ మధురాక్షేత్రమును గూర్చి మిక్కిలి వర్ణింపఁ బడినది. మధురకు మూఁడు మైళ్ళ దూరమున తెప్ప చెఱువు గలదు. ఇది 1200 గజముల పొడవు. అంతియే వెడల్పుగలిగి యుండును దీనికి నలుదిసల రాతితో నిర్మింపఁ బడిన రేవులు కలవు. చెఱువునకు మధ్య నొక ద్వీపము గలదు. అందొక మందిరము కలదు. చెఱువునకు నాలుగు దిశల నాలుగు మందిరములు కలవు ద్వీపమునందందమైన యొక యుద్యానవనము కలదు. ప్రతిసంవత్సరము మహోత్సవమిందు జరుగును.

మధురకు షుమారు 70 మైళ్ళ దూరమున కొడైకెనాలు అను సుందర పర్వతము కలదు ఇది విశ్రాంతి కేంద్రము. ఇది సముద్రమునకు 7000 అ. ఎత్తునఁ గలదు. ఇది భూమధ్య రేఖ సమీపమందుండుటచే నిచ్చట శీతోష్ణస్థితి సమధాతువుగ నుండును. ఇచ్చట కొకగుబాటకు షుమారు 3 మైళ్ళ దూరమున 40 అ ఎత్తుఁగల స్తంభపురాళ్లు అను పేరుగల 3 నల్లరాతి మిట్టలు గలవు. ఇటకుఁ బోవుమార్గము చాల మనోహరముగ నుండును ఇందు నొక సరస్సుగలదు. ఇది షుమారు 3 మైళ్లు విస్తీర్ణము గలిగి అతి మనోహరముగ నుండును.

మధురకు షుమారు 25 మైళ్ళదూరమున విల్లిపుత్తూరు కలదు. శ్రీకృష్ణదేవరాయలు తాను రచించిన యాముక్త

మాల్యదయం దీ నగరమునుగూర్చి మిక్కిలి వర్ణింపఁ బడినది. దీనికి షుమారు 27 మైళ్ళ దూరమున శంకరనారాయణ కోవెల కలదు దీనినిఁ బూర్వము పాండ్యరాజులు పరిపాలించువారు ఇందుఁగూర్చి యొక కథ కలదు. ఒక నృపాలుఁడు శివుని ద్వేషించి విష్ణుమూర్తిని సేవింపఁ దొడంగెను. అప్పుడు భగవంతుఁడు శివనారాయణరూపమున సంజనించెను.

దీనికి షుమారు 2 మైళ్ళ దూరమున డెంకాసి కలదు. ఇందుఁగల కాశీవిశ్వనాథాలయ గోపురమును మహమ్మదీయులు సగము దహనము చేసిరి. ఆ చిహ్నములు నేటికిఁ గానఁదగును. ఇది చిత్రానది తీరమునఁ గలదు. ఇచ్చటి దేవాలయ శిల్ప మప్రతిమానమైనది. దీనికి షుమారు 3 మైళ్ళ దూరమున కుర్తాళము కలదు. ఇచ్చటఁ జిత్రానది యొక కొండపైనుండి షుమారు 55 అడుగుల యెత్తునుండి పడుచుండును. ఈ జలపాతము చూచుటకుఁ గన్నులపండువగనుండును.

జలపాతమునకు సమీపంబుననే వేణునాథ వాణీ అగస్త్యనాథ మందిరము కలదు చిత్రానది జలపాతము వనమూలికలఁ గూడియుండుటచే నియమపూర్వక స్నానమాత్రమున నఖిలవ్యాధు లంతరింపఁగలవు. ఈ పరిసర ప్రదేశమంతయు నందమైన ప్రకృతికి జన్మభూమి. ఇందుఁ గాంచుచున్న కొలఁది యాహ్లాదమును గలిగింపుచుండును.

మధురనుండి దిగువన షుమారు 150 మైళ్ళ దూరమునఁ బవిత్రక్షేత్రముగను. చారిత్రాత్మక ప్రదేశముగను

ప్రసిద్ధి నొందినది చిదంబర క్షేత్రము. ఇది దక్షిణ ఆర్కాటు జిల్లాలో సముద్రతీరమునకు 5 మైళ్ళ దూరమున గలదు. ఈ నగరమునకు దక్షిణముగ కావేరినది ప్రవహించుచుండును. ప్రఖ్యాతిగాంచిన పంచలింగములలో గల యాకాశలింగ మిచ్చట గలదు ఇందుగలస్వామి నటేశ్వరుడు ఇమ్మందిర ప్రాకారమునకు నలుదిశల దొమ్మిదియంతస్థులగల నాలుగు గోపురములు కలవు ఈ గోపురముల మీద ననేక విగ్రహములు చిత్రములు చిత్రాతి చిత్రములుగ గళాఖండములుగ జిత్రింపబడియున్నవి.

నటేశమందిరము, శివగంగా సరోవరము ఇంక జాల మందిరంబులు గలవు. నటేశమందిరమునకు దక్షిణ పశ్చిమముగ పార్వతీ మందిరము గలదు. శిఖరంబున బంగారంబును బూయబడి యుండెను. విష్ణుమందిరమునకు రాగిరేకులతో గప్పబడి యుండును. దీనికెదుట నొక స్వర్ణకుండము గలదు. దీనికి గనకసభయని పిలుతురు. ఇందుగల పార్వతీ మందిర మతిసుందరాతి సుందరంబైనది.

ఇట చిదంబర రహస్యము చాల ప్రసిద్ధమైనది. జ్యోతికి దెరవైచి యుండును. లోనగల జ్యోతియే చిదంబర రహస్యమైయున్నది. ఇట జరిగిన నందునిచరిత్ర ప్రసిద్ధమై యున్నది. ఇప్పటికి నటేశ్వరుడు తాను నందునికి గనబడుటకు నవకాశము గల్పించుటకు గోడపగిలి రెండు భాగములగునటుల జేసెను. ఆ చిహ్నము నేటికి గలదు. చోళరాజు

లీ స్వామికనేకములగు కానుకలు, భూములొసంగి తమ శైవ భక్తిని వెల్లడించిరి. ఇచ్చటి శిల్పము 108 ముద్రలు మిక్కిలి యందము గలిగియుండును. ఈ క్షేత్రమునకు నవినాభావ సంబంధముగల నందునికథ :-

నందుఁడు మాలవాఁడు. అతఁడు చిన్ననాఁటినుండియు నటేశ్వరస్వామి యందు మిక్కిలి భక్తి గలిగినవాఁడు. అతఁడొక భాగ్యవంతునికడ నౌకరుగా నుండెను అతని బంధుగు లెంత వారించినను, నటేశ్వరభక్తి మానలేదు. యజమాని యనేక విధములనందుని బాధలఁబెట్టెను. నటరాజస్వామి నందునికొఱకు యజమానికి ననేకరీతుల సేవఁజేసెను. నటరాజోత్సవములకుఁ బోవుటకు నందుఁడుత్సాహపడెను. చివర కెటులో ప్రయత్నించిచేరెను. అచట నందుఁడు స్వామిని సందర్శించుటకు నవకాశము లేక పోయెను. అప్పుడు స్వామి కరుణించి నందునికిఁ బ్రత్యక్షమయ్యెను. నాటినుండి నందుఁడు కీర్తిఁగలిగి శివసాయుజ్యమును జెందెను.

చిదంబరమునకు షుమారు 22 మైళ్ళ దూరమున మాయవరము కలదు. ఇది కావేరితీరము. ఇంటఁ బ్రసిద్ధమగు శివమందిరము గలదు. ఇమ్మందిరమున నొక పెద్ద గోపురము నొకచిన్న గోపురము గలదు.

దీనికిఁ బందొమ్మిది మైళ్ళ దూరమునఁ గుంభకోణము కలదు. ఇందు కుంభేశ్వర మహాదేవమందిరము కలదు. దీనికి రెండు ఫర్లాంగుల దూరమున మహా మోహాన సరస్సుకలదు.

ఈ సరోవరతీరమునఁ బదునారు మందిరములు కలవు. ఈ నగరము చాలఁ బ్రాచీనమైనది. ఇది కీర్తిఁగాంచిన విద్యాకేంద్రము. ఇం దనుపమాన విద్యావేత్తలు కలరు. ఇచ్చట మహాత్ములగు కామకోటి పీఠాధిపతు లుందురు ఇక్కడనే మార్కండేయుఁడు శివునిఁగూర్చి ఘోరమగు తపస్సుఁ జేసి చిరంజీవి యయ్యెను.

మృకండమహర్షి దంపతులు శివునిఁగూర్చి తపస్సుఁ జేసి మహాభక్తిపరుఁడైన దీర్ఘాయువులేని యొక్క పుత్రుని పరమేశ్వరవరమునఁ బడసిరి. పిదపఁ గొన్నాళ్ళకు నా మహర్షి దంపతులకు మార్కండేయుఁడను కుమారుఁడు జన్మించెను. ఆ బాలుఁడు దినదినప్రవర్ధమానుఁడై పరమేశ్వర భక్తుఁడయ్యెను. ఇట్లుండ నారదునివలనఁ దన యాయుఃప్రమాణమును నెఱింగి, నాఁటిదినమునఁ బరమేశ్వరవిగ్రహము కడకుఁ జేరి యా స్వామిని కౌఁగలించుకొని రక్షింపుమని కోరెను.

మార్కండేయుని ప్రాణములను గొనుటకు యమధర్మరాజే స్వయముగ వచ్చెను. అంత నా యముఁడు మార్కండేయుని కంఠమునకుఁ బాశము దగిలించి జీవములను గొనిపోవుటకై యత్నించుచుండెను. అంత నా మార్కండేయుఁడు పరమశివునికి నాక్రందనమును గావించెను. అంతట శివుఁడు లింగమునం దుద్భవించి యమునిఁ గూల్చి మార్కండేయునిఁ గాపాడెను. పిదప దేవుల ప్రార్థనమీఁదఁ దిరిగి శివుఁడు యముని బ్రతికించి మార్కండేయుని చిరంజీవిగఁ జేసెను. దీనికి దాపుగా తంజావూరు కలదు. ఇందు బ్రహ్మాండమైన

కోటలు రెండు కలవు. ఇందు బృహదీశ్వరాలయము కలదు. దీనిని రాజరాజచోళుఁడు నిర్మించెను. ఇందు 12 అడుగుల యెత్తు 16 అడుగుల పొడవు గలిగిన నందీశ్వరవిగ్రహము గలదు.

ఈ దేవాలయమునకు నుత్తరముగ శివగంగ యను నొక పెద్ద సరస్సు కలదు. ఇచట సరస్వతీభవనమను నొక పెద్ద గ్రంథాలయముఁ గలదు. ఇందు ఎనిమిదివేల సంస్కృత గ్రంథములు కలవు. ఇవి తాళపత్ర లిఖిత గ్రంథములు. భారత దేశమునం దిది పెద్ద గ్రంథాలయము. ఈ పట్టణము మిక్కిలి సుందరమైనది. ఇటకు షుమారు ఏడు మైళ్ళ దూరమున తిరువాడి లేక తిరువయ్యూరు అను స్థలము కలదు. ఇదియే మహా భక్తాగ్రగణ్యుఁడైన శ్రీ త్యాగరాజస్వామివారి జన్మస్థానము.



# శ్రీ రంగము

దక్షిణ భారతదేశములో మిక్కిలి ప్రఖ్యాతిఁ గాంచినది శ్రీరంగము. అది పవిత్రమైన క్షేత్రముగను చారిత్రాత్మక స్థలముగ కీర్తిఁగాంచినది. ఇది తిరుచునాపల్లికి షుమారు 3 మైళ్ళ దూరమునఁ గలదు. దీనినే భూలోకవైకుంఠమందురు. పూర్వము శ్రీరంగ విమానమున బ్రహ్మదగ్గరనుండి పూజకై ఇక్ష్వాకు వంశజులు గొని తెచ్చిరి. లంకాధినేత విభీషుణుఁడు శ్రీరామచంద్రుఁడు గావించు నశ్వమేధ యాగమును సందర్శించుటకై అయోధ్యకుఁ వచ్చెను. అప్పుడు శ్రీరాముఁడు విభీషణునకీ విమానమును బహూకరించెను. అంతట విభీషణుండు శ్రీరామునకు సాష్టాంగ నమస్కారములఁ గావించి స్వీకరించెను.

పిదప నతండద్దానిపై నధిరోహించి పోవుచు, మార్గమధ్యమున చోళరాజగు ధర్మవర్మచేఁ బ్రార్థింపఁబడి, యతఁడు గావించు బ్రహ్మోత్సవములోఁ బాల్గొనెను. ఉత్సవానంతరము విభీషణుడు పయనమై విమానముకదలింప నదికదలక పోయెను. అంతట రంగనాధుఁడు గనఁబడి తనకు నదియచ్చట నుండుట యభిమతమని పలికెను. అందులకు విభీషణుం డంగీకరించి దాని నచ్చటనుండి, తానులంకకుఁ బోయెను.

చోళరాజు ధర్మవర్మ దేవాలయ ప్రథమప్రాకారమును నిర్మించెను. కాలక్రమమున నది యిసుకలోఁ గూరుక పోగా కిరికండ చోళుఁడు దానిని పునరుద్ధరించెను. రాజమహేంద్ర చోళుఁడు 2 వ ప్రాకారమును గట్టించెను. కులశేఖర అళ్వారులు, మూడవప్రాకారమును, తిరుమంగి అళ్వారు 4 వ ప్రాకారమును, 5, 6 ప్రాకారములను అకలంక చోళుఁడు, త్రివిక్రముఁడు, 7 వ ప్రాకారమును పాలికండ చోళుఁడు నిర్మించిరి. చోళరాజులకాలములో నిది మిక్కిలి ప్రసిద్ధిఁ జెందెను.

విజయనగర సంస్థాపనతోఁ దిరిగి దీని వైభవ మధికమయ్యెను. నాయక మహారాష్ట్రులు శ్రీరంగ దేవాలయాభివృద్ధికై మిక్కిలి పాటుఁబడిరి ఆండాళ్, అరుపని అళ్వార్లు, బీబీ నాంచారు మున్నగు మతకర్తలిచటనే తమ జీవితములను గడిపిరి. అళ్వారు ఆచార్యులు శ్రీరంగనాథునిపై నాల్గువేల కీర్తనలు వ్రాసిరి. శ్రీరంగనాథుని దేవాలయము మిక్కిలి పెద్దది. దూరమున నదొక పెద్ద కోటవలె గోచరించును. ఇందుఁగల విగ్రహము భారతదేశ మందెచ్చటలేదు. ఇందుగల శిల్పము అల్పమైనది. దాక్షిణాత్య శిల్పమున నిది కొణాచిదైనది. ఇట భగవంతుఁడు శేషాహిపై శయనించి నటులఁ గలదు. కంఠమున బంగారు యజ్ఞోపవీతము దేహము శ్యామల వర్ణరంజితమై మనోజ్ఞముగ నుండును.

శ్రీరంగమునకు మైలుదూరమున జంబుకేశ్వర లింగము కలదు. ఇది ఆపోలింగము. పరమేశ్వరుని యష్టమూర్తులలో

నొకటి ఇచట నీ శివలింగము జలపాతముమీఁదఁ గలదు. అందుచే శివలింగము యొద్దనుండి జలముబయటకు వచ్చు నటులఁ గనఁబడును. ఇది 5 ప్రాకారములు గలిగి సుందర శిల్పకళా శోభితమై యుండును. ఈ స్థానము మిక్కిలి మనోహరము. ఇమ్మందిరము క్రీ॥ శ॥ 17 వ శతాబ్దమున నిర్మింపఁబడెను. ఇచ్చట అఖిలాండేశ్వరి దేవాలయమెంతో యాకర్షణీయంబుగ శిల్పకళా ఖండంబుగా నుండును తంజావూరుకు షుమారు 26 మైళ్ళ దూరమున మన్నారుగుడి కలదు. ఇందనేక ప్రసిద్ధిఁజెందిన చారిత్రాత్మక ప్రదేశములు కలవు. ఇక్కడికిఁ దాపుగాను తిరువారూరుకూడఁ బ్రసిద్ధ పుణ్యక్షేత్రమే. ఇందు వల్మీకేశ్వర మందిరము కలదు. ఇది షుమారు 32 యకరముల భూభాగమునకు వ్యాపించియున్నది. ఇందుఁ గల సరోవర మధ్యమునందొక మంటపము కలదు. ఇచ్చటఁ బుట్టనుండి శివుఁ డుద్భవించియుండుటచే నీ స్వామికి వల్మీకేశ్వరుఁడని పేరుగలిగెను నేటికిని నా పుట్టచిహ్నములుఁ గనఁబడుచున్నవి. ఆలయమంతయు శిల్పకళా శోభితమై యున్నది. ఆలయమునకు ముందున్న మంటపము పై భాగమున, నక్షత్రాధిదేవతల విగ్రహములు అష్టదిక్పాలకుల విగ్రహములుగలవు. కమలాంబికాదేవి విగ్రహము దపమాచరించు చున్నటులున్నది. ఇందు శంకరతీర్థ మను కుండముకలదు.

భక్తిపారవశ్యమైన సంగీతమునందు, దేశమును నుఱ్ఱూతలూగించిన శ్రీ త్యాగరాజస్వామి యీ తిరువూరు నందే సంజనించెను వీరి తాతగారగు గిరిరాజ బ్రహ్మముగారు,

కర్నూలుజిల్లా కాకర్ల గ్రామమునుండి ఇచటకు వలసవచ్చిరి. త్యాగరాజు బాల్యమునిచ్చటనేగడిపెను. కాని తిరువయ్యారు నకుఁ బోయి యచ్చట నివశించెను. అమ్మహాను భావుఁడు సంగీతశాస్త్ర ప్రవీణుఁడే కాక మహాభక్తిపరుఁడు. జీవితము నందనేక పర్యాయాములు శ్రీరామదర్శన మహాభాగ్యమును బొందిన మహాభాగవతోత్తముఁడు. ఇందు నేటికినిభక్తులు త్యాగరాజస్వామి నడచిన వీధులంకుఁ బడి దొరలాడు చుందురు. ముచికుందుఁడు దేవేంద్రునిఁ బ్రార్థించి విగ్రహము గొనితెచ్చి, యొక యాలయమును నిర్మించి, యందుఁ దానిని బ్రతిష్ఠఁజేసెను. ఈ స్వామినే త్యాగరాజస్వామి యందురు. దీనికెదుట సహస్ర స్తంభములతో నలరారు నొక మంటపము గలదు. ఇట హాటకేశ్వరస్వామి యాలయము గలదు. ఈ దేవాలయంబున నొక పాతాళమార్గము గలదు.

మనునీతి చోళుఁడను నృపాలకుండీ నగరంబును పాలించెను. అతఁడు నిత్యసత్య ధర్మపరుఁడు. ఇతని ధర్మబుద్ధినిఁ బరీక్షించుటకుఁ బరమేశ్వరుఁడు ధేనువగను, యముఁడు వత్సంబుగను రూపంబులను ధరించి వచ్చిరి. ఆ సమయమున యువరాజు పుష్పోద్యానమునకు రథారూఢుఁడై పోవుచుండెను. ఆవుదూడ రథము క్రిందఁబడి మృతిఁజెందెను ఈ విషయమును మనునీతిచోళుఁడు విని, తన కుమారునిగూడ రథము క్రిందఁ బడవైచి కూల్చెను. అంతట పరమేశ్వర యములాతని ధర్మబుద్ధికిమెచ్చి నిజరూపములఁదాల్చి ప్రత్యక్షమై, యతని కుమారుని బ్రతికించి యనుగ్రహించెను. ఈ కథను సూచించు

రాతిరథము, రాజకుమారుని విగ్రహము, అవుదూడ విగ్ర హము, ఆవువిగ్రహము కలవు. దీనికి షుమారు 38 మైళ్ళ దూరమున వేదారణ్యము గలదు. ఇది సముద్రతీరమున నున్నది. ఇచటఁ బురాతనమైన దేవాలయము కలదు. ఈ స్వామియే వేదారణ్యుండు. శ్రీరాముడు రావణ సంహా రమునకుఁ బోవుచు, విజయ సంసిద్ధికై యీ స్వామినిఁ బూ జించెను. దీనికి దాపుగ అగస్త్య మహాముని నివసించిన అగస్త్యంపల్లియను గ్రామమున అగస్త్యుని విగ్రహము కలదు. అతఁడు వాతాపియను రాక్షసుని అగస్త్యకొండలపైని జీర్ణము జేసి కొనెను.

వేదారణ్యమునకు షుమారు 100 మైళ్ళ దూరమున పుదుకోట కలదు. దానికి షుమారు 18 మైళ్ళ దూరమున రామనాథము కలదు. ఇది వైగనదీ తీరమున నున్నది ఇది తుపతిరాజులకు రాజధాని. రామపదమునకు పవిత్రక్షేత్ర మైన శ్రీరామేశ్వరము కలదు. షుమారు ఇది మధురకు 133 మైళ్లు. ఇది షుమారు 11 మైళ్లు పొడవు 7 మైళ్లుగల వెడల్పు గలిగియుండును. శ్రీరామచంద్రుఁడు నిర్మించిన సేతు పిచ్చ టనే కలదు. సూర్యోదయమునం దీ సేతువు విస్పష్టముగనప్పు డప్పుడు గనఁబడును. విభీషణుని ప్రార్థన ననుసరించి శ్రీరా ముడే సేతువును ఖండించివైచెను. ఈ ప్రాంతమును బూర్వ ము గంధమాదన పర్వతమని పిలిచెడివారు. శ్రీరాముఁడు సేతువును నిర్మింపఁబూనినప్ప టీ పర్వతము వారికడ్డగించె నఁట. అంత శ్రీరాముఁడానతీయగ హనుమంతుఁ డీ పర్వ తమును నణఁచివైచెను. అంత శ్రీరాముడు సేతుని నిర్మాణ

మునకుఁ బూర్వమిఁట నొక శివలింగంబునుఁ బ్రతిష్ఠింపనెంచి, కైలాసమునుండి, శివలింగమును గొనిరమ్మని యాంజనేయుని కాజ్ఞాపించెను. కాని హనుమంతుఁడరు దెంచుట కాలస్యము కాఁగ, శ్రీరామచంద్రుఁడిట సైకతలింగమును బ్రతిష్ఠించెను. పిదపఁ దన వింటికొనవలన గంగను జనింపఁజేసి పరమేశ్వరున కభిషేకించెను. ఇంతలో హనుమంతుఁడు శివలింగమును గొని తెచ్చెను. అంత నా శ్రీరాముఁడు దాను ప్రతిష్ఠించిన లింగమున కెడమదిశగా నా లింగమును ప్రతిష్ఠించెను. దీనిని హనుమదీశ్వరుఁడందురు. రామేశ్వర మందిరము 1000 అ. పొడవు 600 అ. వెడల్పు 156 అ. ఎత్తుకలిగి దీర్ఘచతురస్రాకారముగఁ గలదు. ఇదియే రామలింగేశ్వర స్వామి వారి యాలయము. దక్షిణాది శిల్పుల నిర్మాణ కుశలత్వమునకు నప్రతిమాన మేధాసంపదకు మిక్కిలి నిదర్శనము. ఇందుఁగల శిల్ప సంపద యపూర్వమైనది.

ఈ దేవాలయమును రామనాధ పరిపాలకులగు సేతుపతులచే నిర్మింపఁబడినది. మందిరమునకుఁ బ్రదక్షిణమును గావించునప్పుడు శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల విగ్రహములు కనఁబడును. రామేశ్వర మందిరమునకుఁ గుడివైపునఁ బార్వతీమందిరము కలదు. రామేశ్వరమునకుఁ దూర్పున సముద్రమున నొక ఘట్టముగలదు. శ్రీరాముఁడు లంకనుండి వచ్చుచు నిచటనే పుష్పకమునుండి దిగెనఁట. దీని నగ్ని

తీర్థమందుగు. ఇచట శ్రీరామ చరణచిహ్నములు, సుగ్రీవ తీర్థము, లక్ష్మణసరోవరము, ధనుష్కోటితీర్థము, కోటితీర్థము. గాయత్రీ తీర్థము మున్నగునవి కలవు.

రామేశ్వరమునకు షుమారు 2 మైళ్ళ దూరమున శ్రీరామ మంటపముగలదు. శ్రీరాముఁడు లంకకుఁబోవుచుఁ దన సైన్యమును బరీక్షించెను. ఈ మార్గమున సుగ్రీవకుండము కలదు. ఒకప్పుడు సుగ్రీవుఁడు తన గదతో నీఁట భూమిమీదఁ గొట్టెను. అంత నటనుండి నీరు వెడలెను. ఈ ప్రదేశ మత్యంత మనోజ్ఞముగనుండును. ఇచ్చటకు రెండు మైళ్ళ దూరమున ధనుష్కోటికలదు. ఇచ్చటఁ దూర్పు పశ్చిమ సముద్రముల కలియుప్రదేశమిటకుఁ బదునారుమైళ్ళ దూరమునఁ బాంబన్ కలదు. ఇచ్చట జూడదగినది భైరవాలయము. ఇచ్చటనుండి షుమారు 22 మైళ్ళ దూరమున దర్భశయనముగలదు పూర్వము రాముఁడిచ్చటనే సముద్రమును దాటుటకు దర్భశయనుఁడై సముద్రునిఁ బ్రార్థించెను. ఇచ్చటకు సముద్రము షుమారు 3 మైళ్ళుండును. ఇచ్చట శ్రీరామాలయము, జగన్నాథాలయము కలవు. ఇందలి శిల్పము మోఘమైనది. దక్షిణాది శిల్పవిన్నాణమునకిది మచ్చుతునక. ఇచ్చట శ్రీరాముఁడు శేషశయనుఁడై యుండును. రామనాదమునకు షుమారు పదునారుమైళ్ళ దూరమున దేవిపట్టనముగలదు. ఇచ్చట సముద్రమున నీటిలోఁగొలది దూర

మున నవగ్రహములు పాషాణరూపమునఁగలవు. శ్రీరామ చంద్రమూర్తి రావణసంహారమున కేఁగుచు, నవగ్రహ శాంతికై వీని నిచ్చటఁ బ్రతిష్ఠించి పూజించెను. ఇది పవిత్ర మైన ప్రదేశము.



# మైసూరు

సహజ సౌందర్యమైన ప్రకృతికి, అపురూప శిల్పకళా ఖండాలకు అనుపమాన చిత్రకళాశోభకు నిలయమైనది. మైసూరుదేవి మహిషాసురుని గూల్చినదీ ప్రదేశముననే. అందుచే మహిషాసుర శబ్దమునుండి మైసూరు పుట్టినది. ఇటకు షుమారు బెంగుళూరు 86 మైళ్లుండును. ఇప్పట్టణమతి సౌందర్య వంతమైనది. ఇక్కడ నదులనేకంబులు గలవు. దక్షిణమునఁ గావేరి తూర్పున నెగువపెన్నా, దిగువపెన్నా ఉత్తరదిక్కునఁ దుంగభద్రానదులు కలవు. మైసూరునదులు మిక్కిలి యందమైనవి. వీనిలో చిరుతలు, పెద్దపులులు, సింహాలు, సివంగులు, దుప్పులు, ఏనుగులు విహరించు చుండును. అందమైనజలపాతము లిందుఁ గలవు. భారతదేశమునం దీ పట్టణము జగన్మోహన మైనది.

మైసూరు సౌందర్యవంతమైన మహారాజాగారి భవనము చూడఁదగినది. ఇందుఁగల లలితాభవనము, చెన్నకేశవస్వామి అలయము, కొండపైన చాముండీ దేవాలయమును, కోటలోని ఉద్యానవనములెంతో యందమై కన్నుల పండువగా నుండును. మైసూరు మహారాజు విజయనగర రాజు వంశీకుఁడు. ఇమ్మహారాజధిష్ఠితమగు సింహాసనము పాండ[illegible] [illegible] ధర్మరాజు [illegible] సింహాసనమని ప్రతీతి [illegible]ము. [illegible]
ఉ[illegible]

రాజు సింహాసనమధిష్ఠించి దర్బారు చేయును. ఆ సమయమున నందఱు నందుఁజేరి, యుయ్యుత్సవములఁ దిలకింప వచ్చును.

మైసూరుకు రెండుమైళ్ళ దూరమునఁ గొండపైనిఁ జాముండీదేవి యాలయముగలదు. ఈ కొండ సముద్రమునకు 3,489 అడుగులయెత్తునఁగలదు. కొండమీాదనుండి చూచినచో మైసూరు పట్టణంబంతయు గనఁబడును. ఛాముండీయాలయ గోపురము చాలఁబెద్దది. క్రీ॥ శ॥ 17 వ శతాబ్దమున దొడ్డదేవ రాజు యీా కొండకు సోపానంబులు నిర్మించెను. మార్గమున 16 అ ఎత్తుగల నందివిగ్రహము కలదు. దీనికి దక్షిణమున బసవేశ్వరమందిరము కలదు. దీనికి క్రీ॥ శ॥ 1128 లో విష్ణు వర్ధనుఁడు, క్రీ॥ శ॥ 1620 లో చంద్రగిరిరాజు లీనాము లొసంగిరి.

మైసూరుకు దక్షిణముగా షుమారు 15 మైళ్ళ దూరమున నంజన్‌గుడి కలదు. నంజన్‌గుడి యనగా విషము త్రాగువాని పట్టణమని యర్థము ఇచ్చట 385 అ. పొడవు 160 అ వెడల్పుకలిగి 147 రాతిస్తంభములుగల నంజుడేశ్వర మహాదేవమందిరము కలదు. ఈ మహాదేవుని నీలకంఠుఁడని కూడఁ బిలుతురు. ఈ యాలయమును ద్రావిడ సాంప్రదాయములతో నిర్మింపఁబడినది. ప్రాకారమున 63 శైవభక్తుల చిన్న మందిరములుగలవు. దీనికి దగ్గరగా చూర్ణావతియను నదికలదు. పరశురామాలయ మిందుఁగలదు. ఇది క్రీ॥ శ॥ 15 వ శతాబ్దమున నిర్మింపఁబడినది. మైసూరుకు షుమారు 40 మైళ్ళ దూరమున సోమనాధపురము కలదు. ఇచ్చటనే సుగ్రీవుఁడు విహరించిన మధువనమున్నది.

ఇందుఁ। బసన్న చెన్న కేశవస్వామి యాలయముఁకూడఁ గలదు. దీనిని క్రీ॥ శ॥ 1270 లో హోసలాబల్లాక్ వంశీయుఁడగు సోమనాథుఁడను నున్నతోద్యోగి నిర్మించెను. ఇమ్మందిరంబందలి శిల్పంబతి సుందరంబైనది. మైసూరుకు షుమారు 9 మైళ్ళ దూరమున శ్రీరంగ పట్టణము కలదు కావేరి నది పశ్చిమతీరంబు నందొక కోటకలదు. ఇచ్చటఁగల లార్ బాగ్‌లో టిప్పుసుల్తాను కట్టించిన హైదరాలీ గోరీ గలదు. దీని తలుపు ఏనుఁగదంతముతో నిర్మింపఁ బడెను. కోటలోని శ్రీరంగనాథుని ప్రాచీన మందిరము గలదు. ఇచ్చట గౌతమ మహాఋషి తపస్సు చేసెనని చెప్పుదురు ఈ ప్రదేశ మత్యంత మహిమాన్వితమైనది. మైసూరుకు బెంగుళూరు రాజధాని. ఇది ఆరోగ్యవంతమైన ప్రదేశము. ఇది సముద్రమునకు 3000 అ. ఎత్తున నుండును. 25 చ. మైళ్ళ వైశాల్యమును గలిగి యున్నది. షుమారు 8 లక్షల జనాభా కలదు. అన్ని రాష్ట్రములకు సంబంధించిన వారిందుఁ గలరు. ఇందుఁగల సుందరవంతమైన యుద్యాన వనములు దీర్చిదిద్ది నట్లుండును. అందమైన బాటలు, చూపరులకింపు సొంపుగొలుపు ప్రభుత్వభవనములు పారిశ్రామిక కేంద్రములు గలవు. వీధులెల్ల మిక్కిలి యందమును గలిగి యుండును. బెంగుళూరునందు క్రీ॥ శ॥ 1537 లో కెంపగౌడ అను రాజు నిర్మించిన మట్టికోట గలదు. క్రీ॥ శ॥ 1761 లో హైదరాలి దీనికి రాతికట్టడమును గట్టెను. దీనికి నైరృతిగా మైలుదూరమున గవి గంగాధరేశ్వరాలయము గలదు.

దీనికేఁ బదిమైళ్ళ దూరమున బంగారు పేటకలదు. సామాన్యముగా నిచ్చటనే బంగారము లభింపుచున్నది. ప్రఖ్యాతిగలిగిన లేపాక్షి యిక్కడికి దగ్గరగాఁగలదు. లేపాక్షి యొక చిన్నగ్రామము. పూర్వము రాముఁడు సీతనన్వేషింపుచు నీ స్థలమునకు వచ్చెను. ఇచ్చటనే రెక్కలు తెగిపడియున్న జటాయువు రామునకు గన్పించెను. అంత శ్రీరాముఁడు లేపక్షి జటాయువును పిలిచినాఁడట. అందుచేత నీ గ్రామమునకు లేపాక్షియను పేరుగలిగెను. ఇందు 'కూర్మశైలము' అను నొక చిన్నబండరాతి మీఁద నొక దేవాలయము గలదు. ఈ యాలయంబంతయు విగ్రహంబుల జెక్కఁబడిన శిలలతో నిర్మితంబై యున్నది దీనినిఁ బౌరాణికంబుగఁ బాపనాశేశ్వరాలయంబని. చారిత్రాత్మకముగా వీరభద్రేశ్వరాలయమని, ప్రస్తుతము దుర్గాదేవియాలయమని పిలుతురు. ఈ దేవాలయము చాలఁ బురాతనంబైనది. విజయనగర సామ్రాజ్య పతన దివసములందు నా సామ్రాజ్యపు సేనా నాయకులిరువురు విరుపణ్ణ వీరణ్ణ అను నిరువురు సోదరులు తమయిష్టదైవమైన వీరభద్రస్వామినిఁ బ్రతిష్ఠించిరి. ఇందుఁగల చిత్రములు, ప్రఖ్యాతమైన యజంతా గుహాలందువలెఁ గాక హిందూవుల పురాణగాథలను వెల్లడించును. ఇందుఁ గిరాతార్జునీయము, మాధవవర్మకథ మున్నగునవి కలవు. లోపల విరుపణ్ణ, వీరపణ్ణలు తమ కుటుంబములతో సహా శ్రీవీరభద్రస్వామికి నర్చనము చేయుచున్నట్లు చిత్రంబు లతి మనోజ్ఞంబుగఁ జిత్రింపఁబడినవి. నేటికవి చెక్కుచెదరక కలవు. ఈ దేవాలయంబున కనతి దూరంబున, నేకశిలా నిర్మితమైన బసవన్న

అను పేరుతోఁ గల నందీశ్వర విగ్రహము కలదు దీని యెత్తు షుమారు 20 అడుగులుండును. పొడవు 30 అడుగులు గలదు. ఈ విగ్రహము నిర్మించిన ప్రముఖశిల్పి పసవన్న. ఆతని పేరుతోనే యీ నందినిఁ బిలువఁబడు చున్నది. దీనికేఁ బది మైళ్ళ దూరమున నొక పర్వతముమీఁదఁ గుమారస్వామి మందిరము కలదు. దీనికైదు గోపురములు కలవు ఇమ్మందిర సమీపమున నాలుగు మందిరములు కలవు. పూర్వము విఘ్నేశ్వరుఁడు, కుమారస్వామి తమ వివాహంబులు ముందు జరుగవలెనని యిద్దరును పట్టుఁబట్టిరి. అందుచేత నీశ్వరుఁడు మీలో నెవరుముందుగా భూమికిఁ బ్రదక్షిణంబును జేసి తిరిగివత్తురో వారికి ముందుఁ బెండ్లిగావింతునని పలికెను.

కుమారస్వామి భూప్రదక్షిణంబునకుఁ బోయెను. విఘ్నేశ్వరుడు తల్లిదండ్రులకు నేడు పర్యాయములు ప్రదక్షిణమును గావించి భూప్రదక్షిణాధిఫలమును నొందెనని పలికెను. అందుల కీశ్వరుఁడు సంతసించి విఘ్నేశ్వరునకు ముందు వివాహమును జేసెను. పిమ్మట కుమారస్వామి భూప్రదక్షిణంబును జేసి, తిరిగి వచ్చుచుండఁగా నారదుఁడు మధ్యదారినఁ గనఁబడి విఘ్నేశ్వరునకు వివాహము జరిగెనని చెప్పెను. అందులకు కుమారస్వామి తల్లిదండ్రులపై నలిగి, యీ పర్వతంబున నివసింపఁబూనెను. ప్రతిఅమావాస్యకు మల్లికార్జునరూపమున నీశ్వరుఁడును, ప్రతిపూర్ణిమకు పార్వతియుఁ బుత్రునిఁగాంచుట కిచ్చోటకు వచ్చెదరఁట.

క్రీ॥ శ॥ 1350 మొదలు 1565 వఱకుఁ బాలింపఁబడిన విజయనగర సామ్రాజ్యమునందు గల హంపి, హాస్పేటకుఁ దూర్పుగ షుమారు 7 మైళ్ళనఁ గలదు ఇది కిష్కింధకు రాజధాని. ఇచటఁగల విఠలాలయము మిక్కిలి యందమైనది. దీనిని క్రీ॥ శ॥ 1513 వ సంవత్సరములో శ్రీకృష్ణదేవరాయలు కొంతవఱకు నిర్మించెను. తరువాతఁ గొంతభాగమును అచ్యుత రాయలు నిర్మించెను. ఇచటఁగల కల్యాణమంటపము, రాణి జలక్రీడాసరస్సు, పద్మగృహము చూడఁదగినది. ఇచట నాంజ నేయపర్వతముమీఁద విరూపాక్షాలయము గలదు. ఇమ్మం దిర గోపురము బయటినుండి చూచిన 11 అంతస్థులుకలఁది గను, లోనుండిచూచిన నాలుఁగు అంతస్థులు గలఁదిగను గన బడును. ఇమ్మందిరంబునకుఁ దూర్పున బంగారు పూయఁ బడిన యొక పెద్ద స్తంభము గలదు. ఈ యాలయంబునకు దక్షిణంబున హేమకూటంబను నొక పర్వతంబు కలదు. పుణ్య పురుషుల కిది బంగారు శైలంబుగాఁ గనఁబడును. దీనిపైఁ బం డెండు మందిరంబులు కలవు. ఇచ్చట గజశాల, ౦ంతి రథము, లంజదిబ్బ చూడఁదగినవి.

ఒక దిబ్బమీఁద బౌద్ధులు కాలక్రమమున స్త్రీలతో వ్యభిచరించుట మొదలిడిరి. అందుచే నా దిబ్బకు లంజదిబ్బ అని పెరుగలిగినది. దీనికి అరమైలు దూరమునఁ గొంచె ముత్తరంబుగఁ గొండలమధ్యఁ బుష్యమూకపర్వతమును జుట్టి తుంగభద్రానది ప్రవహించుచున్నది

దీనినిఁ చక్రతీర్థమందురు. దీనికి దక్షిణమున శ్రీరాముని దేవాలయముకలదు. వాలి సుగ్రీవుల రాజధాని కిష్కింధానగర మిదియే. వాలిని దహించిన ప్రదేశమిప్పటికిఁ గలదు. విరూపాక్షమందిరంబునకు షుమారు 4 మైళ్ళ దూరమున మాల్యవంత పర్వతముగలదు. దీనిమీఁద శ్రీరామలక్ష్మణులు వనవాససమయమున వర్షాకాలమును గడిపిరి. దీనికి దగ్గరగా స్ఫటికశిలయను ప్రదేశముగలదు. ఇందొక గుహయందు శ్రీరామలక్ష్మణులు, ఆంజనేయుఁడు, సుగ్రీవుని విగ్రహంబులు కలవు. హంపియందు ద్రావిడ శిల్పకళా మనోజ్ఞము విజయనగరపూర్వవైభవము నేటికినిఁ గాన్పడును.

281

# తిరుపతి

భారతదేశమునందుఁ బవిత్ర క్షేత్రముగాఁ జారిత్రాత్మకముగఁ బ్రసిద్ధిఁజెందినది తిరుపతి. అనాదిగా నీ క్షేత్రము ప్రఖ్యాతిఁజెందినది. శ్రీ మహావిష్ణువు వేంకటేశ్వరుఁడను నామంబునఁ దిరుమలకొండలపై వెలసెను. ఇందొక పురాణ కథకలదు. నైమిశారణ్యమున మహర్షులు యజ్ఞముజేయఁ దొడంగి దాన హవిర్భాగమునుబొంద నర్హులెవ్వారని యాలోచింపుచుండిరి. అట్టి సమయమున నారదుఁ డచ్చటికి వచ్చెను. అప్పుడు వారు నారదమహర్షికిఁ బ్రణామము లొనరించి తా మొనరించు యజ్ఞమున హవిర్భాగమునుగొను నర్హుఁడెవ్వఁడో నిర్ణయించి పలుకుఁడని విన్నవించిరి. అందులకు నారదుఁడు వారితో హవిర్భాగమును గొనుటకు విష్ణుమూర్తి యర్హుఁడని పలికెను. అందుల కచ్చటనున్న భృగుమహర్షి త్రిమూర్తులఁ బరీక్షించినఁగాని, హవిర్భాగమును గొన నర్హులుగారని యందుకుఁ దాను బూనుకొందునని పలికెను. మహర్షు లా భృగుమహామునిని నకార్యమునకుఁ బ్రోత్సాహపఱచిరి. అంతట భృగుమహర్షి బయలుదేరి బ్రహ్మలోకంబునకుఁబోయెను. అచ్చట బ్రహ్మ సరస్వతీ దేవితో సృష్టివ్యాపారంబులమునిఁగి యమ్మునిని గౌరవింపక పోయెను. అందుఁ కమ్ముని మిక్కిలి కోపఁగించి యా బ్రహ్మను లోకంబునఁ బూజార్హత లేకుండుఁగాకయని శపిం

చెను. పిదప నా భృగుమహర్షి కైలాసపర్వతంబునకుఁ బోయెను.

అచ్చటఁ బార్వతీదేవితోఁ బరమేశ్వరుఁడు నృత్యమును గావింపుచు, భృగుమహర్షిని గౌరవింపకపోయెను. అందుల కా మహర్షి కోపగించి శివునకుఁగాక లింగాకారమునకే పూజ గలుగునటుల శపించి, వైకుంఠమునకుఁ జోయెను. అట శ్రీ మహావిష్ణువు లక్ష్మీదేవితో విలాసమున నుండెను. అందు లకు మహర్షి కోపగించి, తన ఎడమ కాలితో శ్రీమహావిష్ణువు వక్షస్థలమునఁ దన్నెను. అంతట విష్ణుమూర్తి యమ్మహర్షిని శాంతింపఁజేయుచు, నాతని పాదముల నొత్తుచు, నతని యడి కాలియందున్న కన్నును మూసివైచెను. అప్పు డా మహర్షికి గర్వ మంతరించి, శ్రీమహావిష్ణువును దన తప్పిదమును క్షమింపు మని కోరెను. అంతట శ్రీమహావిష్ణువు మహాఋషిని ననుఁ గ్రహించి వీడ్కొలిపెను.

అది చూచి లక్ష్మి కోపగించి, విష్ణుమూర్తి ఎంత వేడుకొన్నను వినక భూలోకమునఁ జేరి తపస్సునకుఁ బూనెను. అప్పుడు విష్ణుమూర్తి లక్ష్మీదేవి విరహంబును సైపఁజాలక, తాను వైకుంఠమును వీడి భూలోకమునకు వచ్చి యొక వల్మీకమందు నివశింపఁ దొడంగెను. అంతట నీ విషయంబును శివ బ్రహ్మ లెఱింగి విష్ణుమూర్తికి నాహారంబు నొసంగుటకు వారు గోవత్సంబులుగా మారి భూలోకంబునకు విచ్చేసిరి.

ఆదిలక్ష్మి యెఱింగి వానిని నొక రాజునకు విక్రయించి తపస్సునకు మఱలఁ బూనెను. ఆ యావు ప్రతిదినంబును బోయి

యా విష్ణుమూర్తికి దుగ్ధంబుల గొసంగుచుండెను. గోపాలకు డీ విషయంబు నెఱింగి, యా వల్మీకముపై, గణ్ఱతోఁ గొట్టెను. ఆ దెబ్బ శ్రీమహావిష్ణువునకుఁ దగిలెను. అంత విష్ణువు బయటకువచ్చి వానినిఁ జంపెను.

పిమ్మట శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవిని వెదకుచు, వకుళాదేవియను మునిపత్ని యాశ్రమము చేరెను. అచట వకుళాదేవి శ్రీనివాసుని నాదరించి, మిక్కిలి ప్రేమతోఁ జూచుచుండెను. ఇట్లుండ నా శ్రీనివాసుఁ డుద్యానవనమున విహరించు నాకాశరాజుకుమార్తె పద్మావతినిఁ గాంచెను. ఆమె శ్రీనివాసునిఁ జూచెను. అంతట నొండొరులు ప్రేమించుకొనిరి. తరువాత శ్రీనివాసుఁడింటికివచ్చి తన మాతృమూర్తి యయిన వకుళాదేవికిఁ దనకోరిక వెల్లడించెను. అంతట నా వకుళాదేవి ఆకాశరాజు సన్నిధికిఁబోయి. తన కుమారుఁడైన శ్రీనివాసునికోరిక దెలియఁజేసెను

ఆకాశరాజు వకుళాదేవి కోరికను దన భార్యకు, కుమార్తెకుఁ దెలియఁజేసి, వారి యభిమత ప్రకారము తన సుతను శ్రీనివాసున కొసఁగుటకు సమ్మతించినటుల వకుళాదేవికిఁ జెప్పెను. అంతట నా రాజు దైవజ్ఞులఁ బిలిపించి ముహూర్తము నిర్ణయించెను. పిమ్మట వకుళాదేవి సంతసించి నిజనివాసంబునకుఁజేరి, యా శుభవార్తను శ్రీనివాసునకుఁ దెలియఁ జేసెను. అంతట శ్రీనివాసుఁడు వివాహంబునకు వలయు ధనమును కుబేరునికడనుండి యప్పుగాఁ గైకొనెను. అంతట బ్రహ్మాది దేవతల సమక్షమున శుభముహూర్తమునఁ బద్మావతీ శ్రీనివాసులకుఁ బెండ్లియయ్యెను.

పిమ్మట శ్రీనివాసుఁడు పద్మావతితో నిజనివాసంబునకు వచ్చుచుండెను. నారదుఁడు లక్ష్మీదేవితో నీ వార్తను దెలియఁజేసెను. అంతట లక్ష్మి కోపగించి శ్రీనివాసునిఁ గలిసికొనుటకు వచ్చెను. అప్పుడు శ్రీనివాసుఁడొఱింగి, తిరుమలపై శ్రీవేంకటేశ్వరరూపంబును ధరించెను. తరువాత తిరుచానూరులో పద్మావతి అలివేలుమంగమ్మగాను, కొల్లాపురములో లక్ష్మీదేవి వెలసిరి నాటినుండి తిరుమల పవిత్ర క్షేత్రమై చంద్రగిరిరాజులచే దేవాలయము నిర్మింపఁబడెను. చంద్రగిరిదిశను, తిరుపతినను రెండు మార్గముల మెట్లు గలవు. కొండనెక్కుటకు మెట్లుగలవు. మార్గమధ్యమున విశ్రాంతి స్థానములు చల్లని జలములు లభించును. లేకా వెంకటనాయకః కవిలో వేంకటేశ్వరుఁడు ప్రత్యక్షదైవమని యందురు. ఈ స్వామి సర్వదేవతా స్వరూపుఁడు శ్రీనివాసుఁడగుటచే విష్ణువు, అడుగున నీశ్వరలింగము మీఁద నుండుటచే నీశ్వరుఁడు భుజంగవలయాదు లుండుటచే సుబ్రహ్మణ్యేశ్వరుఁడు అయి యున్నాఁడు. ఈ పర్వతంబునకు సముద్రస్థలము 2500 అ. ఎత్తు ఆలయసమీపమునఁ బుష్కరిణి తీర్థము గలదు. శ్రీస్వామి దేవాలయంబునకు షుమారు 3 మైళ్ళ దూరమునఁ బాపనాశనిగంగ కలదు. ఈ మార్గము ప్రకృతిసౌందర్యముచే నేత్రపర్వ మొనగ్చును.

ఇది పర్వతములమధ్యనుండి ప్రవహించును. కొండ క్రింద కపిలతీర్థము గలదు. తిరుపతికి 2 మైళ్ళ దూరమున తిరుచానూరు గలదు. ఇందు అలివేలుమంగమ్మ దేవాలయము కలదు. దీనినే మంగాపురమనికూడ నందురు. ఈ

ఏడుకొండలు ఆదిశేషుని యాకారము గలిగియున్నది. ఏడు కొండలు ఆదిశేషుని ఏడుశిరములంట. వీనిని దైవస్వరూపంబు లుగ భావించి అంబరీషుఁడు, ప్రహ్లాదుఁడు మున్నగు మహా భక్తు లిందు తపస్సును జేసిరి. విజయనగరాంధ్ర సామ్రాట్టు శ్రీకృష్ణదేవరాయ లనేక పర్యాయములు శ్రీ స్వామిని దర్శించి యమూల్యములైన కానుకలు, మణిహారము లర్పిం చెను. ఆలయము లోపలిభాగమున శ్రీకృష్ణదేవరాయలు, చిన్నమ్మదేవి, తిరుమలదేవుల కంచువిగ్రహములు కలవు. అచ్యుతదేవరాయలు వేంకటేశ్వరస్వామివారి కనేకములైన మణిహారము లర్పించెను. వారి కంచువిగ్రహముకూడ దేవా లయప్రాంగణమందుఁ గలదు. తిరుమలలో శ్రీ స్వామివారికి నిత్యకళ్యాణము పచ్చతోరణముగ నుండును. ఇచ్చటకు షుమారు 67 మైళ్ళదూరమునఁ దిరువళ్ళూరు కలదు. ఇంట వరదరాజస్వామి మందిరము కలదు. స్వామిని వీరరాఘవ స్వామియని కూడఁ బిలుతురు ఇది ప్రసిద్ధియైన చారిత్రా త్మకప్రదేశము. దీనికి దక్షిణముగ 11 మైళ్ళదూరమున భూత పురి కలదు. అది శ్రీ రామానుజస్వామి జన్మస్థానము. ఇందుఁ గూర్చి యొక కథ కలదు.

సృష్ట్యారంభంబునఁ బరమేశ్వరుఁడు విభూతినలఁదికొని నృత్యము గావింపు చుండెను. అప్పుడు భూతములా శివునిఁ గాంచి పరిహసించెను. అందులకుఁ బరమేశ్వరుఁడు కోపించి, భూతంబులు తనకు దూరమగునటుల శపించెను. అంతట భూతంబులన్నియు మిక్కిలి విచారించి బ్రహ్మకడకుఁ జేరి, తమ యవజ్ఞకుఁ గలిగిన ఫలమును విన్నవించినవి. అప్పుడు

బ్రహ్మ కరుణించి భూలోకమున సత్యావతి తీర్థమునఁ గేశవు నారాధింపుఁడని చెప్పెను. అంతట భూతంబులనేక సంవత్స రంబులు కేశవుని సేవించెను. అప్పుడు శౌరి సంతృప్తుండై వానికి దర్శన మొసంగి, శివునిఁ బ్రార్థించి, మఱల భూతంబు లను శివుని గణములగునటులఁ గావించెను.

ఆ సమయమున నాది శేషువు సత్యాశ్రయ తీర్థమందొక సరస్సును నిర్మించెను. శివుని గణములందుఁ జేరిన భూతంబు లఁటనొక నగరంబును నిర్మించెను. ఆ సత్యాశయ తీర్థమే ప్రస్తుత పెరంబదూరు. ఇది మదరాసుకు షుమారు 10 మైళ్ళ దూరమునఁ గలదు. ఇచ్చటికి షుమారు 60 మైళ్ళ దూర మునఁ జెన్నపట్టణము కలదు. ఇది హిందూ దేశ నగరములలో మూఁడవది. దీనిని మదరాసు అందురు. ఇది మిక్కిలి యంద మైన పట్టణము. చంద్రగిరి రాజులయొద్ద తూర్పుయిండియా సంఘము వారు కోట నిర్మించు కొనుటకుఅడిగి తీసికొని సెంటు జార్జి పోర్టును నిర్మించిరి. ఇది సముద్రపు యొడ్డునఁ గలదు.

పెయ్యాళ్వారు అను వైష్ణవభక్తునకు సంబంధించిన శావి మైలాపూరులోఁ గలదు కోటలో ప్రదర్శనశాల, జంతు ప్రదర్శన లతిప్రసిద్ధములు. మైలాపూరునందుఁ గపాలేశ్వర స్వామి దేవస్థానము మిక్కిలి ప్రసిద్ధమైనది. అడయారులోని వృక్షము చూడఁదగినది. ఈ పట్టణమున రామకృష్ణమఠముఁ గలదు. ఇందు శ్రీ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకా నంద సిద్ధాంతములను నాశయంబులను గ్రంథబోధనరూపంబు లుగాఁ బ్రచారమును గావింపఁబడుచుండును. ఇది యాంధ్ర దేశమున కపారసేవఁ జేయుచున్నది.

# భద్రాచలము

ఆంధ్రదేశమునందే కాక యావ ద్భారతదేశమున ప్రఖ్యాతిఁజెందినది భద్రాచలము. పరమపావనియగు గౌతమి నాసిక్‌లోఁ బుట్టి భద్రాచలము, రాజమండ్రిమీఁదుగా సముద్రమునఁ గలసిపోయెను. విజయవాడనుండి సికిందాబాదు లైనులో డోర్నకల్‌లో మారి, కొత్తగూడెంలో దిగి గోదావరివఱకు బస్సుకలదు. గోదావరిదాటిన భద్రాచల రామాలయము కనఁబడును. గోదావరి షుమారు 900 మైళ్ళు ప్రవహింపుచున్నది. ఈ యాలయమందలి మూర్తులు స్వయం సముద్భవము.

పూర్వము పర్వతశ్రేష్ఠుఁడగు మేరువు సంతానమునకై బ్రహ్మనుగూర్చి తప మాచరించెను. అందులకు బ్రహ్మ యానందించి, యతనికిఁ బ్రత్యక్షమయ్యెను అంతట మేరు నజుఁడు నొక పుత్రు నర్థించెను. పిమ్మట బ్రహ్మ యనుగ్రహించెను. మేరువునకు బ్రహ్మప్రసాదమున నొక పుత్రుఁ డుదయించెను. అతనిపేరు భద్రుఁడు. భద్రుఁ డొకనాఁడు దండ్రియానతిని భద్రాచలమున గౌతమిలో స్నాన మొనరింపుచుఁ దపమాచరింపుచుండెను. అతని తపంబునకు సంతసించి సీతారాములు ప్రత్యక్షమై, యతని కోరికప్రకార మా పర్వతంబున నివసించుటకు సమ్మతించిరి. అందువలన నాఁటినుండి భద్రాచల మయ్యెను.

పూర్వ మొకప్పుడు భద్రిరెడ్డిపాలెము వాస్తవ్యురాలు పోకల దమ్మక్క యను భక్తురాలుకుఁ గలయందు సీతా రాములు కనఁబడి "తమ మూర్తులు భద్రగిరియందుఁ గల వనియు, వాని నారాధింపు" మని పలికిరి. అమ్మహాభక్తురాలు వేగమ్ముగా భద్రశైలమ్మునకుఁ బోయి, యమూర్తులను సందర్శించి సీతారాములకు చిన్న దేవాలయమును నిర్మించెను. తరువాత రామదాసు ప్రస్తుత దేవాలయము నిర్మించెను.

భద్రాద్రికి సమీపమున నేలకొండపల్లియను గ్రామము కలదు. అందు గోపన్నయను శ్రీరామభక్తుఁడు కలఁడు. అతనికిఁ గమల యను భార్యకలదు. ఆమె మహాపతివ్రత. ఆ పుణ్యదంపతులకు రఘురాముఁడను కుమారుఁడుండెను. గోపన్నకు అక్కన మాదన్న అను నిఱువురు మేనమామలు కలరు. వారు గోలకొండ నవాబుకడ మంత్రులుగా నుండిరి. తమ మేనల్లుఁడగు గోపన్నకు భద్రాచలం తాలూకాకు తాహసీలుదారు పదవిని నవాబుచేఁ జెప్పి యిప్పించిరి. గోపన్న తహశీలుదారు పదవిని నిర్వహించుచు, శ్రీరామ భక్తిపరుఁడై యుండెను.

అంతట నాతఁడు యోచించి శ్రీరామునకు దివ్యాలయంబును నారులక్షల వ్యయించి నిర్మించెను. అది సర్కారు ధనము. ఈ విషయము నవాబునకుఁ దెలిసి గోపన్నను బందీ చేసి, యనేక హింసలఁబెట్టెను. గోపన్న శ్రీరామచంద్రుని నెన్నో విధములఁ బ్రార్థించెను. ఆ మహాత్మునకు కొంతకుఁ గరుణఁ గలుగలేదని విసిగి విషమును త్రావ [illegible].

అప్పుడు శ్రీరామచంద్రునకు దయఁగలిగి, తానీషాకు నారు లక్షల రూపాయలఁజెల్లించి, గోపన్న ననుగ్రహించెను. తానీషాకు గోపన్నభక్తి ప్రాభవంబును మెచ్చికొని మిక్కిలి గౌరవించి నాఁటినుండి రామదాసుగా గోపన్న పేరుబొంది మోక్షమును బొందెను.

భద్రాచల పరిసరప్రాంతములందుఁ బర్ణశాల, సీతాదేవి స్నానముగావించిన వాగు, లక్ష్మణపర్వతము, జటాయుగుట్ట, ఉష్ణగుండము, చుప్పనాతిగుట్ట చూడఁదగినవి. ఇప్పటికి నిజాంప్రభువు సీతారామ కళ్యాణసమయమున ముత్యాల తలంబ్రాలు పంపు నాచారము కలదు.

భద్రాచలమునకు షుమారు 115 మైళ్ళదూరమున చాందా కలదు. ఈ గ్రామము ఐదున్నర మైళ్ళు పొడవుగల రాతిగోడలతోఁ బరివేష్టింపఁబడి యుండెను. ఇచ్చట నచలేశ్వర, మురళీధర, కాళీమందిరములు కలవు. ఇచ్చటకు షుమారు 7½ మైళ్ళ దూరమున వార్ధాకలదు. గాంధీజీ చిరకాలము నివశించిన సేవాగ్రామాశ్రమము కలదు. ఇచ్చట గాంధీజీ వదలిపెట్టిపోయిన వస్తువులు భద్రపరుపఁబడినవి.

భద్రాచలముకడ గోదావరిపైని వంతెన నిటీవల నిర్మింపఁబడినది. శ్రీరామచంద్రు నాలయము అభివృద్ధికార్యక్రమములు మిక్కిలిగ జరుగుచున్నవి. ఆంధ్ర ప్రజలకు నారాధ్యదైవము శ్రీరామచంద్రుఁ డెల్లర కండనుండఁగలఁడని యాశింతును.

—:o:—

# దక్షారామము

## (కుమార భీమేశ్వరుఁడు)

ఆంధ్రప్రదేశ్‌నందు మిక్కిలి కీర్తిఁగాంచిన చారిత్రాత్మక పుణ్యక్షేత్రములలోఁ దక్షారామ, భీమేశ్వర క్షేత్రము ముఖ్యమైనది. ఇది చామర్లకోటకు దక్షిణముగ షుమారు 3 ఫ. దూరమున నీ మందిరము కలదు. క్రీ॥ శ॥ 10 శతాబ్దమున జాళుక్యభీముఁడీ యాలయమును నిర్మించెను. ఆ రాజు 108 యుద్ధము లొనరించెను. దానికిఁ బ్రాయశ్చిత్తముగ 108 శివాలయంబులను నిర్మించెను. వానికి 108 అగ్రహారముల నిచ్చెను. భీమేశ్వరునకుఁ గూడ నొక యగ్రహారము కట్టించి యొసంగెను. దాని పేరు భీమవరము మున్నది చాళుక్యభీమ వరమని కీర్తిఁజెందెను. భీమేశ్వరాలయము పంచారామములలో నొకటి. తారకాసురుని కంఠమందలి అమృతలింగ పంచశకములందిది యొకటి. దీనికిఁ జుట్టు షుమారు 18 అ. ఎత్తుఁగల ప్రాకారములు కలవు. ఈ ప్రాకారమునకు నలు మూలల 4 గోపురములు కలవు యాత్రికులుత్తర ద్వారము నుండి తూర్పుద్వారమునకు వచ్చిన నొక బ్రహ్మాండమైన కోనేరు గనఁబడును. దీనిమధ్య నొక మంటపము కలదు. ధ్వజస్తంభమునకుఁ గొంచెము ముందుగ బృహదాకారము గల నందీశ్వర విగ్రహము గలదు. దీనికి నెడమదిశన బాలా త్రిపురసుందరీ మందిరము కలదు. దీని [illegible] భీమేశ్వర

స్వామి లింగము కలదు. ఈ లింగము షుమారు 18 అ. ఎత్తు గలిగి యున్నది. మూల విరాట్టును సందర్శించుటకుఁ గిందఁ జీకటిగనుండు గదియందు దీపంబును వెలిఁగించి చూడవలయును. ఈ యాలయ శిల్పవిన్యాసము, ఆలయ నిర్మాణము మిక్కిలి ప్రశంసాపాత్రమై యుండును.

ఈ యాలయమున కుత్తరదిక్కున నొక మూలగ నొక మంటపముఁ గలదు. ఈ మంటప మధిరోహించి యూపిన నూఁగునఁట. ప్రాచీనశిల్పులు తమ విశేష శాస్త్రజ్ఞతను తెలియఁజేయుట కిటుల నిర్మించిరి. ఆలయ పశ్చిమద్వారంబునకుఁ గొలఁది దూరంబున నొక రాతి స్తంభమును, దానిపై నొక నందివిగ్రహము కలదు. భీమేశ్వరాలయమునకుఁ బశ్చిమంబుగ 2 ఫర్లాంగుల దూరంబునం దొక విష్ణ్వాలయంబు కలదు. ఇందలి మూర్తులు మాండవ్య నారాయణస్వామి, శ్యామలాంబిక కలవు. ఇందు విష్ణువిగ్రహముక్రిందఁ బరుసవేది కలదనియు, దానిని దొంగిలించుట కొక చోరుఁడు ప్రయత్నింప నాతని చేయియం దంటుకొనియుండి రాలేదనియు, నప్పు డాతఁడు స్వామినిఁ బ్రార్థించి క్షమార్పణ గోరఁగా నాతని చేయి యూడివచ్చెనఁట. దీనికి షుమారు 50 మైళ్ళ దూరమున రాజమహేంద్రవరము గలదు.

పూర్వ మీ నగరమును రాజధానిగఁ జేసికొని విమలాదిత్యతనయుఁడు రాజరాజనరేంద్రుఁడు క్రీ॥ శ॥ 11 వ శతాబ్దమునఁ బరిపాలించెను ఇమ్మహారాజు భాషోద్ధారకుఁడు. ఈయన అస్థానమం ప నన్నయభట్టు అను మహాకవీంద్రుఁ డుండెను. ఆనాడు బౌద్ధ, జైన మతములు వ్యాప్తిగా

నుండెను. అందుచేత దేశము తిరిగి కర్మభూమిగా విలసిల్లుటకు వేదవ్యాసకృతమైన మహాభారతము నాంధ్రీకరింపుమని నన్నయభట్టారకుని వేడికొనెను. నన్నయభట్టు మహారాజు కోరికపై ఆది, సభా, అరణ్యపర్వ శేషములను దెనిఁగించి కీర్తి శేషుఁడయ్యెను. తరువాత 13 వ శతాబ్దమున తిక్కన సోమయాజి, చదలవాడ ఎఱ్ఱాప్రగ్గడ అను నిరువురా శేషభారతమును బూర్తిగావించిరి.

15 వ శతాబ్దమున నీ నగరము రెడ్డిరాజుల పాలనయం దుండెను. ఆ సమయమునఁ గవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడు రెడ్డిరాజుల యాస్థానమునఁ గవియై, కాశీఖండమును రచించి ప్రభువగు వీరభద్రారెడ్డి కంకిత మొసంగెను పూర్వ మిఁట నొక కోఁట యుండెడిది. దాని శిథిలములుమాత్ర మిప్పటికిఁ గనఁబడును. ఈ పట్టణము గోదావరీతీరమునఁ గలదు ఇచ్చట గోదావరి పొడవునను రేవులు గలవు ఇందుఁ గోటిలింగముల రేవు, పుష్కరఘట్టము, మార్కండేయఘట్టము ప్రధానములు. పుష్కరఘట్టమున జలచరములబాధ యుండదని బ్రహ్మ వర మొసంగెను.

గోదావరీతీరమునఁ గోటిలింగేశ్వరస్వామి ప్రఖ్యాతిఁ జెందిన దైవము. పూర్వము దేవతలు కాశీక్షేత్రమహాత్మ్యము తెలుపుటకై రాజమహేంద్రవరమును దక్షిణ కాశీగఁ జేయ సంకల్పించి, యొకరాత్రియందుఁ గోటిలింగముల నిచ్చటఁ బ్రతిష్ఠింపసాగిరి. కాశిమీఁది ప్రేమచే శివుఁడు దానిని విడువ లేక తుదిలింగమును బ్రతిష్ఠింపుచుండఁగఁ దొలికోడి కూసెను.

అక్కారణమున నిచ్చట ఒకటితక్కువ కోటిలింగము లున్న వని, ఇవి కాశీకి సమానమైన క్షేత్రమని పలుకుదురు. ఇచ్చ టకు దాపుగా మార్కండేయస్వామి యాలయము కలదు. ఇఁట స్వామి కొకదిశనఁ బార్వతియు, మఱొకదిశన వీఘ్నేశ్వ రుఁడు కలరు. మార్కండేయుఁడు శంకరునిఁగూర్చి తప మాచ రించి, యాయన యనుగ్రహమునుపొందిన ప్రదేశ మిది.

ఆచ్చటనే మార్కండేయుఁడు స్వామినిఁ బ్రతిష్ఠించెను. ఇందు రత్నాంగి మేడకలదు. ఇచట భూమిలోని కొక గుహా ముఖము కలదు. ఇది పెద్దాపురమువఱకుఁ గలదనియుఁ బెద్దా పురమునఁగల పాండవుల మెట్టమీఁదఁ గల గుహాముఖము దీనికిఁ జెందిన దనియు, బూర్వము రాణులు పెద్దాపురము నుండియు, నీ గుహాముఖమున గోదావరీ స్నానమునకు వచ్చెడి వారనియుఁ జెప్పుదురు. ఇప్పట్టణమునకు కొలది మైళ్ళ దూరమున సారంగధర మెట్టఁకలదు. ఇక్కడనే సారంగధరుని కాళ్లుచేతులు నఱుకఁబడినవి—రాజరాజు క్రీ॥ శ॥ 1019-1061 సంవత్సరాలు పరిపాలించెను. రాజరాజ నరేంద్రునికిఇువురు భార్యలు కలరు. పెద్దభార్య రత్నాంగి చిన్నభార్య చిత్రాంగి. రత్నాంగి కుమారుఁడు సారంగధరుఁడు అపురూప సౌందర్య మూర్తి.

ఒకనాఁడు సారంగధరుఁడు తన మిత్రులతో పావురము లెగరవేయు చుండెను. పావుర మొకటి చిత్రాంగి మేడలోనికిఁ బోయెను. అంత నతఁడు దానినిఁ గొనితెచ్చుటకంపుఁ

బోయెను. అప్పుడామె యితనినిఁ గాంచి ప్రేమించి, తన కోరిక వెల్లడించెను. అందుల కతఁడు నిరాకరించి పోయెను. అప్పుడామె కోపించి రాజుతో సారంగధరునిపై నకారణనింద లనువైచి పలికెను. అంతట కారాజు కోపించి కుమారుని కాళ్లు చేతుల నఱుకుమని భటుల కానతిచ్చెను. వారితనిఁ గొని పోయి, యందునఱికిరఁట. అట్లుచేసిన ప్రదేశమునకు సారంగ ధరగుట్టయని చెప్పెదరు.

గోదావరీతీరమున గోష్పాదక్షేత్రము కలదు. గోదా వరితీరమున గౌతముఁడు ఘోరముగఁ దపమాచరించెను. ఇందులకు దేవతలు భయపడిరి. ఇంద్రుఁడు గోరూపమును దాలిచి గౌతమాశ్రమ సమీపంబునకు వచ్చి ఆశ్రమ వృక్షం బులను ధ్వంసంబును గావింపుచుండెను. అంతట గౌతముఁడు దర్భతో నా గోవును మరలింప నది చనిపోయెను. గోహత్యా నివారణకై గౌతముఁడు గంగను దీసికొనివచ్చెను. గౌతము నిచేఁ దీసికొని రాఁబడిన గంగయే గౌతమి యయ్యెను. ఈ చిహ్నములు గోదావరి నీరు దగ్గినప్పుడు కనఁబడును. అందుచే దీనిని గోష్పాదక్షేత్రమని పిలుతురు. మొదటఁ గోవూరు, తరువాత కొవ్వూరుగా మారెను.

ఇచ్చటకు షుమారు 200 మైళ్ళదూరమున సింహా చలము కలదు. ఇక్కడ పర్వతమున వరాహలక్ష్మీ నృసింహ స్వామి యాలయము కలదు. కొండ నెక్కుటకు సోపానములు గలవు. ఈ పర్వతము షుమారు 850 అడుగుల ఎత్తునఁ గలదు.

ఈ కొండపైని బూర్వపుకోట కలదు. దాని చిహ్నములు నేటికిఁ గానఁదగును. ఇది విజయనగరసంస్థానమునకుఁ జెందినది. ఈ శైల మెక్కుటకు నారంభించినది మొదలు క్రమముగా గంగాధర, గోదావరిధార, కూర్మధార, మాధవధార, ఆకాశధార మున్నగు ధారలు కలవు. ఈ ధారలు నిరంతరము ప్రవహింపుచుండును. స్నానమున కనుకూలంబుగ నుండును.

పూర్వము హిరణ్యకశిపుని వధానంతరము మహాభక్తుడైన ప్రహ్లాదునిచే నీ స్వామి ప్రతిష్ఠింపఁ బడెనట. శ్రీకృష్ణదేవరాయలు గజపతీంద్రుల నోడించి యిందు మూఁడుదినములుండి స్వామికర్చనాదికములొనరించి, యనేకములగు కానుకలర్పించెను. పూర్వ మొకప్పుడు పురూరవచక్రవర్తి విహారము సలుపుచు నీ పర్వతమున స్వామిని సందర్శించి. యీ యాలయము నిర్మించెనఁట. ఈ పర్వత పరిసరమంతయుఁ బ్రకృతిదృశ్యము లతి మనోహరంబుగ నుండును. ఇచ్చటకు దాపుగానున్న విశాఖపట్నము చోళుల రాజధాని. మిక్కిలి యందమైన ప్రదేశము.

ఇచటకు దాపుగా గోస్తవీనది సాగరసంగమస్థలమైన భీమునిపట్నము కలదు. ఇది పాండవవీరుడైన భీమునిచే స్థాపితమైనది. దీనికి దాపుగా పవిత్రక్షేత్రమైన అన్నవరము కలదు ఇందుఁగల పర్వతముపై శ్రీ సత్యనారాయణస్వామి మందిరముఁ కలదు. దీనికి షుమారు 9 మైళ్ళదూరమున పిఠాపురము

కలదు. దీనికి పీఠికాపురము, పీఠపురము, పీఠాపురము, పిఠాపురము అను నామములు కలవు. ఇచ్చట కుక్కుటేశ్వరస్వామి పురుహూతికాదేవి మందిరంబులు కలవు. ఇచ్చట శివలింగము కోడిరూపమునఁ గలిగియుండుటచే నీ స్వామికీ పేరు గలిగెను. లింగమునకు వెనుకభాగమునఁ గుక్కుటాకృతి స్పష్టముగాఁ గనఁబడును. ఈ స్వామి నాసికనుండి జల మెల్ల వేళల స్రవింపుచుండును. ఇది మాఠరవంశమువారికి రాజధానియై, తరువాత వేంగి రెడ్డిరాజ్యములలో నంతర్భాగమై యుండెను.

దీనికి షుమారు 100 మైళ్ళ దూరమున బెజవాడ కలదు, ఇది కృష్ణాతీరమునఁ గలదు. ఈ పట్నము క్రీ॥ శ॥ 6 వ శతాబ్దమునుండియుఁ గీర్తిఁగాంచినటులఁ దెలియుచున్నది. విజయనగర రాజ్యాధిపతులయిన పూసపాటివారికి మూలపురుషుఁడైన మాధవవర్మ యను నతఁడు బెజవాడకు వలసవచ్చి రాజ్యము స్థాపించెను. బెజవాడ మల్లేశ్వరస్వామి యాలయములో నొక సాసనము నితనిగూర్చి యిట్లున్నది. మాధవవర్మ పుత్రుఁడొకనిచేతఁ జింతకాయలమ్ముకొని జీవించు స్త్రీకి, కుమారుఁడు మరణింప, దనపుత్రునిఁ గూల్చెనఁట. అందులకు మల్లేశ్వరస్వామి మాధవవర్మయందుఁ బ్రీతుఁడై బంగారు వర్షము గురిపించి యిద్దఱు కుమారులను బ్రదికించెను. ఈ శాసనములోఁ జెప్పఁబడిన సంవత్సరము శ. స. 5. 4 వ సంవత్సరము.

యుద్ధమల్లుఁడను చాళుక్యరాజు బెజవాడలోఁ గుమారస్వామికి గుడియు, మఠమును నిర్మించెను. ఈ మఠమునందు శైవులు మాత్రమే నివశింపవలెనని, యితరులు నివశించినచో గాశిలో హత్యఁజేసిన పోయెడిపాపమునకుఁ బోవువారనియుఁ దెలిపెను. మఱియు శైవేతరులిందుఁ బ్రవేశించినయెడల దేవస్థానాధిపతులు, రాజులు వారిని వెడలఁగొట్టవలెననియు నటులఁ గావించిన యెడల నశ్వమేధయాగ మొనరించిన ఫలము చేకూరునని తెలిపెను.

ఇది తూర్పుచాళుక్యుల పరిపాలనాకాలమునఁ బ్రధాన నగరమై యున్నది పండురంగఁడు గుణగవిజయాదిత్యుని సేనాపతి. ఇతఁడు వేంగిరాజ్యమును వజృంభింపఁజేసి, ఇప్పటి నెల్లూరుమండలములోని బోయగొట్టముల గైవశమను జేసికొని కందుకూరును బెజవాడయంత నగరముగా మార్చెను. బెజవాడకు పెచ్చవాడ యని నామము కలదు. కాని శాసనములలోఁ బూర్వనామము బెజవాడ అనియు నున్నది. తరువాత విజయశీనాటిక, విజయవాడ అని నామము లేర్పడినవని తెలియుచున్నది.

9 వ శతాబ్దములో కలివిష్ణువర్ధనుని శాసనమున నిది విజయవాటిపుర మని తెలియుచున్నది. అర్జునుఁ డిం ద కీలాద్రిపై బరమేశ్వరునిఁగూర్చి తప మొనరించెననియు నందు కిది విజయవాడ యని పేరు కలిగినదని చెప్పఁదగియున్నది. క్రీ॥ శ॥ 13 వ శతాబ్దములో చాగినాఁతవాటి ప్రభు

వైన చాగి పోతురాజు శాసనములో బెజవాడ విజయవాటి విషయమునకుఁ బ్రిధానగ్రామమనియు, దానిలో జక్కమపూడి, నొంచిడ్లపూడి యను గ్రామములు కలవనియు దెలుపఁబడినది. జక్కమపూడి యిప్పటికినీ బెజవాడ తాలూకాలోఁ గలదు. క్రీ॥ శ॥ 12 వ శతాబ్దము చివరన బెజవాడ కండ్రివాడిలోఁ గలిసిపోయెను. అందుచేత కండ్రివాడ యని పేరుఁ గూడ నున్నట్లు దెలియుచున్నది. గోదావరి మాహాత్మ్యమిట్లున్నది.

పరమేశ్వరుఁడు దన శిరస్సున గంగనుదాల్చి యామె యందు మిక్కిలి మక్కువఁగలిగి యుండెను అది చూచి పార్వతి సహింపలేక గంగను వదలమని శివుని ప్రార్థించెను. కాని నిష్ఫలమయ్యెను. అంతట పార్వతి తన కుమారులైన వినాయకునికిఁ గుమారస్వామికి నీ విషయమును జెప్పి, తవ తపస్సుచేతఁగాని బ్రాహ్మణపుంగవుల వలనఁగాని యీ కార్యము నెరవేర గలదని చెప్పెను. అప్పుడు వినాయకుఁ డామెతోఁ దమముప్వురిచేత నిర్వర్తింపఁ గలదని ప్రత్యుత్తర మొసఁగెను. అంతట భూలోకమున నందనావృష్టి గలిగెను. బ్రాహ్మణులంతట గౌతమాశ్రమమునఁ జేరి, గౌతమ మహాముని మహిమచేత నందు సుఖముగనుండిరి.

ఇదివిని వినాయకుఁడు దల్లియనుమతినిఁగొని బ్రాహ్మణ కార్యమున గౌతమాశ్రమమును జేరెను. అచ్చట నతఁడు గొన్నాళ్లుండి బ్రాహ్మణులను నందుండుట పాడికాదనియు,

వారి వారి స్థానములకుఁ బోవుట మంచిదనియుఁ దెలిపెను. కాని గౌతముఁడు బ్రాహ్మణుల నచ్చటనుండునటులఁ జేసెను. జయవినాయకుని యానతిని గోరూపధారిణియై పంటను బాడు చేయుచుండెను. గౌతముఁడది కాంచి గడ్డిపోచతో దానినదిలింప, నది మరణించెను. అప్పుడు గోహత్యాపాతకము లభించునను భయముచే బ్రాహ్మణాదేశమునఁ బరమేశ్వరుని జాటాజూటమున నున్న గంగను దెచ్చెను. అదియే గోదావరి. గౌతమీగంగ భూలోకమునందీ విధముగ జన్మించెను.

పంచాయతీ
వేమన గ్రంథాలయం,
తేలప్రోలు :: కృష్ణా జిల్లా.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B146 |
| పుస్తకం పేరు | భారతీయచారిత్రకస్థలములు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 299 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | nazma |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |